# 1

'ప్రఫుల్లా, ఓ ప్రఫుల్లా! ఓ ప్రఫుల్లా!'

'వస్తున్నానమ్మా!'

తల్లిపిలవగానే కూతురు దగ్గరకువచ్చింది. 'ఏమిటమ్మా?' అని అడిగింది.

'పరేషుగారింటికి వెళ్ళి ఒక వంకాయ అడిగి తీసుకురా?'

'నేను వెళ్ళనమ్మా. భిక్షమెత్తటమంటే నాకు చాలా సిగ్గుగావుంటుంది' అంది ప్రఫుల్ల.

'అయితే ఏంతింటావ్? ఇంట్లో ఇంకా నుగోలేమీ లేదు' అందితల్లి.

'వట్టి అన్నమే తింటాను. రోజూరోజూ ఈ ముష్టెత్తి తినటం ఏమిటి?'

'జన్మించిందే అటువంటి అదృష్టంతో. దరిద్రులు ముష్టెత్తటంలో సిగ్గెందుకు.'

ప్రఫుల్ల ఏమీ మాట్లాడలేదు. 'నువ్వే ఆ అన్నం పసేదో చూడు, నేను ఏదైనా కూరఏర్పాటుచూస్తాను' అందితల్లి.

'అమ్మా, నామీదఒట్టే, నువ్వుమాత్రంముష్టెత్తటానికి వెళ్ళవద్దు. ఇంట్లో బియ్యమున్నాయి, ఉప్పుంది, పచ్చిమిరప చెట్లున్నాయిదొడ్లో. స్త్రీలకు ఇంతకంటే మరేం కావాలి.'

ప్రఫుల్లతల్లి ఆమెమాటను అంగీకరించింది. పొయ్యిమీదనీళ్ళు పెట్టివున్నాయి, బియ్యం కడిగితీసుకురాటానికి వెళ్ళింది తల్లి.

కానీ బియ్యంకుండను చూచి తల్లి తలబాదుకుంటూ

'అయ్యో! ఇందులో బియ్యంఎక్కడున్నాయి. లేవే?' అంటూ ప్రఫుల్లకు చూపింది. అరగుప్పెడు బియ్యమున్నాయందులో. ఒకమనిషికడుపు నిండటంకూడా కష్టమే.

తల్లి కుండతీసుకొని బయటకు వెళ్ళిపోయింది. 'ఎక్కడికి వెళుతున్నావ్?' అని అడిగింది ప్రఫుల్ల.

'ఎక్కడైనా కొద్దిగా బియ్యంఅడిగి తెస్తాను. లేకపోతే తినటానికి మరేముందింకా?'

'ఇప్పటికి అప్పుదీసుకున్న బియ్యం మనం తిరిగిఇవ్వనే లేదు. ఇకనువ్వు తేవద్దు.'

'ఛీఛీ దరిద్రగొట్టూ, ఏం తిటావ్ అయితే! ఇంట్లో రాగికానీ కూడా లేదు.'

'ఉపవాసం వుంటాను.'

'ఉపవాసం చేసి ఎంతకాలం బ్రతుకుతావు?'

'బ్రతక్కపోతే చస్తాను.'

'నా ప్రాణంకాస్తా పోయిన తర్వాత నీయిష్టంవచ్చినట్లు చేసుకో. నేను బ్రతికివున్నంతకాలం నీ ఉపవాసాలు చూడలేను. ఏదోవిధంగా భిక్షమెత్తయినానసరే నిన్నుపోషిస్తాను.'

భిక్షమెత్తాల్సినంత అవసరమేమొచ్చింది. ఒకరోజు ఉపవాసం చేసినంతమాత్రాన మనిషి చనిపోడుగదా! మనిద్దరం ఇవాళ యజ్ఞోపవీతాలు తయారుచేద్దాం-రేపు అమ్మి డబ్బులు వచ్చేట్లు చూద్దాం.'

'నూలు మాత్రం ఏది?'

'రాట్నం వుందిగా?'

'కానీ ఏకులు ఎక్కడున్నాయి?'

ప్రఫుల్లముఖి తలవంచుకొని ఏడ్వసాగింది. తల్లి కుండ తీసుకుని బియ్యం తీసుకురాటానికి వెళ్ళబోయింది. ప్రఫుల్ల తల్లి చేతిలోనికుండను తీసుకొని దూరంగా పెట్టి 'అమ్మా, నాకు అన్నీవుండగా ఇలా భిక్షమెత్తి అప్పాలు చేసి తినాల్సిన పనేముంది?' అని అడిగింది.

తల్లి కన్నీరు తుడుచుకొని 'అన్నీ వున్నాయమ్మా కానీ అదృష్టమేది' అని అంది.

'అదృష్టమెందుకు ఉండదమ్మా, అత్తగారింట్లో అన్నీ వున్నా తిననోచుకోపోటానికి నే నేమి అపరాధంచేశాను?'

'ఈ దురదృష్ట వంతురాలి కడుపునపుట్టటం ఒక అపరాధం, అదే నీ దురదృష్టం.'

'అమ్మా, విను ఇవాళ నేను గట్టిగా నిశ్చయం చేసి చెపుతున్నాను. అత్తగారింటి అదృష్టంవుంటే తింటాను. లేదా మానేస్తాను. నీ యిష్టం నువ్వేలా అప్పాలు చేసి, అడుక్కొన్నైనా తిను. నన్ను మాత్రం అత్తవారింటికి పంపిరా_'

'అదేమిటమ్మా, అదెలా జరుగుతుంది.'

'ఎందుకు జరగదు?'

'పిలవకుండానే అత్తవారింటికి వెళ్తారా?'

'ఇతరులను అడుక్కొని తినవచ్చుకానీ, పిలవకుండా అత్తవారింటికి వెళ్ళకూడదా ఏం?'

'వాళ్ళు పొరపాటునకూడా నీపేరు తలవటం లేదు.'

'కావచ్చు. అంతమాత్రాన్న నాకు వచ్చిన అవమాన మేముంది. నన్ను పోషించాల్సిన బాధ్యత ఉన్నవారిని

భిక్షమెత్తటంలో నాకేమీ అవమానంగా కన్పించటంలేదు. నాకు హక్కున్నదానినే అడిగి తింటాను. ఇందులో సిగ్గు పడాల్సిందేముంది?'

తల్లి మెదలకుండా ఏడ్వనారంభించింది.

'నిన్ను ఒక్కతెను ఒంటరిగా వదలి పోవాలని లేదు నాకు. కాని నా దుఃఖంపోతే నీకూ కొంతదుఃఖం తగ్గుతుం దనే ఆశతో వెళ్ళిపోగోరుతున్నాను' అంది ప్రఫుల్ల.

తల్లీకూతుళ్ళకు చాలాసంభాషణ జరిగింది. కూతురు చెప్పేది సబబుగానే కన్పించింది తల్లికి. లోలోపుగా తల్లి ఉన్న ఆ కొద్దిబియ్యాన్నే అన్నవండింది. కాని ప్రఫుల్ల మాత్రం ఏవిధంగానూ తినటానికి అంగీకరించలేదు అందు కని తల్లికూడా తినలేదు.

'అయితే ఇక కాలయాపన ఎందుకు? చాలా దూరపు ప్రయాణంగదా' అంది కూతురు.

'ఇలారా, ముందు సి తలదువ్వుతాను' అంది తల్లి.

'వద్దు.'

'మా అమ్మాయినిలోలంకరించాల్సినఅవసరం ఉండదు అనుకొంది తల్లి. 'అలంకరించుకొని నే నెవర్ని ఆకర్షించాలి, ఛీ' అనుకుంది ప్రఫుల్ల

ఇద్దరూ ఆ మలిన దుస్తులతోనే ఇల్లువదలి బయలు దేరారు.

# 2

వరేంద్ర భూమిలో భూతనాథ్ అనే ఒక గ్రామం వుంది. అదే ప్రఫుల్లముఖి అత్తవారి గ్రామం. ప్రఫుల్లముఖి ఎటువంటి హీనదశయందున్నప్పటికీ ఆమె మామగారు హరవల్లభ బాబుగారు మాత్రం చాలా గొప్పవారు. వారిదొక పెద్ద జమిందారీ. రెండంతస్తుల కచేరీ, నివాసానికి ఒక విశాలభవనము, ఒక ఆఫీసు, వీటిచుట్టూ ఎత్తయిన ప్రహరీ, ఒక ఉద్యానవనము, చిన్న సరోవరము కూడా వున్నాయి. ప్రఫుల్లముఖి పుట్టినింటికి ఇది ఆరు క్రోసుల దూరాన వుంది. మరేమీ తినకుండానే తల్లికుమార్తెలిద్దరూ ఇంచుమించుగా మూడవజాముకు ఆ జమిందారు భవనానికి చేరుకున్నారు.

లోనికి వెళ్ళటానికి ప్రఫుల్లతల్లికి ధైర్యం చాలటం లేదు, అడుగు ముందుకు పడటం లేదు. ప్రఫుల్ల దరిద్రురాలుగనుక హరవల్లభ బాబుకు ద్వేషమూ అంటే అదేమీ కాదు. వివాహానంతరం చాలా గందరగోళం జరిగింది. హరవల్లభుడు దరిద్రురాలనే విషయం తెలిసే తనకుమారునితో వివాహానికి అంగీకరించి చేసుకున్నాడు. పిల్ల చాలా అందంగా వుంటుంది, అటువంటి పిల్ల వారికి మరెక్కడా లభించకపోవటం వల్ల ఆ వివాహం చేశారు! ఇటు ప్రఫుల్ల తల్లి, తనకుమార్తెకు గొప్పవారితో సంబంధం కుదిరినందుకు సంతోషించి తనకున్న ఆస్తినంతా వెచ్చించింది వివాహంలో. ఆమె వద్ద ఉన్నదంతా ఆ వివాహంలో హారతి కర్పూరంలా హరించుకుపోయింది. అప్పటినుంచే అన్నానికి కూడా మరీ కటకట ఏర్పడింది. కాని ఆ తల్లి శోభకై చేసిన వివాహం కూడా విధివిధానం వల్ల వ్యతిరేక ఫలితాన్నిచ్చింది.

తన సర్వస్వము వ్యయపర్చి-అయినా ఆమెవద్ద ఉన్నదంతా ఎంత? పాపం, ఆ వితంతువు అందరికీ సంతృప్తి కల్గించలేక పోయింది. పెండ్లివారికిమాత్రం ఆమెఘనంగా విందు చేసింది. కానీ వధువుతరఫు వారినిమాత్రం అటుకులు పెరుగుతో సంతృప్తిపర్చింది. వధువుతరఫు ఇరుగుపొరుగు వారందరూ దీనిని తమకు తీరని అవమానంగా భావించారు. వారంధరూ ఎంగిలి పడకుండానే లేచివెళ్ళిపోయారు. దానితో వారికీ ప్రఫుల్లతల్లికీ మధ్య వైమనస్యం ఏర్పడింది. ప్రఫుల్లతల్లి చాలాచాలా తిట్టింది వారిని. ఇరుగుపొరుగు వారందరూ కలసి వారికి భయంకర ప్రతీకారం చేశారు.

వియ్యాలవారికి విందుజరిగే ఆచారంవుంది. ఆరోజున హరవల్లభబాబు ప్రఫుల్లఇరుగుపొరుగు వారందర్నీ ఆహ్వానించాడు. ఒక్కరూరాలేదు' అటువంటికులట, కులహీనురాలితో హరవల్లభబాబు సంబంధం చేసుకుంటే చేసుకోవచ్చు-పెద్దవారువదిచేసినా చెల్లిపోతుంది- కాని మావంటి దరిద్రులకు కులగోత్రాలే సర్వమూ. మేముమాత్రం ఆ జాతి హీనురాలి కూతురుతో 'కలసి పచ్చిమంచినీళ్లైనా ముట్టము' అని కబురు చేశారు. పదిమందిలో వుండగానే ఈ విషయం చెప్పారు. ప్రఫుల్ల యొక్కతల్లి వితంతువు. పాపం ఆమె తనకుమార్తెతోకలసిఒక్కతే వుంటోందిఇంట్లో వెనకదిక్కెవరూలేరు. వయస్సుకూడా అంతమించి పోలేదు అందువల్ల విషయం అసంభవంగా కన్పించలేదు. వివాహం జరిగిన రోజుకూడా ఇరుగుపొరుగు వారెవ్వరూ ప్రఫుల్లఇంటిలో భోజనం చేయలేదనే విషయం ఆలోచించాడు హరవల్లభుడు, కనుక గ్రామ

స్తులు చెప్పిన ఆ మాటను హారవల్లభుడు విశ్వసించాడు. పది మంది పెండ్లిపెద్దలుకూడా విశ్వసించారు. ఆహ్వానితులందరూ భోజనాలైతే చేశారు కానీ నూత్నవధువు తాకిన భోజనం మాత్రంకాదు. ఆచారం ప్రకారం రెండో రోజున హారవల్లభుడు కోడల్ని పుట్టినింటికి పంపివేశాడు. అప్పటి నుంచి వారు తమకోడల్ని గురించి ఏమీ విచారించనూ లేదు; కొడుకునుకూడా అటు కన్నెత్తి చూడనివ్వ లేదు. కుమారుడికి రెండో వివాహం జరిపించారు. ప్రఫుల్ల తల్లి ఒకటిరెండు పర్యాయాలు ఏవో సామానులు పంపింది. కానీ హారవల్లభుడు వాటినితిప్పిపంపివేశాడు. అందువల్ల ఇవాళ ఆయింట్లో ప్రవేశించేప్పుడు ప్రఫుల్ల తల్లికి కాళ్ళు వణికాయి.

కాని ఇంతదూరంవచ్చి తిరిగి వెళ్ళటమనేదికూడా జరగదు. తల్లి కుమార్తెలు సాహసించి లోనికి వెళ్లారు. గృహయజమాని అంతఃపురంలో మధ్యాహ్న సుఖనిద్రలో మునిగివున్నాడు. గృహయజమానురాలు, అనగా ప్రఫుల్ల అత్తగారు కాళ్ళుచాచుకొని కూర్చొంది. ఒకదాసీ నెరసిన తల వెంట్రుకల్ని లాగివేస్తోంది. అదే సమయాన ప్రఫుల్ల, ఆమె తల్లి' అక్కడికి వచ్చారు. ప్రఫుల్ల ముఖంమీదికి మూరెడు ముసుగు లాక్కుంది. అప్పుడామె వయస్సు 13 సంవత్సరా లుంటుంది.

వారిని చూసి యజమానురాలు 'ఎవరు మీరు?' అని అడిగింది. 'ఏమని చెప్పి పరిచయం చేయనమ్మా!' అని ప్రఫుల్లతల్లి దీర్ఘంగా నిట్టూర్చింది.

'ఏం, పరిచయానికి అన్నిమాటలు చెప్పాలా ఏం?'

'మేము మీా సంబంధీకులమే.'

'సంబంధీకులా? ఎటువంటి సంబంధీకులు?'

తారతల్లి అనేఒక దాసీ అక్కడ పనిచేస్తూవుండేది. ఆమె ఒకటి రెండు పర్యాయాలు ప్రఫుల్ల యింటికి వెళ్ళి వచ్చింది - వివాహం అయిన తర్వాత కూడా ఒక పర్యాయం వెళ్ళివచ్చింది. ఆదాసీ అందుకని, 'అరే, గుర్తొచ్చింది. వియ్యపురాలుగదూ?' అని అంది.

'వియ్యపురాలా? ఎవరా వియ్యపురాలు' అంది జమీాందారిణి.

'దుర్గాపురం వియ్యపురాలు - మీా పెద్దబ్బాయిగారి పెద్దత్తగారు' అంది తారతల్లి.

యజమానురాలు అర్థంచేసుకొని కొంచెం అయిష్టంతోనే 'కూర్చోండి' అని అంది.

వియ్యపురాలు కూర్చుంది. ప్రఫుల్ల నిల్చునేవుంది. 'ఈ అమ్మాయి ఎవరు?' అని అడిగింది యజమానురాలు.

'మీా పెద్దకుమారుని భార్య' అని చెప్పింది ప్రఫుల్ల తల్లి. యజమానురాలికి ఆశ్చర్యంతో నోటివెంట మాటే రాలేదు. కాస్సేపు మౌనంగా వున్నతర్వాత 'మీారు ఎక్కడికి వచ్చారు?' అని అడిగింది.

'మీా యింటికే వచ్చాము' అంది ప్రఫుల్ల తల్లి.

'ఎందుకు?'

'ఎందుకేమిటి? నాకూతురు అత్తవారింటికి రాదా ఏం?'

'ఎందుకు రాకూడదు? అత్తమామలు పిలిచినప్పుడు

రావాలి. మర్యాదస్తుల పిల్లలు పిలవకుండా బలవంతాన వస్తారా?'

'అత్తగారూ ఏడుజన్మలెత్తినా పిలవకపోతే?'

'అలా పిలవనప్పుడు రావటం దేనికిమరి?'

'రాకపోతే ఎవరు పోషిస్తారు? నేను నిస్సహాయురాలను. వితంతువును. నీ కోడల్ని నేనెక్కడ పోషించను?'

'పోషించలేనప్పుడు కనటం దేనికి?'

'తిండి, గుడ్డలు లెక్కచూసే కొడుకును కన్నావా నువ్వు? అలా అయితే ఆ కొడుకు భారంకూడా కలిపి లెక్క చూడాల్సింది.'

'అయ్యోరామా! పోట్లాటకు సిద్ధంగా వచ్చావనుకుంటూ యింటినుంచి బయలుదేరి?'

'పోట్లాడటానికి రాలేదు. మీకోడలు ఒక్కతే రాలేదు కనుక పంపివెళ్దామని వచ్చాను. ఇక నేను వెళుతున్నాను' అని అంది ప్రఫుల్ల తల్లి.

ఆమాట అని ఆమె వెళ్ళిపోయింది. పాపమా అభాగ్యురాలు అప్పుడూ ఏమీ తినలేదు. తల్లి వెళ్ళిపోయింది. కాని ప్రఫుల్ల వెళ్ళలేదు, అలాగే నిల్చునివుంది. 'మీతల్లి, వెళ్ళింది. నువ్వూకూడా వెళ్ళు' అంది అత్తగారు.

ప్రఫుల్ల కదలలేదు.

'అరే? కదలటమే లేదు!'

అప్పటికీ ప్రఫుల్ల అలాగే నిల్చుంది.

'అయ్యో, ఏమిటిది? ఒక్కొచ్చి పడిందిరా బాబూ! మళ్ళీ

నిన్ను పంపటానికి ఒకమనిషి లోవాలా ఏం?' అంది అత్త గారు.

అప్పటికి ప్రఫుల్ల ముఖంమీది ముసుగు తీసివేసింది. చంద్రోదయమయినట్లుకన్పించింది ముఖం. కళ్ళనుంచి గంగా యమునలు ప్రవహిస్తున్నాయి. అత్తగారు మనస్సులో 'ఆహా! బంగారపు బొమ్మవంటి ఈ కోడల్ని తెచ్చుకొని ఇంట్లో వుంచుకోలేకపోయానే!' అని ఆలోచించి కొంచెం మెత్తబడింది.

'నేను వెళ్ళటానికి రాలేదు, అంది ప్రఫుల్ల కొంచెం 'అస్ఫుటస్వరంతో.

నే నేం చెయ్యగలనమ్మా? నిన్ను తీసుకొచ్చి ఉంచు కోవాలని నాకుమాత్రం లేదంటావా? లోకులు అనేక విధా లుగా అంటున్నారు. కులంనుంచి వెలేస్తారేమోనని భయం వల్ల నిన్ను వదిలేయాల్సి వచ్చింది.'

'తల్లి జాతి బహిష్కార భయంతో తన సంతా నాన్ని వదిలేస్తుందా ఎక్కడైనా? నేనుమాత్రం నీబిడ్డలాంటి దానిని కాదా?'

అత్తగారి మనస్సు మరింత మెత్తబడింది. 'నే నేం చేయనమ్మా మరి?' అని అంది.

'నేను వచ్చివేశాను. మీ ఇంట్లో శూద్రదాసీలు ఎంగుకు పనిచేయటంలేదు - నేనూ మీ ఇంట్లో దాసీపని చేస్తే అభ్యంతరమేముంది మీకు? అంది ప్రఫుల్ల.'

అత్తగారు మరేమీ అనలేకపోయింది. 'అమ్మాయి చూస్తే లక్ష్మి! మాటల్లోనూ, అందంలోకూడా నాకొత్తు

లక్ష్మి. వెళ్ళి వారిని అడిగిచూస్తాను ఏమంటారో!' అనుకొని 'నువ్విక్కడే కూర్చోతల్లీ' అంది. ప్రఫుల్ల కూర్చుంది. ఆదే సమయాన తలుపుచాటునుంచి కొద్దిగా ముసుగువేసుకొన్న పసినాలుగేండ్ల సుందరి ప్రఫుల్లను చేతితో సైగచేసిపిల్చింది. ఎవరీమె అని ఆలోచిస్తూ ప్రఫుల్ల ఆ బాలికవద్దకు వెళ్ళింది.

## 3

ఆ ఇల్లాలు వయ్యారంగా నడుస్తూ, చేతిగాజులుతిప్పుతుంటూ భర్తగారున్న గదిలోకి వెళ్ళింది. అప్పటికే వారు నిద్రనుంచి లేచి కాళ్ళుచేతులు, ముఖం కడుక్కొని తుడుచుకుంటున్నారు. అది చూచి వారిని సంతోషపర్చాలనే ఉద్దేశ్యంతో ఆమె 'మిమ్మల్ని నిద్ర ఎవరు లేపారు? ఎన్నిసార్లో చెప్పాను. ఒక్కరూ మాట వినిపించుకోరు' అని అంది.

అది విని యజమాని తనలోతానే 'నిద్రసమయంలో తుఫాను లేపేదే నువ్వు—బహుశా ఏదో పనివుండివుంటుంది' అనుకున్నారు. 'ఎవరూ లేపలేదు — మంచి నిద్రపోయాను— ఇంతకూ విషయమేమిటి?' అని అడిగాడు సూటిగా.

ఆమె నవ్వుతూ వయ్యారంగా గాజులు, ముక్కుపుడక సవరించుకుంటూ 'ఇవాళ ఒక విషయం జరిగింది. అది చెప్పాలనే వచ్చాను' అని భూమిక నారంభించింది. ఇంత వయ్యారం చూపుతుందంటే ఆమెవయస్సింకా అప్పటికి 45 సంవత్సరాలు మాత్రమే. నెమ్మదిగా ప్రఫుల్ల, ఆమెతల్లి వచ్చిన వృత్తాంతం విన్పించింది. చంద్రబింబంవంటి కోడలి ముఖాన్ని, ఆమెయొక్క తియ్యనిమాటల్ని స్మరించుకొని

తన తరఫున కొంచెం సమర్థించే చెప్పింది. కాని ఆమె మంత్రతంత్రాలేవీ ఫలించలేదు గృహ యజమాని క్రుద్ధుడై 'ఇంత మితిమీరి ఆ కడజాతి స్త్రీ కూతురు నా యింట్లోకే వచ్చిందా! చీపురు తీసికొని వెంటనే బయటకు గెంటు' అని అన్నాడు.

'ఛీ, ఛీ! ఎక్కడైనా అలాంటి మాటలనవచ్చా? ఎంతయినా మన అబ్బాయి భార్యాయేగా! పోతే మనం అన్నంతమాత్రాన కడజాతి పిల్లయిపోతుందా?'

ఆమె చాలా ప్రయత్నం చేసింది. ఎన్నో యుక్తులు చేసింది. కాని ఒక్కటీ ఫలించలేదు. 'ఆ జాతిహీనురాలి కూతుర్ని చీపురుకట్టతో తరిమెయ్యి' అనే ఆదేశించాడు భర్త. చివరకు ఆమెకు కూడా కోపం వచ్చింది. 'అంత చీపురుతో గెంటాలంటే ఆపని మీరే చెయ్యండి. నేను ఆ విషయంలో కలిగించుకోను' అని అక్కడినుంచి రుసరుస లాడుతూ వెళ్ళిపోయింది. కాని తిన్నగా తాను ప్రఫుల్లను వదలివచ్చినచోటుకి వెళ్ళలేదు. ప్రఫుల్లనుతలుపుచాటునుంచి పనువాలుగేడ్ల సుందరి పిలిచిందనే విషయం పాఠకులకు తెలిసిందే. ప్రఫుల్ల లోనికి వెళ్ళగానే ఆమె తలుపులు మూసి వేసింది.

'తలుపులు వేశారేం?' అని అడిగింది ప్రఫుల్ల.

'ఎవరైనావస్తారు. లేకపోతే నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. అందుకని తలుపులు మూసివేశాను' అంది బాలిక

'నీ పేరేమిటి చెల్లీ!'

'నాపేరు సాగర్ అక్కా!'

'నువ్వెవరు?'

'అక్కా, నేను నీ సవితినే.'

'నువ్వు చిన్నారుగురువా?' అని అడిగింది ప్రఫుల్ల.

'ఇంతకుముందు తలుపుచాటున ఉండి విషయాలన్నీ విన్నాను.'

'అయితే వారి భార్యవు నువ్వేనన్నమాట?'

'టట్! నావంటి అభాగ్యురాలు గృహాయజమానురాలెలా అవుతుంది? నాకు అంత పెద్దపెద్ద పళ్లూ లేవు; అంత నల్లగానూ లేను నేను.'

'అరే, పెద్దపెద్ద పళ్ళెవరికున్నాయి!'

'వారి భార్యకే, నువ్వింకెవరి కనుకున్నావ్?'

'ఆమె ఎవరు?'

'నీకు తెలియదా? అయినా ఎలా తెలుస్తుంది. నువ్వింతవరకు ఎప్పుడూ రాలేదుకూడా. మనకుమరొక సవతివుంది.'

'నేనుతప్ప మరొక వివాహం జరిగిందనే విన్నాను నేను. అది నువ్వే ననుకున్నాను.'

'కాదు, అది ఆమే. నా వివాహం జరిగి మూడు సంవత్సరాలే అయింది.'

'ఆమె అంత వికృతంగా వుంటుందా?'

'ఆమె ఆకారం చూస్తూనే నాకు ఏడుపొస్తుంది.'

'అందుకనే నీతో మళ్ళీ వివాహం జరిగివుంటుంది?'

'కాదు. అదేమీకాదు. ఎవ్వరితోనూ అనకు, నీతో

మాత్రమే చెపుతున్నాను. మా తండ్రివద్ద చాలా డబ్బుంది. మా నాన్నను నేను ఒక్కదానినే. ఆ డబ్బుకోసమే—'

'అర్థమైంది. ఇక చెప్పాల్సిన అవసరంలేదు. నువ్వు అందంగా వున్నావు, ఆమె వికృతంగావుంటే మరి ఆమె గృహ యజమానురా లెలా అయింది?'

'నేను మాతండ్రికి ఏకైక సంతానం అవటంవల్ల వారు నన్ను త్వరగా ఇక్కడికి పంపటంలేదు. అందుకనే నే నిక్కడ ఎప్పుడూ వుండటంలేదు ఎప్పుడైనా ఏదైనా పని వుంటే వచ్చి వెళ్తూవుంటాను. నాలుగైదురోజుల క్రితం వచ్చాను. త్వరగానే వెళ్ళిపోతాను.'

సాగర్ చిన్నపిల్ల. సవతి అయినా ఆమెకు ద్వేషం కలుగలేదు. 'నన్నెందుకు పిల్చావు' అని అడిగింది.

'ఏమైనా తింటావా?'

ప్రఫుల్ల నవ్వింది. 'ఇప్పుడెందుకు తింటాను?' అంది.

'నీముఖం బాగా వాడిపోయింది. చాలా దూరం నడిచి వచ్చావు, దాహంవేస్తూ వుంటుంది. నిన్నెవరూ ఏమీ తినమనే అడగలేదు. అందుకనే పిల్చాను.'

ప్రఫుల్ల అంతవరకు ఏమీ తినలేదు. దాహంతో గొంతు ఎండిపోతోంది. అయినా 'అత్తగారు మామగారిని అడిగి రావటానికి వెళ్లారు. నా అదృష్టం ఎలావుందో ఏమీ తెలియకుండా నేనిక్కడ ఏమీ తినదలుచుకోలేదు. చీపురు దెబ్బలు తినాల్సివుంటే అవే తింటాను' అంది.

'కాదు, కాదు. వారివనేవి తినాల్సినపనేమీలేదు నీకు. నాపుట్టింటినుంచి తెచ్చిన సందేశాలు(మిఠాయి)వున్నవి.'

అని చెప్పి సాగర్ సందేశాలు తెచ్చి ప్రఫుల్ల నోటిలో కుక్కసాగింది. తినకతప్పలేదు. చల్లని మంచినీళ్ళు తెచ్చిచ్చింది సాగర్. త్రాగి ప్రఫుల్ల కొంచెం స్థిమితపడింది. 'నాకు ప్రాణాలు కుదుటపడ్డాయి కానీ అమ్మ తిండేమీ లేక చచ్చిపోతుంది.'

'మీ అమ్మ ఎక్కడికి వెళ్ళింది?'

'ఏమో! రోడ్డుమీద నిలబడివుంటుంది.'

'ఒకపని చేయనా?'

'ఏమిటి?'

'మరొకామెవుంది పంపనా!'

ఎవరామె?'

'జమిందారుగారికి మేనత్త అవుతుంది – ఇక్కడే వుంటుంది.'

'ఆమె ఏంచేస్తుంది?'

'మీతల్లికి భోజనం పెడ్తుంది.'

'అమ్మ ఇక్కడ ఏమీ తినదు.'

'ఛీ, నేననేది ఇక్కడకాదు.' మరెక్కడైనా బ్రాహ్మణుల ఇంట్లోనే!'

'మీయిష్టం' అంది ప్రఫుల్ల.

సాగర్ వెళ్ళి ఆ బ్రాహ్మణ స్త్రీకి విషయాలన్నీ చెప్పింది. అందుకు ఆమె 'అవును తల్లీ, ఇంటికి వచ్చినవాళ్ళను ఉపవాసమెలావుంచుతాము. అశుభం కల్గుతుంది' అని అంది. వెంటనే ప్రఫుల్ల తల్లికోసమని వెళ్ళిపోయిందామె. సాగర్ తిరిగివచ్చి ప్రఫుల్లతో చెప్పింది. 'ఇంతకుముందు చెప్పిన విషయాలేమైనా నెప్పు చెల్లీ?' అంది ప్రఫుల్ల.

'విషయాలేమున్నాయి. నేనా ఇక్కడవుండటంలేదు. ఉండలేనుకూడా. మట్టితో చేసిన రంగుమామిడిపండు వంటిది నా అదృష్టం-గూట్లో పెట్టివుంటాను. చూడటానికేగాని దైవభోగానికెప్పుడూ ఉపయోగపడను. నువ్వొచ్చావు, ఎలాగోవుండు. నేనా నల్లముఖాన్ని చూడలేనుకూడాను.'

'ఉండాలనే వచ్చాను. ఉండగలగాలిగదా అప్పుడు?'

'చూడు, మామగారు వద్దని అన్నా, అప్పుడే వెళ్ళిపోవద్దుసుమా.'

'వెళ్ళకపోతే చేసేదిమాత్ర మేముంది. ఉండేది మాత్రం ఎలా? ఒకవేళ ఉన్నా—'

'ఒకవేళ ఏమిటి?'

'ఒకవేళ నువ్వు నాజీవితాన్ని సార్థకం చేయగలిగితే.'

'అదెలా అక్కా?'

ప్రఫుల్ల కొద్దిగానవ్వింది. కానీ మరుక్షణమే ఆనవ్వు మాయమైంది; కన్నీరు జాలువారింది – 'అర్థంకాలేదా చెల్లీ?' అని అడిగింది.

అప్పుడు గ్రహించింది సాగర్. 'సాయంత్రం చీకటి పడగానే ఈగదిలోనికే వచ్చికూర్చో. పగలు దర్శనం కావటం అసంభవం' అంది సాగర్.

పాఠక మహాశయులారా! మేము వ్రాసేది సిగ్గులేని నేటి నవనాగరిక స్త్రీలను గురించికాదు. మా కథాకాలం వంద సంవత్సరాలనాటిది. నలభై సంవత్సరాల క్రితం వరకు స్త్రీలు పగలు ఎప్పుడూ తమ భర్తల్ని దర్శించ గలిగేవారు కాదు.

'ముందు నాభవిష్యత్తేమిటో తెలుసుకొని అప్పుడు నిన్ను కలుసుకుంటాను. నా అదృష్టం ఎలా వున్నప్పటికీ ఒకపర్యాయం నాథుని దర్శించివెళ్తాను. వారేమంటారో కూడా వినేసెళ్తాను' అంది ప్రఫుల్ల బయటకువెళ్తూ. అత్తగారు ఆమెకోసం వెదుకుతూ ఎదురుగా ప్రఫుల్లనుచూచి 'ఎక్కడికి వెళ్ళావమ్మా?' అని అడిగింది.

"ఇల్లంతా చూస్తున్నాను" అంది ప్రఫుల్ల.

"నీ ఇల్లేనమ్మా! కానీ ఏంచేయను, మీమామగారు ఎంతమాత్రం అంగీకరించటంలేదు."

ప్రఫుల్లకు మీదపిడుగుపడినట్లయింది. ఆమె తినచేతులు పెట్టుకొని కూర్చొబడింది. ఏమీ మాట్లాడలేదు. అత్తగారికి చాలాదయ కల్గిందామెపై. 'మరోకసారి యత్నించి చూస్తాను' అనుకుంది. కానీ పైకిమాత్రం «ఇవాళ ఇప్పుడిహ ఎక్కడికి వెళ్తావమ్మా? ఇవాళ ఇక్కడేవుండు, రేపుఉదయమే వెళ్ళు" అనిఅంది.

"ఎలాగో వుంటాననుకోండి. మామగారిని ఒకసారిట అడగండి. మాతల్లి రాత్నంమీదవేరో పొట్టపోసుకుంటూంది. అక్కడికేఆమెకు ఒక్కదానికే కష్టంగావుంది. మరి నన్నేమి చేసుకొని బ్రతకమంటారో చెప్పమనండి నేనుజాతిహీనురాలనైనా, కడజాతిదానినైనా వారికోడల్నేగా. మరివారికోడలు ఏమిచేసి బ్రతకాలో అడగండి" అంది ప్రఫుల్ల.

'తప్పకుండా అడుగుతానమ్మా!', అంది అత్తగారు. ప్రఫుల్ల లేచి వెళ్ళిందక్కడినుంచి.

# 4

సాయంత్రమైన తర్వాత ఆ గదిలోనే తలుపులు వేసుకొని ప్రఫుల్ల, సాగర్ లిద్దరూ మాట్లాడుకొంటున్నారు. ఇంతలోనే ఎవరో తలుపుతట్టారు. "ఎవరువారు?" అని అడిగింది సాగర్.

"నేనే"

సాగర్ నెమ్మదిగా ప్రఫుల్ల చేతినినొక్కి "మాట్లాడకు, అదే ఆనల్లభూతం వచ్చింది" అని చెప్పింది.

"మన సవతా?"

"ఆ,, ఆమే, మాట్లాడకు."

ఆ వచ్చినవ్యక్తి "గదిలో వుందిఎవరు?మాట్లాడరేం? సాగర్ కోడలుమాట విన్పించందే?" అని అన్నారు.

"నువ్వెవరు? ఎవరోమంగలి దాని గొంతులావుంది?"

"అరి నీకు చావురానూ! నేను మంగలిదానిలా వున్నానా?"

"అయితే ఎవరు నువ్వు?"

"నీసవతిని! సవతిని! సవితి నయనతారను"

అప్పుడికి సాగర్ ఏదో పొరపాటు జరిగినట్లు నటిస్తూ "ఎవరూ, అక్కా? మంగలిదానిలా నువ్వెందుకుంటావ్ అక్కా? అదికొంచం ఎర్రగా వుంటుంది" అనిఅంది.

"చావు! నేనుదానికంటే నల్లగావున్నానాఏం? సవతి అంటే ఇలాగే వుంటుంది. నీకింకా పదునాల్గేండ్లేగా?"

"పదునాల్గేండ్లైతేఏం? నీకు పదిహేడుసంవత్సరాలు. నీకంటే అందంగానూ వుంటాను, వయసులోనూవున్నాను"

"అందము, వయస్సు పెట్టుకొని తండ్రివద్దకూర్చొని కొరుక్కుతిను. నాబుద్ధిగడ్డితిని నేనేనో ఒకమాట అడగాలని వచ్చాను. నీదగ్గరకి రావాలి!" అంది నయనతార.

"ఏమిటామాట అక్కా?"

"మాకేమిటో చెప్తాను, నువ్వింతవరకు తలుపులు తెరవనేలేదు. సాయంత్రంనుంచే తలుపులు వేసుకొని కూర్చున్నావు."

"నేను తలుపులు వేసుకొని రెండుసందేశాలు తింటున్నాను. నువ్వుతినవా యేం?"

"తిను, తిను (నయనతారకు సందేశాలంటే చాల ఇష్టం.) మరొకరు అదనంగా వచ్చారావేంఅనే నేనడిగేది?"

"మరొకరేమిటి? భర్తా?"

"చచ్చావ్? అలా జరుగుతుందా ఎక్కడైనా?"

"జరిగితే బాగా నేవుండేది మనిద్దరం పంచుకొనేపని-క్రొత్తగా వచ్చినవారిని నీకిచ్చేదానిని."

"ఛీ!ఛీ!అటువంటి మాటలు పైకిఎవరైనాఅంటారా"

"అయితే మనస్సులోనే!"

"అంటే నీకు ఎంతనోటికొస్తే అదంతానన్నంటావా"

"అక్కా, అదికాదు. నువ్వుఅడిగేది స్పష్టంగా లేక పోతే నేనేం జవాబుచెప్తాను చెప్పు."

"ఏముంది, మరొకకోడలు వచ్చిందా ఈ యింటికి అని అడుగుతున్నాను."

"ఏ కోడలు?"

"అదే, ఆ నూదిగ కోడలు!"

«మాదిగ? నేను వినలేదే."

'మాదిగ కాకపోతే మరోనీచజాతి అనుకో."

«అదీ వినలేదునేను"

«మనకొక కడజాతి సవతివుంది. నీకు తెలియదా?"

«లేదే."

"నువ్వెట్టి మొద్దువి. అదే మొదటివివాహంజరగలా అది.

"ఆమె బ్రాహ్మణు రాలేగా?"

"అవును, బ్రాహ్మణస్త్రీయే! అలా అయితే కాపురం ఎందుకు చేయటం లేదు?"

"అయితే రేపునిన్ను పంపేసి నాతో కాపురం చేస్తే నువ్వు కడజాతి దానివవుతావా?"

"ఓసిపాడుదానా! నువ్వు నన్ను నిందిస్తావెందుకు."

"నువ్వు మరొకర్ని ఎందుకునిందిస్తావే పాడుదానా"

"చావు, పీడ గా! వెళ్ళి అత్తగారితో చెప్తాను. కల వారిఅమ్మాయిననిసియిష్టంవచ్చినట్లుమాట్లాడతావానన్ను?"

ఆమాట అని నయనతార రుసరుసలాడుతూ అక్కడి నుంచి బయలుదేరింది - అపాయమే ఎనిగమనించిందిసాగర్. "అక్కా-ఇలా రా-తలుపులు తెరుస్తున్నాను" అని పిలిచింది. నయనతారకు చాలా కోపం గావుంది, తిరిగి రావాలనిలేదు కానీ తలుపులు వేసుకొని సాగర్ ఎన్నిసందేశాలు తిన్నదో చూడాలనే కోర్కాగా వుండటంవల్ల తిరిగివచ్చింది. కానీ గదిలోకివచ్చి చూసేసరికి ఎక్కడా సందేశాలుకన్పించ లేదు. ఒక వ్యక్తిమాత్రం వున్నారు. "ఎవరీ అనాకారి మనిషి?" అని అడిగింది.

"సీకంటే ఎక్కువేమీ కాదు."

"మాట్లాడకు. నన్ని కవిసిగించకు. నాకంటే ఎక్కువ అందంగా లేదులే."

# 5

రాత్రిజాము ప్రొద్దు పోయినతర్వాతగృహాయజమాని భోజనానికి ఇంట్లోకి వచ్చాడు. జమీందారిణి వినసకర్ర తీసుకొని దగ్గరేకూర్చుంది. ఈగలు దోమలు ఏమీ లేకపోయినా ఇల్లాలి కర్తవ్యాన్ని పాలించాల్సిందే. ఈగల్ని తోలుతూ 'అయ్యో! అటువంటి అందమైన కర్తవ్యాన్ని ప్రస్తుతం లోపింపజేసిన ఆపాపినిరాధముడు ఎవరు? అటువంటి పాపుల నెత్తిపై పడవేయటానికి ఓఆకాశమా! నీవద్ద పిడుగులు లేవా' అనుకుంది. యజమాని భోజనం చేస్తూ "ఆజాతి హీనురాలి కూతురు వెళ్ళిపోయిందా?" అని అడిగాడు.

ఆమె ఈగల్ని తోలుతూ ముక్కులు ఎగరేసి "రాత్రి పూట ఎక్కడికి వెళ్తుంది? రాత్రిపూట అతిథులువస్తే మీరు తరిమేస్తారా? నేను నా కోడల్ని గెంటేయలేను" అనిఅంది.

"అతిథులు, అతిథిశాలకు వెళ్ళాలిగాని ఇక్కడికి దేనికి?"

"నేను గెంటేయలేనని చెప్పానుగదా, కావాలంటే మీరు గెంటేయండి. కాని మనకోడలు చాలా అందంగా వుంటుంది."

"అవును, కడజాతిలో కూడా ఒకరిద్దరు అందమైన వాళ్ళుంటారు. సరేఅయితే, నేనే వెళ్ళగొడ్తాను. ప్రజ నిలా పిలువు."

వ్రజ జమీందారుగారి కుమారునిపేరు. సేవకురాలు వ్రజేశ్వరుణ్ణిపిలుచు కొచ్చింది. అతనివయస్సు 21, 22 వుంటుంది. ఏమీవంకలేని అందగాడే - వచ్చి వినయవిధేయతలతో తండ్రిముందు నిల్చున్నాడు, మాట్లాడేసాహసంలేదు.

అతణ్ని చూసి హరవల్లభుడు "నీకు మూడు వివాహాలయాయి, గుర్తున్నాయా?" అని అడిగాడు. వ్రజేశ్వరుడు ఏమీ మాట్లాడలేదు.

"మొదటి వివాహంగుర్తుందా? ఒక కడజాతిపిల్లతో జరిగింది?" వ్రజేశ్వరుడు ఏమీ మాట్లాడలేదు.తండ్రిఎదుట. ఇరవై రెండు సంవత్సరాల పుత్రుడు, ఎంత వజ్రపుతునకైనా ఆ కాలంలో మాట్లాడే వారుకాదు. ఇప్పుడు మాత్రం ఎంత మూర్ఖుడైతే అంత పెద్దఉపన్యాసం దంచేస్తాడు.

"ఆ కడజాతిపిల్ల ఇవాళ ఇక్కడకి వచ్చింది, బలవంతాన వుండటానికి. చీపురుతో సత్కరించి బయటికి గెంటమని మీతల్లితో చెప్పాను. కాని స్త్రీలు స్త్రీలపై చెయ్యి చేసుకోలేరు. ఇది నీపని. నీకే అధికారంవుంద - మరెవ్వరూ తాకరుకూడాను, ఇవాళ రాత్రే నాలుగుతన్ని గెంటెయ్యి. లేకపోతే నాకునిద్రకూడావుండదివాళ" అన్నాడుజమీందారు.

"ఛీ, తప్పునాయనా! స్త్రీపై చెయ్యిచేసుకోకు. వారి మాటనే పాటించాలంటే నాదొక్క మాటకూడా వినకూడదా! సరే, ఏదిచేసినాఆలోచించిమర్యాదగానేపంపెయ్యి" అంది తల్లి.

వ్రజేశ్వరుడు తండ్రిగారికిజవాబుగా "మీయిష్టం" అని తల్లితో "అలాగే" అనిచెప్పి అక్కడే నిల్చున్నాడు.ఇంతలో

వ్రజేశ్వరుని తల్లి "కోడల్ని మీరు గెంటేస్తున్నారుగదా, ఆమె ఏమతిని బ్రతుకుతుంది?" అని అడిగింది భర్తను.

"తనయిష్టం వచ్చినట్లు చేసుకోమను - దొంగతనం దోపిడీ-భిక్షమెత్తుకోమను" అన్నాడు హరవల్లభుడు.

"గెంటివేసేప్పుడు కోడలితో ఆవిషయమే చెప్పండి. ఆమె అడిగింది" అంది భర్తతో ఆమె.

వ్రజేశ్వరుడు అక్కడినుంచి ఆ బ్రాహ్మణ వితంతువు వద్దకువెళ్ళాడు. ఆమె చాలా భక్తిభావంతో జపంచేసుకుంటూ దోమలుతోలుకొంటూవుంది. "అవ్వా" అని పిలచాడు వ్రజేశ్వరుడు.

"ఏమిటి నాయనా?" అంది బ్రాహ్మణస్త్రీ.

"ఇవాళ ఒక క్రొత్తసమాచారం వుందిగదూ?"

"క్రొత్తసమాచారమా? సాగర్ నారాట్నం విరగ్గొట్టింది అదేనా ఏం? ఇంకా పసిదిరా బాబూ, విరగ్గొడితే విరగ్గొట్టిందిలే ఆమెకు రాట్నం వడకాలని బుద్ధిపుట్టింది."

"అదికాదు. మరే, ఇవాళ—"

"సాగర్‌ను ఏమీ అనకు బాబూ! మీరు సుఖంగా వుంటే ... మరోరాట్నం వస్తుందిలే. ముసలివానిని—"

"అయ్యో, నామాట వినిపించుకుంటావా, లేదా?"

"ముసలిదానిని ఎంతకాలం జీవిస్తానో ఏమో తెలియదు. ఏవో రెండుమూడు జంధ్యాలు తయారుచేసి ఏ బ్రాహ్మణునికో దానంచేస్తాను. సరే, పోనివ్వు—"

"ముందు నువ్వు నేను చెప్పేదివిను. లేకపోతే ఆమిగిలిన రాట్నాన్ని నేను విరగ్గొట్టేస్తాను."

"ఏమిటి? అయితే రాట్నం సంగతికాదామరి?"

"కాదు, నాకుఇద్దరు భార్యలున్నారు తెలుసుగా?"

"భార్యలా? అమ్మనుమ్మన్మ! నయనతార ఎలాంటి భార్యో సాగర్ కోడలు అలాంటిదే. ఇద్దరూ ఇద్దరే! నన్ను వేధించుకు తింటున్నారనుకో- కథలుచెప్పమని. అబ్బాయీ అన్నికథలు ఎక్కడినుంచితేను నేనుమాత్రం?"

"అరే నీకథల్ని చాలించుముందు-"

"చాలించమని నువ్వుఅన్నావనుకో, కానీవాళ్ళువదలి పెడ్తేనానన్ను. చివరికి ఆజోడుపావురాల కథచెప్పాను, ఆ పావురాలకథ తెలుసానీకు? అయితే విను. అనగనగా ఒక అడవిలో ఒక జమ్మిచెట్టుంది. దానిమీద రెండు పావురాలు కాపుర ముంటున్నాయి-"

"చచ్చాంపో! అవ్వా, ఏమిటిది! అప్పుడేకథా? నేను చెప్పేదివిను."

"ఏమిటి నువ్వుచెప్పేది? కథవింటానికే వచ్చావను కున్నాను నేను. నీకు మరోపనే వుండదుగా."

ఈ ముసలది స్వర్గానికి ఎప్పుడుబండెక్కుతుందాఅను కున్నాడు ప్రజేశ్వరుడు మనస్సులో. "నా కిద్దరు బ్రాహ్మణ భార్యలు, ఒకశూద్రభార్యవున్నారు. శూద్రభార్య ఇవాళ వచ్చిందిగదూ?" అని అడిగాడు.

"రామ, రామ; శూద్రురాలేమిటి- బ్రాహ్మణబాలికే"

"వచ్చిందిగదూ?"

"వచ్చింది."

"ఎక్కడుంది, ఒకసారి కలుసుకోవాలి."

"అదా. మీయిద్దర్ని సమావేశపర్చి మీ అమ్మ-నాన్నతో నేను చివాట్లుతినాలా? దానికంటే ఆ పావురాల కథచెప్తాను విను."

"నువ్వేమీ భయపడకు. ఆమెను కలుసుకొని వెళ్ళ గొట్టమని అమ్మ- నాన్న చెప్పారు. కలుసుకోనిదే తరిమేసే దెలామరి? నువ్వు అవ్వవ్రకదాయని వెతుక్కుంటూ నీదగ్గిరి కొచ్చాను."

"అబ్బాయీ, నేను వృద్ధురాలిని. కృష్ణనామం జపించుకొంటున్నాను. కథ వినదలిస్తే చెప్తాను. ఆశూద్రులేమిటో బ్రాహ్మణులేమిటో నాకు తెలియదు."

"ఆతనిన్నుదొంగలెత్తుకుపోనూ!" అన్నాడు వ్రజేశ్వరుడు.

"అలాంటి మాటనకు - దొంగలు అంత భయంకరంగా వుంటారా ఏం? కలుసుకుంటావా?"

"లేకపోతే నిజపం చూట్టానికొచ్చాననున్నావా?"

"అయితే సాగర్ కోడలి దగ్గరకు వెళ్ళు."

"సవతి, సవతిని కలుసుకోనిస్తుందా?"

"ముందు నువ్వెళ్ళు. సాగర్ నిన్ను పిలిచింది. గదిలో వుంది. అలాంటిఅమ్మాయిలు ఎక్కడోనూటికిఒకరుంటారు."

"రాత్నంవిరగ్గొడితే పొగుడుతున్నావా, నయన్‌తో చెప్తానుండు-ఆమెకూడా ఒకటి విరగ్గొడుతుంది."

"అవును. సాగర్, నయన్! వెళ్ళు!"

"వెళ్తే, ఆశూద్రురాలు కన్పిస్తుందా?"

"ఈ ముసలిదానిమాట విను. ఏమిదిక్కొచ్చిందిరా బాబూ! జపంకూడా కాలేదు.మీతాతకు అరవై మూడువివా

పోలయ్యాయి. పమునాళ్ళేండ్లదేకాని డొబ్బదినాళ్ళేండ్లదే కాని పిలిస్తే లేదని అనేవారుకాదు."

"తాతగారికిస్వర్గలాభంకలుగాక! నేనుపమునాలుగేండ్లు కాలికనే వెనుకతూబయలుదేరాను, తిరిగివచ్చిడెబ్బదినాలుగేండ్లాబిక విషయం తెలుసుకుంటాను."

"వెళ్ళు, వెళ్ళు! నాజపం ఆగిపోయింది.నువ్వుచాలా ధూర్తుడవై పోయావని నయనతారతో చెప్తాను."

"అవునవును, చెప్పు. మెచ్చుకొని నీకు వేయించిన శనగలు పంపుతుంది" అని వ్రజేశ్వరుడు సాగర్‌ను వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు.

# 6

సాగర్‌కోసం అత్తవారింట్లో ప్రత్యేకంగా రెండు గదులు లభించాయి. ఒకటిక్రింద, మరొకటి పై అంతస్తులోనూ. క్రిందిగదిలో కూర్చొని ఆమె తాంబూలం వగైరా సేవిస్తూవుండేది. తన తోటివారితో ఆటలాడుకుంటూ వుండేది. పైగది పడకగది, అందుకని వ్రజేశ్వరుడు వృద్ధురాలి వద్దనుంచి సరాసరి పైకివెళ్ళాడు.

అక్కడసాగర్ లేదు-ఆమెకు బదులు మరొకరెవరో వున్నారు-ఈమే మొదటిభార్య అయివుంటుందని అతడు వూహించాడు.

వ్రజేశ్వరుడు చాలా ఇరుకునపడ్డాడు ఇద్దరికీఎంతదగ్గర సంబంధం! స్త్రీ పురుషులుపరస్పరంఒకరికొకరుఅర్ధాంగాలు, వారిపరస్పర సంబంధం ప్రపంచంలోని అన్నిబంధాలకంటె చాలా సన్నిహితంగా వుంటుంది. కాని వారు ఒకరొకరు

చూసుకోలేదుకూడా, మాట్లాడనైనా లేదు. ఇప్పుడేవిధంగా సంభాషణ నారంభించాలి! మొదట ఎవరుమాట్లాడాలి? అందులో ముఖ్యంగా ఒకరు ఒకర్ని గెంటివేయాలని, మరొకరు గెంటించుకోవాలని వచ్చారు.

ముందు ఎవరుమాట్లాడ్డం సబబోఏమో కాని ముందు ఇద్దరిలో ఎవరుమాట్లాడలేదు. చివరకు ప్రఫుల్ల కొద్దిగా దరహాసంచేసి కొంగు మెడకుచుట్టుకొని ప్రజేశ్వరునిపాదాలకు నమస్కరించింది.

ప్రజేశ్వరుడు తనతండ్రివంటివాడు కాడు. నమస్కారాన్ని స్వీకరించి నిర్వికారంగా ప్రఫుల్ల చేతుల్ని పట్టుకొని నిల్చొనబెట్టాడు. తర్వాత ఆమెనుమంచంపైకూర్చుండచేసి తాను కూడా ఆమెచెంతనే కూర్చున్నాడు.

కూర్చుండజేసే సమయమందు ప్రఫుల్ల ముఖంమీది ముసుగు తొలగిపోయింది. ప్రఫుల్ల ఏడుస్తూవుండటం ప్రజేశ్వరుడు గమనించాడు. అశ్రుపూరితాలైవున్న నేత్రాల క్రింద_కన్నీటి బిందువులు జాలువారినచోట_ప్రజేశ్వరుడు అనాలోచితంగా ముద్దుపెట్టుకున్నాడు. అంతలోనే తలుపు చాటునుంచి తొంగిచూచే ముఖం కన్పించిందెవరిదో. ఆ ముఖం నవ్విందో, లేక ఆముఖం కన్పించినవ్యక్తి ఆభరణాల ధ్వనివినో ప్రజేశ్వరుడు అటు తిరిగిచూశాడు. ఆముఖం అందమైనదే, నల్లనికేశములపైగా ముసుగువేసుకొనివుంది. ఆముసుగులోనుంచి కమలములవంటి నేత్రాలు రెండు, ఎర్రిగావున్న పల్చని పెదవులురెండు దరహాసంచేయటం కన్పించిందతనికి. సాగర్ దే ఆముఖం. సాగర్ తనభర్తకు ఒక

తాళము, తాళంచెవిని చూపించింది. సాగర్ వయస్సున చిన్నది. భర్తతో ఎక్కువగా మాట్లాడునది కాదు. ముందుగా విశ్వేశ్వరునకు ఏమీ బోధపడలేదు. కానీ వెంటనే గ్రహించుకున్నాడు. సాగర్ తలుపులు లాగి గొళ్ళెం తగిలించి తాళం వేసి పారిపోయింది. తాళంవేయుటంచూసి విశ్వేశ్వరుడు "సాగర్, ఏమిటా పని?" అంటూ నేవున్నాడు. సాగర్ తనపని ముగించుకొని తిన్నగా వృద్ధురాలి మంచంమీదికి వెళ్ళిగాని స్థిమితపడలేదు.

"ఏం జరిగిందమ్మా సాగర్, ఇక్కడ నిద్రపోతున్నావేం?" అడిగింది వృద్ధురాలు. సాగర్ ఏమీమాట్లాడలేదు.

"నిన్ను విశ్వేశ్వరుడు తరిమేశాడా ఏం?"

"లేకపోతే నీవద్దకు ఎందుకొస్తాను? ఇవ్వాళ నీవద్దనే పడుకుంటాను" అంది సాగర్.

"సరే అలాగే నిద్రపో. కాస్సేపాగితే తనేపిలుస్తాడు. అమ్మో! మీ తాతకూడా నెలకు ముప్ఫైరోజులు నన్నిలాగే తరిమేసేవారు. మళ్ళ వెంటనే పిలిచేవారు. నేనుకోపంతో వెళ్ళేదానిని గాదు. అయినా చివరకు స్త్రీ ప్రాణం పురుషుని చేస్తుందా-వుండగలిగేదాన్నికూడా కాదు. ఒకనాడు ఏం జరిగిందంటే——"

"అవ్వా, ఒక కథ చెప్పవూ?"

"ఏ కథ చెప్పను, ఆజోడు పావురాలకథ చెప్పనా! ఒక్కదానివే వింటావా? అదే కొత్త కోడలు వచ్చిందిగా? ఆమెను పిల్చుకురా - ఇద్దరూ విందురుగాని."

'ఆమె ఎక్కడుందో ఏమో నాకు తెలియదు, నేను వెళ్ళను. నేనొక్కదానినే వింటాను చెప్పు' అంది సాగర్.

వృద్ధురాలు సాగర్ దగ్గరే కూర్చొని కథ చెప్పనారంభించింది. సాగర్ కథ ఆరంభం కాగానే నిద్రపోయింది. వృద్ధురాలు కాస్సేపటివరకు కథ చెప్తూనే వుంది, తర్వాత తన శ్రోత నిద్రపోయే సంగతి తెలియగానే చాలా విచారించి కథను అసంపూర్తిగానే ఆపేసింది.

రెండో రోజు తెల్లవారగానే సాగర్ వచ్చి తాళం తెరచి వెళ్ళింది. ఆ తర్వాత మొదలకుండా తిరిగివచ్చి నిద్రపోయే వృద్ధురాలి చెపవద్ద ఆ విరిగిపోయిన రాట్నంతో గంగర లాడించ సాగింది.

తాళము, గొళ్ళెము తెరిచిన ధ్వనివిని ప్రఫుల్ల లేచి నిల్చొని 'సాగర్ తాళం తెరచి వెళ్ళింది, నేనిక వెళ్తాను. భార్యగా స్వీకరించినా స్వీకరించకపోయినా దాసీగానైనా గుర్తుంచుకోండి' అని అంది.

'అప్పుడే వెళ్ళకు. నేను మరొకపర్యాయం నాన్నగారిని అడిగిచూస్తాను.'

'అంతమాత్రాన వారు తమ అభిప్రాయాన్ని మార్చుకుంటారా?' అని అడిగింది ప్రఫుల్ల.

'మార్చుకోపోవచ్చు, కాని నా కర్తవ్యమేదో నేను నెరవేర్చుకోవాలిగా! అకారణంగా నిన్ను త్యజించటంవల్ల నాకు పాపం చుట్టుకుంటుంది.'

'మీరు నన్ను త్యజించ లేదుగా — మీరు స్వీకరించారు నన్ను. మీ శయ్యపై ఒకనాడు చోటిచ్చారు నాకు. అదే

స్వర్గం. ఈదుఃఖతురాలి కోసం తండ్రితో వివాదంపడవద్దనే నాప్రార్థన, దానివల్ల నాకు సుఖంకలుగదు.'

'అయినప్పటికి నీపోషణ విషయం వారిద్వారా ... ఒకటి ఏర్పాటు చేయించాలిగదా.'

'వారునన్ను త్యజించారు. వారినుంచి భిక్షకో... నేను, మీస్వంతమనేది ఏమైనావుంటే తప్పక మిమ్మల్ని అడిగి తీసుకుంటాను."

'నావద్ద ఏమీలేదు. ఈ ఉంగరంమాత్రం వుంది. ఇప్పటికి దీనినితీసుకువెళ్ళు. దీనినిఅమ్మిపనిజరుపుకో, తర్వాత నే నేమైనా సంపాదించేందుకు యత్నిస్తాను. ఏవిధంగానైనా సరే నేను నిన్నుపోషిస్తాను.' అన్నాడు ప్రజేశ్వరుడు.

పరిపుల్ల ఉంగరాన్ని ధరిస్తూ 'మీరు నన్ను మర్చిపోతే?" అని అడిగింది.

'అందర్నీమర్చిపోగలను కానీ నిన్ను మర్చిపోలేను.'

'ఇవాల్టి తర్వాత ఒకవేళ గుర్తించలేకపోతే?'

'ఈ సుఖాన్నెన్నడూ మర్చిపోలేను.'

'నేనీ ఉంగరాన్ని అమ్మను. ఆకలితో చనిపోయినా అమ్మను. మీరునన్ను గుర్తించనప్పుడు మీకీ ఉంగరాన్ని చూపిస్తాను. దీనిమీద ఏమి వ్రాసివుంది?'

'నాపేరే చెక్కివుంది.'

కన్నీళ్ళతో ఇద్దరూ విడిపోయారు.

క్రిందికిరాగానే పరిపుల్లకు సాగర్, నయనతారలు కన్పించారు. 'అక్కా, రాత్రి ఎక్కడ విసిరిపోయావ్?' అని అడిగింది నయనతార.

వైరాన్ని మర్చిపోతారు. ఈగుణం బెంగాలలీలో నేటికీవుంది.

ప్రఫుల్ల ఒంటరిగానేవుంది. గ్రామంలోనివారు వచ్చి ప్రఫుల్లతో - పదునాల్గవరోజున కర్మచేయాలని చెప్పారు. "చేయాలనేవి నాకూవుంది, కానీ వాటన్నిటికీ డబ్బెక్కడి నుంచితేను? అంది వారితో.

"దానికి నువ్వేమీ విచారించకు, అదంతా మేము చూస్తాం" అన్నారువారు. కొందరు డబ్బు, మరికొందరు బియ్యం ఇచ్చారు. ఆవిధంగా దినవారాలకు, బ్రాహ్మణ భోజనాలకు కావల్సిన ఏర్పాట్లు జరగసాగాయి.

"మీ తల్లి కర్మనాటికి మీ మామగారినిపిలవాలావద్దా అని ఆలోచిస్తున్నాను" అన్నాడొక గ్రామపెద్ద.

"పిలవటానికి వెళ్ళేదెవరు?" అంది ప్రఫుల్ల.

గ్రామపెద్దలిద్దరు బయలుదేరారు. గ్రామంలో ఏది జరిగినా ముందు పెత్తనంచేసేయోగం వారికి వుండనేవుంది. "మీరే అపవాదులువేసి వారిసంబంధాన్ని త్రెంచేశారు గదా?" అనిఅడిగింది ప్రఫుల్ల.

"అదంతామర్చిపో. ఇక, అవన్నీమేము సరిచేస్తాం. నువ్విప్పుడిక అనాధవు నీయందు మాకు ఎటువంటి శత్రుత్వమూలేదు" అన్నారువారు.

ప్రఫుల్ల అందుకు అంగీకరించింది. ఆఇద్దరూ హరవల్లభ బాబును ఆహ్వానించేందుకు బయలుదేరి వెళ్ళారు. "ఏం ఠాకుర్! మీరేగా ఆనాడు వియ్యపురాలిని పిలిచి కులబహిష్కారంచేసింది-ఇప్పుడు మీరే ఈవిధంగా చెప్తున్నారేమిటి?" అని అడిగాడు హరవల్లభుడు.

"అరే. మీరూ, అలా అంటారేమిటి? ఏదో ఇరుగు పొరుగున తగాదాలు వుంటూవుంటాయి – అందులో నిజం ఏమీలేదు. అదంతా నింద" అన్నారా బ్రాహ్మణులు.

హారవల్లభుడు ధనికుడు. "ఇదంతా మోసం, వీళ్ళు ఆపిల్లవద్ద ఏమాత్రమో డబ్బుతిని వుంటారు. ఇంతకూ ఆకష జాతిపిల్లకు డబ్బెక్కడినుంచి వచ్చింది?" అనిఆలోచించి హారవల్లభుడు వారి ఆహ్వానాన్ని ఖాతరు చేయలేదు. ప్రఫుల్ల యందు ఆయనకు మరింత ఆగ్రహం కల్గింది.

వ్రజేశ్వరుడు ఇదంతావిని "ఒకరాత్రి రహస్యంగా వెళ్ళి ప్రఫుల్లను చూసి మరల ఆరాత్రే తిరిగివచ్చేయాలి" అని ఆలోచించాడు.

వెళ్ళిన పెద్దలు నిరాశతో తిరిగి వచ్చేశారు. ప్రఫుల్ల యాథా విధిగా పొరుగువారి సహాయంతో శ్రాద్ధ కర్మలు ముగించింది..

వ్రజేశ్వరుడు వెళ్ళేందుకు అవకాశం వెదుక్కో సాగాడు.

## 8

ప్రఫుల్ల ఇంటిసమీపానే పూలమణి అనే మంగలిస్త్రీ వుంటూవుండేది. తల్లి చనిపోయిన తర్వాత ప్రఫుల్ల ఇంట్లో ఒంటరిగానే వుంటోంది. ఆమె సౌందర్యవతి, యౌవనంలో వుంది. ఒంటరిగా ఇంట్లో వుండటం భయంగానూవుంది, నిందగానూవుంది. రాత్రులందు జతగా వుండటానికి ఒకస్త్రీ అవసరం. ప్రఫుల్ల పూలమణి నడిగింది. పూలమణి వితంతువు.

ఆమెకుకూడా ఒకవితంతు అక్క తప్ప మరెవరూ లేరు. ఆ అక్కచెల్లెళ్లిద్దరూ ప్రఫుల్ల తల్లి సహాయానికెంతో ఋణపడి వున్నారు. అందుకని పూలమణి ప్రఫుల్ల అడగ్గానే అంగీకరించింది. ప్రఫుల్లతల్లి చనిపోయింది మొదలు పూలమణి రాత్రులందు ప్రఫుల్లకు జతగా వారింటివద్దనే పడుండేది.

కానీ పూలమణి ఎటువంటి ప్రవర్తనగలదో పాపం ప్రఫుల్లకు సరిగ్గా తెలియదు పూలమణి ప్రఫుల్లకంటే వయస్సులో పది సంవత్సరాలు పెద్ద. చూపులకు అంత అసహ్యంగావుండదు, వేషభాషల్లో కొంచెం తళుకు బెళుకులు ప్రదర్శించేది. అసలే తక్కువ జాతి స్త్రీ, పైగా బాలవితంతువు. అందుకని పవిత్రతను కాపాడుకోలేకపోయింది. ప్రాణచౌధరి ఆగ్రామ జమీందారు. దుర్లభ చక్రవర్తి అనే వారొకరు కూడా అప్పుడప్పుడు ఆగ్రామానికివచ్చి జమీందారీ వ్యవహారాలు చూసుకుపోయేవాడు. పూలమణియందు ఆయనకు ప్రత్యేక శ్రద్ధ అనిగానీ లేక పూలమణికే వారియందు ప్రత్యేక శ్రద్ధ అనిగానీ జనంచెప్తారు. ఈవిషయాన్ని ప్రఫుల్ల ఎప్పుడూ వినలేదా అంటే అదేమీకాదు. కానీ తన కొంపవదలి రాత్రులందు ఎవరువచ్చి తోడుగా వుంటారుమరి. అందుకనే "ఆమె మంచిదయినా, చెడుదయినా నాకెందుకు-నేను చెడ్డదానిని కాకపోతే ఎవరేం చేస్తారు" అని అనుకుంది ప్రఫుల్ల.

పూలమణి నాలుగైదురోజులు సమయానికి వచ్చి అక్కడే పడుకొంది. శ్రాద్ధం జరిగిన మరునాడు పూలమణి కాస్త ఆలస్యంగా వచ్చింది. దారిలో ఒక మామిడితోట వుంది. పూలమణి వస్తూవస్తూ ఆతోటలోకి పోయింది. ఒక

చెట్లక్రింద పురుషుకొకడు నిలబడివున్నాడు. అతడే దుర్లభ చంద్రుడని వేరే చెప్పాల్సిన పనిలేదు.

రంగు అంచుచీరకట్టి, తాంబూలంతో ఎర్రబడ్డ పెదవుల అభిసారిక పూలమణిని చూచి దుర్లభచక్రవర్తి "ఇవాళ ఎలా వుంటుందంటావ్?" అని అడిగాడు.

"అవును ఇవాళ బాగానే వుంటుంది. నువ్వు సరిగ్గా రెండు జాముల ప్రొద్దుపోయింతర్వాత పల్లకితీసుకొనిరా. నెమ్మదిగా తలుపుతట్టు, గందరగోళమేమీ జరక్కుండామాత్రం చూడు సుమా!" అందిపూలమణి!

"నువ్వేమీ భయపడకు. ఆమె గల్లంతేమీ చేయదు గదా!" అన్నాడు దుర్లభచంద్రుడు.

"అందుకు ఒకపని చెయ్యి. నేను నెమ్మదిగా తలుపు తెరుస్తాను, ఆమెనిద్రలో వుండగానే గుడ్డలతో నోటికికట్టివేస్తే సరి, ఇంకేం అవుతుంది" అంది పూలమణి

"అంతబలవంతానతీసుకువెళ్తే ఎన్ని రోజులువుంటుంది" అన్నాడు చక్రవర్తి.

ఒకసారి తీసుకువెళ్ళగలిగితే అన్నివాటంతటవే చక్క బడిపోతాయి. ఎటుచూసినా ఎవరూ నా అనేవారు లేరు. తిండికే మహాదుర్భరంగా గడుస్తోంది అటువంటప్పుడు కడుపునిండాతిండి, కట్టుకోనుబట్ట కావల్సినంత డబ్బువస్తాయి, సంసారసుఖాన్ని పొందుతుంది- ఎందుకుపుండదు' ఆ బాధ్యత నాది. నాకుడబ్బు, నగల్లోమాత్రం భాగంకావాలి" అంది పూలమణి.

సంభాషణ ముగియగానే దుర్లభుడు వెళ్ళిపోయాడు. ఫూలమణి ప్రఫుల్లఇంటికి చేరుకొంది. పాపం ఆమెకు మాత్రం ఈసర్వనాశ సమాచారమేమీ తెలియదు. ఆమెతల్లినిగురించి ఆలోచించుకొంటూ నిద్రపోయింది.

సరిగ్గా రాత్రి రెండుజాముల ప్రొద్దుపోయిం తర్వాత దుర్లభ చక్రవర్తి తలుపుకొట్టాడు. ఫూలమణి తలుపు తెరిచింది. దుర్లభుడు ప్రఫుల్లను గట్టిగాకట్టేసిపల్లకీలోపడేశాడు. బోయీలు చప్పుడేమీ చేయకుండా ప్రాణబాబు వినోద మందిరం దిక్కుగా వెళ్ళిపోయారు. ఫూలమణికూడా వెంటే వుందని చెప్పనవసరంలేదు.

అరగంట తర్వాత వ్రజేశ్వరుడు ఆశూన్యగృహంలో ప్రఫుల్లను వెదికేందుకు వచ్చాడు. అతడు ఎవరికీ తెలియకుండా రహస్యంగా రాత్రియందు వచ్చాడిక్కడికి, పాపం! ఎవరూ కన్పించలేదిక్కడ.

బోయీలు చప్పుడేమీ చేయకుండా పల్లకీని ఎత్తుకొని పోయారని పైనమేము చెప్పాము. అది అతిశయోక్తిగా మాత్రం మీరు భావించనవసరంలేదు. బోయీలకు ఏదో ఒకటి అంటూవెళ్లే అలవాటుంటుంది. కానీ మాట్లాడవద్దని నిషేధించారు. గనుకవారు మాట్లాతూవెళ్తే అంతా తలక్రిందైపోతుంది, అదేకాదు, మరొక ప్రమాదం కూడా కలగవచ్చు. ఆరోజుల్లో దొంగలభయం ఉన్నతం ఎక్కువగా మరేకాలంలోనూ ఇంకేదేశంలోనూ లేదనటంలో సందేహమేమీ లేదు. ఆసమయమున దేశంలో అరాజకం ప్రబలిపోయివుంది. ముస్లిం చక్రవర్తుల పాలన అంతరించి పోయి

నల్లే, ఆంగ్లేయులింకా అధికారంలో గట్టిగా కాలూని నిల బడలేదు. అప్పుడప్పుడే పాతుకుపోతున్నారు. ఈ అధికార ప్రవర్తనవల్ల దేశానికి చాలా హానికలిగింది. దేవీసింహుని అధికారంవుండే పైగా ఖండాంతరపు వెస్ట్ మినిష్టర్ సభా భవనంలో నిలబడి ఎడ్మండ్ బర్క్ దేవీసింహుని పేరును చిరస్థాయి చేసివేశాడు - అగ్నిపర్వతం నుంచి వెలువడిన అగ్నిప్రవాహంవంటి వాగ్ధోరణితో బర్క్ మహాశయుడు దేవీసింహుని అత్యాచారాలగాథను చిరకాలం వర్ణిస్తేచేసి పోయాడు - దానిని విని ఎందరో స్త్రీలు మూర్ఛ చెందారు. వందసంవత్సరాల అనంతరం నేను కూడా ఆ ఉపన్యాసాన్ని చదివితే ఒడలుజలదరిస్తుంది. హృదయం ఉన్మత్తమైపోతుంది. బరేంద్రభూమి ఆ భయంకర అత్యాచారంలో మునిగిపో యింది. ఎందరో క్షుధార్తులు చనిపోయారు. అంతేకాదు వారు తమ స్వగృహాల్లో సైతం వుండలేకపోతున్నారు. తిన తిండిలేనివారు ఇతరులవద్దనుంచి బలవంతాన లాక్కొని తింటున్నారు. గ్రామగ్రామాన దొంగలు, దోపిడీ దారులు మూఠాలుగా విజృంభిరెచ్చిపోయారు. ఇటువంటి పరిస్థితుల్లో రాజ్యపాలన ఎవరికీ సాధ్యంకాదు.

రంగపూరుకు మొదటి కలెక్టరుగా వచ్చింది గుడ్ లెడ్ దొర. సైన్యమంతా వారి అధీనంలోనే వుండేవి. బంది పోటుల్ని, దొంగల్ని వేటాడటానికి అతను సైనికదళాలను పంపాడు. కానీ సైనికులు లేమీ చేయలేకపోయారు.

అందుకని దొంగలెక్కడ విరుచుకు పడతారోనని దుర్లభచంద్రుడు భయపడుతున్నాడు. దొంగతనంగా ఎత్తు

కొచ్చిన ప్రఫుల్లను దోచుకుపోతారేమో! పల్లకీని చూస్తే దొంగలు మరింత తేలిగ్గా రావచ్చు. అందుకని బోయీలు మెదలకుండా నడుస్తున్నారు. గల్లంతుగావుంటుందనే భయం వల్ల పల్లకీవెంట దుర్లభుడు, ఫూలమణి తప్ప మరెవ్వరూ లేరు. ఈ విధంగా భయపడుతూనే నాలుగు క్రోసులు ప్రయాణం చేశారు.

ఆ తర్వాత చాలా దట్టమైన అడవిలో ప్రవేశించారు. ఇద్దరు మనుషులు ఎదురుగా రావటంగమనించారు బోయీలు. చీకటి దట్టంగావుంది, నక్షత్ర ప్రకాశంలో వారి ఆకారాలు మాత్రం అస్పష్టంగా కన్పిస్తున్నాయి. సాక్షాత్తు యమదూతలు వస్తున్నట్లే కన్పించింది బోయీలకు.

“నాకు అనుమానంగా వుంది, ఆ యిద్దరూ ఎవరు?” అన్నాడొక బోయీ.

“రాత్రులందు సంచారం చేస్తూ వున్నారంటే మంచి వారవుతారా?” అన్నాడు మరొక బోయీ.

“వారి చేతుల్లో ఉన్న వేమిటి–కర్రలనుకుంటా” అన్నాడొకడు.

“వారు చాలా బలంగా ఉన్నట్లేవుంది” అన్నాడు వేరొకడు.

“చక్రవర్తి మహాశయా! ఏమంటారు మీరు? మా కాలు ముందుకు సాగటం లేదు. ఈ దొంగల చేతుల్లో ఇవాళ చచ్చినట్లులెక్కే” అన్నాడు మొదటిబోయీ.

“అదే నేనూ యోచిస్తున్నా. గొప్పచిక్కే, భయపడినంతా జరిగింది” అన్నాడు దుర్లభచంద్రుడు.

వస్తూవున్న ఆ వ్యక్తులిద్దరూ మార్గంలో మనుష్యుల్ని చూసి "ఎవర్రా మీరు?" అన్నారు.

బోయీలు పల్లకీని అవతలపారేసి "అమ్మబాబో చచ్చాం" అంటూ అడవిలోకి పరుగుతీశారు. అది చూచి దుర్లభచక్రవర్తి కూడా వారి మార్గాన్నే అనుసరించాడు. "నన్ను వదలి పోతున్నారెక్కడికి?" అని కేకలేస్తూ పూలమణికూడా అతని వెనుకే పరుగెత్తింది.

ఈ పదిమంది వ్యక్తులూ భయపడింది ఆ ఇద్దర్నీ చూసే. ఆ యిద్దరూ పడమటిగ్రామవాసులు, దినాజ్‌పురం కచేరీలో ఏదైనా ఉద్యోగంకోసమని వెళ్తున్నారు. తెల్లవారేటాని కెంతో సమయంలేదని కొంతరాత్రి వుండగానే బయలు దేరారు. బోయీలు పారిపోవటంచూసి పొట్టచెక్కలయ్యేట్లు నవ్వేశారు. తర్వాత తమదారిని తాముపోయారు. కాని చక్రవర్తి మహాశయుడుగానీ, పూలమణిగానీ బోయీలుగానీ యిక అటు కేసి తిరిగైనా చూడలేదు.

ప్రఫుల్ల పల్లకీలో కూర్చున్న తర్వాతనే తననోటికి కట్టిన కట్లను విప్పుకుంది. అర్ధరాత్రి సమయాన అరవటం కూడా అనవసరమని భావించింది. కేకలువేసికూడా దొంగల ముందుకు ఎవరొస్తారు. మొదట భయంవల్ల ఏంచేయాలో ఆమెకేమీ బోధపడలేదు. కానీ తర్వాత సాహసించనిదే విముక్తిచెందటం అసంభవమని గ్రహించింది. బోయీలు పల్లకీని పారేసి పారిపోయేసరికి వేరొక భ్రాంతి అపదవచ్చినట్లు గ్రహించిందామె. ఆమె నెమ్మదిగా పల్లకీ తలుపును తెరిచింది! తల బైటకుపెట్టి ఇద్దరు మనుష్యులు రావటం గమ

నించిందామె. వెంటనే తలుపుమూసి వేసింది. ఆ ఇద్దరూ వెళ్ళిపోవటం కూడా చూసింది తలుపు సందులోంచి. అప్పుడిక ప్రఫుల్ల పల్లకీనుంచి బయటకు వచ్చి చుట్టూచూసింది. ఎక్కడా ఎవరూ కన్పించలేదు.

నన్ను ఎత్తుకొచ్చినవారు త్వరలోనే తిరిగిరావచ్చు, కనుక రోడ్డు వెంటవెళ్తే పట్టుబడతానని ఆలోచించింది ప్రఫుల్ల. కనుక ఇప్పటి కీఅడవిలోనే దాగివుంటే ఉదయం ఏం జరిగుతుందో చూద్దాం అనుకుంది; వెంటనే అడవిలోకి వెళ్ళిపోయింది అదృష్టవశాత్తు బోయీలు వెళ్ళిన దిక్కుగా వెళ్ళలేదు. మార్గంలో ఎవరూ కన్పించలేదామెకు. కాస్సేపట్లో తెల్లవారింది.

ఉదయమవగానే ప్రఫుల్ల అడవిలో అటు ఇటు తిరగ సాగింది. బయటకు రావటానికింకా ధైర్యం చాలలేదామెకు. ఆ అడవిలో ఆమెకు స్పష్టంగావున్న ఒకకాలిబాట కన్పించింది. తప్పక ఇటు ఎవరైనా నివసిస్తూ వుంటారని భావించింది ప్రఫుల్ల, అటే బయలుదేరింది ఇంటికి రావాలంటే భయంగావుంది. మళ్లా ఆదొంగలు రావచ్చు. కనుక వక్రూర జంతువులు తినేసినా దొంగల చేతుల్లో పడటం కంటే మంచిదనుకుంది.

ఆకాలిబాటనే ప్రఫుల్ల చాలాదూరం వెళ్ళిపోయింది. కాని గ్రామంవున్న చిహ్నలేమీ కన్పించలేదు. కాలిబాట కూడా అంతటితో ఆగిపోయింది. ముందుకు దారి కన్పించటమే లేదు. రెండుమూడు పాత ఇటుకలు కన్పించాయామెకు. సమీపంలో ఇల్లుకూడా వుండవచ్చునని ఆలోచించింది.

ముందుకుసాగిపోగా ఇటుకల సంఖ్య హెచ్చింది. దానితో పాటు అడవికూడా మరింత దుర్భేద్యమైపోయింది. చివరకా కీకారణ్యం మధ్య ప్రఫుల్లకు ఒక శిథిలగృహం కన్పించింది. ఒకప్పుడది ఒకగొప్ప భవనమేనని తెలుస్తుంది చూడగానే. ప్రఫుల్ల ఆ ఇటుకల గుట్టపైకెక్కి చుట్టూ చూసింది. ఒక ప్రక్క నిదర్శనంగా రెండు గదులుకూడా కన్పించాయి. ఇక్కడెవరైనావుంటే వుండవచ్చునని యోచించింది ప్రఫుల్ల. ఒకగదిలోకి వెళ్ళి చూసింది. లోన ఎవరూ లేరు, అయినా ఎవరో వుంటున్నట్లుగానేవుంది. కొద్దిక్షణాల అనంతరం ఒక వృద్ధుడెవరో మూల్గినట్లుగా విన్పించిందామెకు. ఆ ధ్వనిననుసరించి ఆమె ఒకగదిలోకి వెళ్ళింది. ఒకవృద్ధుడెవరో మూల్గుతూ పడివున్నాడు. వృద్ధునిశరీరం శుష్కించిపోయి వుంది. పెదవులు ఎండిపోయి, కళ్ళు పీక్కుపోయాయి. శ్వాస చాలానమ్మదిగా ఆడుతోంది. అతనికి మృత్యువు ఆసన్నమయినట్లు గమనించిందామె? వెంటనేఅతని ప్రక్కగా వెళ్ళి నిల్చుంది.

«ఎవరమ్మా నువ్వు! నువ్వే దేవివైనావా! మృత్యు సమయంలో నన్నుద్ధరించటానికి వచ్చావాతల్లీ?" అన్నాడు వృద్ధుడు అతిక్షీణస్వరంతో.

"నేనొక అనాథను. దారితప్పి ఇటుగావచ్చాను. నువ్వూ అనాథుడవే ననుకుంటాను. నీకేమైనా సహాయం చేయగలనా నేను?" అనిఅడిగింది ప్రఫుల్ల.

«చాలా సహాయం చేయగలవమ్మా! నందనందను నికి జై! ఇలాంటి సమయంలో మనుష్యుని ముఖం చూడ

గలిగాను. దాహంతో ప్రాణం పోతోంది, కొంచెం మంచి నీళ్ళివ్వు తల్లీ!" అన్నాడు వృద్ధుడు.

జలకలశము, అందులో నీరు, త్రాగటానికొక పాత్ర అన్నీ వున్నాయక్కడ. కాని ఇచ్చేవారు మాత్రమే ఎవరూ లేరు. ఆమె కొంచెం నీరు త్రాగించింది వృద్ధునికి.

దాహం తీరగానే కొంచెం స్వస్థత కలిగిందతనికి. ఈ అడవిలో ఒంటరిగా ఈ స్థితిలో చావబోతున్న వృద్ధుణ్ణి చూసి ప్రఫుల్లకు చాలా కుతూహలం కలిగింది. కాని వృద్ధుడు ఎక్కువగా మాట్లాడలేక పోవటంవల్ల అతణ్ణిగురించి ఆమె ఎక్కువగా తెలుసుకోలేకపోయింది. ఆ వృద్ధుడు చెప్పిన దాని సారాంశం ఇలావుంది—

వృద్ధుడు వైష్ణవుడు. అతనికి భార్యతప్ప మరెవ్వరూ లేరు. ఆమెకూడా వృద్ధుడు మరణించే సమయానికి, వున్న సంపదంతో సహా పారిపోయింది. వృద్ధుడు వైష్ణవుడు కావటంవలన దహనం చేయవీలులేదు, సమాధి చేయాలి. అతని కోర్కెననుసరించి భార్య ఆ ఆవరణంలో ఒక గొయ్యి త్రవ్వి వెళ్ళింది "పార — పలుగులు ఆ సమీపానే ఎక్కడో వుంటాయి. నేను చనిపోగానే నన్ను ఆసమాధిలోనె పూడ్చి వేయాలి" అని వృద్ధుడు ప్రఫుల్లను ప్రార్థించాడు.

ప్రఫుల్ల సమ్మతించిందందుకు. ఆతర్వాత వృద్ధుడు ఈవిధంగా చెప్పాడు. "నాసంపద కొంత పాతిపెట్టివున్నది. అది నా భార్యకు తెలియదు. లేకపోతే వదిలిపోయేదికాదు. ఆ సంపదను ఎవ్వరికీ ఇవ్వనిదే నా ప్రాణాలు పోవు. ఎవరికీ ఇవ్వకుండా చనిపోతే నా ఆత్మ ఇక్కడే తిరుగుతూవుంటుంది.

నాకు ముక్తి లభించదు. నాభార్యకే ఆడబ్బు ఇచ్చిపోయే వాడిని, కాని ఆమె పారిపోయింది. ఇప్పుడిక ఎవర్నీ కలుసుకో లేను. కనుక నీకే ఆ ధనాన్ని ఇచ్చివెళ్తున్నాను. నా ప్రక్క క్రింద నలుచదరమైన రాతిపలకవుంది. దాని క్రింద ఒక సొరంగం వుంటుంది, మెట్లుకూడా క్రిందికిదిగివెళ్ళు. భయ పడవద్దు, వెలుగు తీసుకువెళ్ళు. క్రింద ఇలాంటిగదే ఒకటి కన్పిస్తుంది. దాని వాయువ్యదిక్కున వెదుకు, ధనందొరుకు తుంది."

ప్రఫుల్ల వృద్ధునికి సేవ చేయసాగింది.

"ఇంట్లో ఒక పశువులపాకవుంది. అక్కడొక ఆవుకూడా వుంటుంది. పితకగలిగితే పాలుతెచ్చి నాకు కొంచెమివ్వు; నువ్వూ కొంచెం త్రాగు" అని చెప్పాడువృద్ధుడు. ప్రఫుల్ల అదేవిధంగా చేసింది. దారిలో గొయ్యి, దానప్రక్కనే పార, పలుగు కన్పించాయి.

మూడవజామున వృద్ధుడు దేహం చాలించాడు. ప్రఫుల్ల అతణ్ణి మోసుకువెళ్ళింది. వృద్ధుడు గాగా శుష్కించి పోయినందువల్ల తేలికగానే వున్నాడు. ప్రఫుల్లకూడా బలం గలిగినదే కావటంవల్ల కష్టమేమీ లేకుండానే సమాధి కార్య క్రమాన్ని పూర్తిచేసింది. తర్వాత సమీపమందున్న నూతి వద్ద స్నానంచేసి సగం చీరధరించి, సగం ఆరబెట్టుకుంది. అప్పుడు పార, పలుగు తీసుకుని వృద్ధుడు చెప్పిన డబ్బును వెదికేందుకు బయలుదేరింది. వృద్ధుడు తనకు ఇచ్చివెళ్ళాడు, కనుక ఆ సంపదను గ్రహించటానికి ఆమెకే మాత్రం సంకోచం కలగలేదు.

ప్రఫుల్ల వృద్ధుణ్ని సమాధి చేయకముందే అతని పక్కను తీసి అడవిలో పారేసింది. నిజంగానే ఆ పక్క క్రింద ఇంచుమించుగా మూడు చదరపు గజాల రాతిపలక వుంది. పలుగుతో ఆమె ఆ పలకను తొలగించింది. దానిక్రింద అంధకారంగా వున్న ఒక గొయ్యి కన్పించింది. దృష్టి వుంచి చూడగా ఆమెకు అంధకారంలో లోనికి వెళ్ళటానికి మెట్లు కన్పించాయి.

• అడవిలో కర్రలకేం కొదవ. దొడ్డిలో చాలా కట్టెపేళ్ళున్నాయి. ప్రఫుల్ల వాటిని తెచ్చి ఆగోతిలో పడేసింది. తర్వాత ఆమె చెకుముకి రాతికోసం వెదికింది. వృద్ధుడు తప్పక పొగ త్రాగేవాడే అయివుంటాడు. సర్ వాల్టర్ రైలే దీనిని కనిపెట్టిన తర్వాత పొగ త్రాగకుండా ఈ నశ్వరమైన, నీరస జీవితాన్ని గడిపిన వృద్ధులెక్కడున్నారు! వెతగ్గా వెతగ్గా ఆమెకు చెకుముకి కన్పించింది. అప్పుడామె గోతాలనుంచి కొంచెం ఎండు గడ్డి తెచ్చి మంట వేసి మెట్లగుండా క్రిందికి దిగింది. పార-పలుగుల్ని ముందే క్రిందికి పడేసింది. క్రింద ఒక మంచి గది వుంది. ముందుగా పడేసిన కట్టెల్ని ప్రోగుచేసి మంట చేసింది. పైనవున్న మార్గం గుండా పొగ బయటకు పోసాగింది. గదంతా వెలుగుతో నిండిపోయింది. వాయువ్య మూలాలను తెలుసుకొని ప్రఫుల్ల అక్కడ త్రవ్వనారంభించింది. త్రవ్వగా "టప్" అంటూ తగిలిందేదో పలుగుకు. ప్రఫుల్లకు గగుర్పాటు కల్గింది.

పలుగుకు ఏదో కుండ తగలటం వల్లనే ఈ ధ్వని కల్గిందని ఆమె గ్రహించింది. కాని ఈ ధనం ఎవరిదో, ఇక్కడికెలా వచ్చిందో తర్వాత చెప్తాను.

వృద్ధునిపేరు కృష్ణగోవిందదాసు. కృష్ణగోవిందుడు కరుణాలవంశంలో జన్మించాడు. అతను హాయిగాజీవితంగడుపుతుంటున్నాడు. కానీ వయస్సుముదిరిపోటంవల్ల ఒకఅందమైన బ్రాహ్మణస్త్రీ వ్యామోహంలోపడిపోయి అతను బృందావనయాత్రకు బయలుదేరాడు. బృందావనానికిచేరి కృష్ణగోవిందుడు భార్య అక్కడివైష్ణవుల జయదేవగీతాలు, శ్రీమద్భాగవతపాండిత్యాన్ని అందమైన శరీరసౌష్ఠవాన్ని చూచివారిచరణకమలములసన్నిధిని మనస్సునిలిపి పుణ్యము సంపాదించుకోవాలంభించింది. ఇదిచూచికృష్ణగోవిందుడు తనభార్యను తీసుకొని బెంగాలుకుతిరిగివచ్చాడు. అప్పుడతడు నిరుపేద. ఉద్యోగాన్వేషణలో ముర్షిదాబాదుకుచేరాడు. అతనికి ఉద్యోగం లభించింది. దానితోపాటు అతనిభార్యసౌందర్యఖ్యాతి రాజభవనంలోకిప్రాకింది. ఒకనీగ్రోఖోజా ఆమెనుబేగంచేసేందుకు గాను కృష్ణుడికిరాకపోకలుసాగించాడు. ధనాశవల్లఆమెఅందుకుసమ్మతించింది. ఈగడబిడనుచూచి కృష్ణగోవిందబాబా భార్యనుతీసుకొని అక్కడనుంచి పలాయనం చేశాడు. కాని ఎక్కడికిపోవాల్లాడు? ఈఅమూల్యధనంతో జనంలోవుండటం మంచిదికాదనియోచించాడు.ఎవరైనాదొంగిలిస్తే?తిరుగుతూ తిరుగుతూ చివరకి శిథిలగృహానికి చేరుకున్నాడు. ప్రజలదృష్టినుంచి తన అమూల్యమైన రత్నాన్నిదాచుకునే అందమైన ప్రదేశం లభించిందతనికి. ఇక్కడికి ఒకయముడుతప్ప మరెవరూవస్తారనే సందేహం లేదు.అప్పటినుంచి ఇక్కడేవుంటూ వచ్చాడు. తానే ప్రతివారం బజారుకు వెళ్ళి వెచ్చాలుకొని తెచ్చేవాడు. భార్యను ఎక్కడికీ కదలనిచ్చేవాడుకాదు.

ఒకనాడు కృష్ణగోవిందుడు క్రిందిగదిలో పొయ్యి కోసం త్రవ్వుతూవుండగా అతనికి ఒక బంగారునాణెం దొరికింది. అతడు మరికొంత త్రవ్వగా కొంచెం క్రింద ఒకకుండెడు ధనం దొరికింది. ఆ డబ్బు దొరకనిచో కృష్ణగోవిందునికి జీవితం గడవటం దుర్భరమైపోయివుండేది. ఇప్పుడికహాయిగా కాలం గడిచిపోసాగింది. కాని ఇప్పుడొక క్రొత్త తృష్ణ కల్గింది. ఇటువంటి ప్రాచీన గృహాల్లో చాలాధనం లభిస్తుందనే విషయం గుర్తొచ్చిందతనికి. అప్పటినుంచి అతడు ఆపాతివున్న ధనంకోసం అన్వేషణ ప్రారంభించాడు. త్రవ్వగా త్రవ్వగా అనేకస్వరంగాలు, దొంగగదులు, అంతస్థులు కన్పించాయి. కాని ధనం దొరకలేదు. ఒకసంవత్సరంవరకు త్రవ్వి త్రవ్వి విసిగిపోయాడు. శాంతంగా వుంటూకూడా అప్పుడప్పుడు ఆభూతిగృహంలో తిరిగివస్తూవుండేవాడు. ఒకనాడు ఒకమూల ఏదో మెరుస్తూ కన్పించింది. ఎగిరిగంతేసి గబగబ దానిని తీసిచూశాడు. ఎలుకలు ఆమూల మట్టి త్రవ్విపోశాయి. ఆ మట్టిలోనే దొరికిందీనాణెం.

కృష్ణగోవిందుడు మెదలకుండా ఏమీ ఎరగనట్లు వూరుకున్నాడు. సంతరోజు సమీపించింది. భార్యను పిలిచి 'ఇవాళ నా ఆరోగ్యం సరిగాలేదు. నువ్వే బజారుకు వెళ్ళి వెచ్చాలు తీసుకురా' అనిచెప్పాడు. ఇన్నిరోజుల తర్వాత బయటకు వెళ్తుందిగనుక త్వరగా తిరిగిరాదని భావించాడు. ఆ అవకాశం చూసుకొని కృష్ణగోవిందదాసు ఆమూల త్రవ్వగా ఇరవైబిందెల స్వర్ణముద్రణాలు లభించాయి.

పూర్వకాలంలో ఉత్తరబెంగాలును నీలధ్వజ వంశీయుడైన ఒకపరాక్రమశాలిపాలిస్తూవుండేవాడు. ఆవంశంలో కడపటి రాజు నీలాంబరదేవ్. నీలాంబరునికి అనేక రాజధాని నగరాలుండేవి - అనేకనగరాల్లో స్వంతభవనాలుండేవి. వాటిలోదే ఇదొకటి. సంవత్సరానికి ఒకటి రెండు వారాలు ఇక్కడకూడా వుంటూవుండేవాడు. ఒకపర్యాయం ఉత్తర బెంగాలును జయించేందుకు గౌడచక్రవర్తి, నీలాంబరునిపైకి తన సైన్యంతో దండెత్తి వచ్చాడు. పఠానులు గనుక జయిస్తే తనపూర్వీకులు సంపాదించిన ఈ అపారసంపద వారిచేతుల్లో పడుతుందని ఆలోచించి అతడు యుద్ధం ప్రారంభమవక పూర్వమే ఆ ధనాన్నంతా ఇక్కడికి తెచ్చి తానేస్వయంగా పూడ్చివేశాడు. ధనం ఎక్కడుందో ఎవరూ తెలుసుకోలేకపోయారు. యుద్ధంలో ఓడిపోయి నీలాంబరుడు వారికి ఖైదీగా చిక్కాడు. పఠాను సైన్యాధిపతి అతణ్ణి గౌడకుపంపేశాడు. ఆ తర్వాత అతణ్ణి ఈ మానవలోకంలో ఎవరూ చూడలేదు- ఏమయ్యాడో ఏమో ఎవరికీ తెలియదు. అప్పటినుంచీ వారియొక్క ఈధనరాశి ఇక్కడే వుండిపోయింది. అది కృష్ణగోవిందునికి లభించింది. బంగారం, వజ్రాలు, ముత్యాలు వగైరాలసంఖ్యాకంగా, లెక్కలేనన్ని రత్నాలతో నిండివున్న ఆ ఇరవై బిందెలు కృష్ణగోవిందునికి లభించాయి.

అతడు చాలాజాగ్రత్తగ బిందెల్ని తిరిగిపాతేశాడు. భార్యకు ఏమీ చెప్పలేదు. కృష్ణగోవిందుడు చాలాలోభి. ఆలోచించి ఒక్కనాణెమైనా తీసి ఖర్చుచేయలేకపోయాడు. తన

శరీరంలోని రక్తంవలె దానిని కాపాడాడు. మొదట దొరికిన బిందెడు ధనంతోనే కాలక్షేపం చేయసాగాడు.

ఆధనమే ఇప్పుడు ప్రఫుల్లకు లభించింది. వాటినిఆమె యథాప్రకారం పాతిపెట్టిపైకివచ్చి నిద్రపోయింది. పగలంతా శ్రమించటంవల్ల ఆ ఎండుగడ్డి పక్కమీద పరుండగానే ప్రఫుల్ల గాఢనిద్రలో మునిగిపోయింది.

## 10

మంగలిపూలమణి లేడివలెచెంగుచెంగునదూకుతూ దుర్లభునివెంట పరుగెత్తింది. కానీ దుర్లభుడు ముందు తన ప్రాణాలు దక్కించుకోవాలనే ధ్యాసతోవుండటంవలన వెనక పరుగెత్తుతూ వచ్చే ప్రేయసికి అతడు దుర్లభమైపోయాడు. 'అయ్యో ఆగు! నన్ను వదలి వెళ్ళకు!' అనిపూలమణి అర చినకొద్దీ దుర్లభుడు ప్రాణాలు దక్కించుకొనిపారిపోసాగాడు. ముళ్ళపొదల్లో పడి దొర్లుతూ పరుగెత్తున్నాడు. ధోవతి జారిపోతోంది, ఒక కాలిచెప్పు బురదలో కూరుకుపోయింది. దుప్పటి ముళ్ళకు చిక్కుకొని చిరిగిపోయింది. 'అరి పౌరుష హీనుడా! ఒక స్త్రీని మరిపించి అడవికి తీసుకొచ్చి దొంగల చేతుల్లో వదలి పారిపోతున్నావా!' అనిఅరిచిందిపూలమణి. ఇది విని దుర్లభుడు ఆమె తప్పక దొంగలకు చిక్కుతుందని ఆలోచించి మారుమాటలేకుండా మరింత త్వరగా పరుగెత్తాడు. చివరికిక చేయునదిలేక పూలమణి ఏడ్వనారంభించింది. ఏడుస్తూ దుర్లభుని పెద్దలందర్నీ వరుసగా దూషించసాగింది.

కాన్సేపటికి దొంగలు అంతులేరు. దుర్లభుడు ఎక్కడా కన్పించకపోవటం పూలమణిగమనించింది. కొద్దిక్షణాలవరకు అలాగే ఆలోచిస్తూ నిల్చుంది, తర్వాత ఆఅడవినుంచిబయట బడే మార్గం వెదకసాగింది.

ఆమెవంటి నేర్పరిస్త్రీకి అదేమంత కష్టంకాదు.ఆమె సునాయాసంగానే బయటపడింది. చుట్టూ ఎవరూ లేకుండా చూసి తన యింటికి బయలుదేరింది. ఆమెకు దుర్లభునిపై చాలా కోపం వస్తోంది.

పూలమణి ఇంటికి చేరుకునేసరికి చాలాప్రొద్దెక్కింది. ఆమె అక్క అలకమణి ఇంటివద్దలేదు, స్నానానికి వెళ్ళింది. పూలమణి మెదలకుండా తలుపులు వేసుకొనినిద్రపోసాగింది. రాత్రంతా మేల్కొని వుండటంవల్ల వెంటనే కళ్ళుమూతలు బడ్డాయి. అక్క యింటికి తిరిగివచ్చి ఆమెను మేల్కొల్పి 'ఏమే, నువ్విప్పుడే వచ్చావా?' అని అడిగింది.

"నేను ఎక్కడికి వెళ్ళాను అసలు!"అంది పూలమణి.

"ఎక్కడికి వెళ్ళానంటున్నావు! అదే బ్రాహ్మణుల ఇంటికి వెళ్లావుగా పరుండటానికి. ఇంత ఆలస్యంగా వచ్చావేమిటని అడుగుతున్నాను" అంది అలకమణి.

"నువ్వు అంధురాలవే! ఉదయం నీ కళ్ళముందే ఇక్కడికివచ్చి నిద్రపోయాను-నువ్వు చూడనేలేదా?"

'నేను ఉదయం మూడుసార్లు ఆ బ్రాహ్మణులఇంటికి వెళ్ళి చూసివచ్చాను. అక్కడ నువ్వు లేవు, మరెవరూ కూడా కన్పించలేదు. అది సరేగానీ ప్రఫుల్ల ఎక్కడికి వెళ్ళిందివాళ?"

పూలమణి భయంతో కంపించిపోతూ "అక్కా, మాట్లాడకు. అవేమీ నన్నడగకు!" అని అంది.

అలకమణికూడా భయపడి "ఏం? ఏం జరిగింది?" అని అడిగింది.

"అయ్యో! అది చెప్పదగిన విషయంకాదు."

"ఎందుకని?"

"మనం సామాన్య మానవులం. మనకు ఆ బ్రాహ్మణ దేవతలు చేసే పనుల్ని గురించి ఎందుకు?"

అలకమణి మళ్ళీ భయపడి "నువ్వంటున్న దేమిటి?" అని అడిగింది.

"మళ్ళా ఎవరితోనూ చెప్పకు, రాత్రి ప్రఫుల్లతల్లి వచ్చి ఆమెను తీసుకువెళ్ళింది."

"ఏమిటీ?"

అలకమణి శరీరం గడగడ వణికిపోసాగింది. అప్పుడు పూలమణి ఒకకథను అల్లి చెప్పింది-'రాత్రి ప్రఫుల్ల మంచం మీద ఆమెతల్లి కన్పించింది-తర్వాత కొద్దిక్షణాలకు గదిలో తుఫాను వచ్చేసింది. ఆతర్వాతమా స్త్రీఅక్క డెవరూ కన్పించ లేదు!' ఈకల్పితగాథను ముగిస్తూ ఆమె ఈవిషయాన్ని ఎవరితోనూ చెప్పవద్దని అక్కను హెచ్చరించింది.

"అయ్యో, ఇదెక్కడైనా చెప్పే విషయమేనా ?" అంటూ అలకమణి వెంటనే బిందెకడిగే నెపంతో కుండ తీసుకొని గ్రామమంతా తిరిగి ఇంటింటికీ మరికొంత కథను అల్లి విన్పించి వచ్చింది-ఎవరికి వారికే "ఇదుగో, చూడండి మరెవరితోనూ అనకండి" అని హెచ్చరిస్తూనే వుంది. ఈ

విషయం అలా అలా వ్రాకిపోయి చాలా మార్పులు చేర్పులతో ప్రఫుల్ల అత్తవారింటికికూడా చేరింది. ఆ రూపాంతరమెలా చెందిందీ ఆ తర్వాత చెప్తాము.

## 11

ఉదయమే లేచి ప్రఫుల్ల ఆలోచించసాగింది - 'ఏం చేయాలి, ఎక్కడికి వెళ్ళను? ఈ అడవి నివాసయోగ్యంకాదు. ఇక్కడ ఒంటరిగా ఎలావుంటాను. అయితే మరెక్కడికి వెళ్ళను? ఇంటికి వెళ్ళనా? మళ్ళీ దొంగలువచ్చి ఎత్తుకుపోతారు. ఎక్కడికి వెళ్ళాలన్నా ఈ ధనాన్నెలా తీసుకువెళ్తాను. ఎవరి ద్వారానైనా పట్టించుకువెడితే విషయం పొక్క పోతుంది- దొంగలు దోచుకుపోతారు. నమ్మకమైన వాళ్ళనామాత్రం ఎక్కడ దొరుకుతారు. ఎవరికి తెలిసినా నన్ను కూడా చంపి ధనంతీసుకుపోతారు. ఇంతధనాన్ని చూసి ఆశించకుండా ఎవరుంటారు?' అనేకవిధాల ఆలోచించుకొని చివరికిఅక్కడ వుండటానికే నిశ్చయించుకొంది. 'ఏమి జరుగుతుందో చూస్తాను. నాకు దుర్గాపురం ఎంతో ఈ అడవీ అంతే. ఈ రెండింటికి అట్టే తేడాలేదు. అక్కడకూడా దొంగలుఎత్తుకుపోతూ వుండేవారు. ఇక్కడ అంతకంటే. ఎక్కువేం జరుగుతుంది" అనికూడా యోచించింది.

ఈవిధంగా నిశ్చయించుకొని ప్రఫుల్ల ఇంటిపనుల్లో మునిగిపోయింది. ఇల్లంతా వూడ్చిశుభ్రం చేసింది. ఆవును కావల్సినవన్నీ చూసి తర్వాత వంట ఏర్పాటు చూడబోతే

ఏమీలేవు. పాత్రలు, బియ్యం, ఉప్పు, పప్పు ఏమీలేకుండా పనెలా జరుగుతుంది?

ప్రఫుల్ల ఒకనాణెం తీసుకొనిఅంగడికిబయలుదేరింది. ఆమె చాలా ధైర్యం గలదనే విషయం - ఇంతకు ముందే చూశాం మనం.

ఈఅడవిలో అంగడి ఎక్కడుందో-వెదకాలనుకుంది. ఆమె అడవిలోకన్పించే ఒక కాలిబాటవెంటేబయలుదేరింది.

వెళ్ళగా వెళ్ళగా దట్టమైన అడవిలో ఒక బ్రాహ్మణుడు ఎదురయ్యాడు. రామనామ ముద్రలుగల దుప్పటిని కప్పుకొని వున్నాడతడు. నుదురున తిలకధారణ, గోధుమవర్ణ శరీరము, వయస్సుకూడా అంత ఎక్కువకాదు. అతడు ప్రఫుల్లను చూసి విస్మయంతో «ఎక్కడికి వెళ్తావు తల్లీ?» అని అడిగాడు.

«అంగడికి»

"ఇటేమీ దుకాణాలకు వెళ్ళేమార్గంలేదు."

"అయితే మరి ఎటువెళ్లాలి?"

"నువ్వెక్కడి నుంచి వస్తున్నావ్?"

"ఈ అడవిలోనుంచే."

"ఈ అడవిలోనే నీ నివాసమా?"

"అవును."

"ఐతేమరి నీకుబజారుకుపోయేమార్గం తెలియదా?"

"నేను క్రొత్తగా వచ్చాను."

"ఈ అడవికి తమంతటతాము ఎవరూరారు, మీరెలా వచ్చారు?"

"దయచేసినాకు బజారుకు వెళ్ళేమార్గం చెప్పండి."

"బజారుకు వెళ్ళటం ఒక పూటపని. నువ్వు ఒంటరిగా వెళ్ళలేవు. దొంగలభయం ఎక్కువ. ఇంకా నీవారు ఎవరెవరున్నారు"?

"ఎవరూ లేరు."

బ్రాహ్మణుడు కాస్సేపటివరకు ఆమె ముఖంలోకి చూస్తూ 'సలక్షణాలన్నీ మూర్తీభవించి వున్నాయీామెలో. సరే, ఏమయమేమిటో చూద్దాం!' అని ఆలోచించి "నువ్వు ఒంటరిగా బజారుకు వెళ్ళవద్దు ఆపదలోపడిపోతావు, ఇక్కడే నాదొక దుకాణంవుంది. నీకిష్టమైతే ఉప్పు పప్పు వగైరాలు కొనుక్కోవచ్చు" అని చెప్పాడు.

"మంచిదే అయితే! మీరు పండితులవలెవున్నారు" అంది ప్రఫుల్ల.

"పండితులు అనేకవిధాలుగా వుంటారు అమ్మా, నువ్వు నావెంటరా!"

ప్రఫుల్లను వెంటనిడుకొని బ్రాహ్మణుడు అడవిలోకి వెళ్లాడు. ఆమె కొంచెం భయపడింది. అయినా ఈ అడవిలో భయం లేనిదెక్కడ అనుకొంది. ఎదురుగాఒక కుటీరం కన్పించింది. కుటీరద్వారం మూసివుంది. బ్రాహ్మణుడు తాళం తెరిచి లోనికివెళ్ళాడు. చూస్తే అది దుకాణంకాదు. అయినప్పటికీ బియ్యాం, పప్పు ఉప్పు వగైరాలన్నీ సమృద్ధిగా వున్నాయక్కడ. "నువ్వెన్ని మోసుకుపోగలవో, తీసుకో!" అన్నాడు బ్రాహ్మణుడు. ప్రఫుల్ల తనకుఅవసరమైనంతవరకు వస్తువులన్నీ తీసుకొని "వెలఎంత?" అని అడిగింది.

"ఒక అణా."

"నావద్ద లేదు."

"రూపాయివుందా? ఇవ్వు. మిగిలినచిల్లరఇచ్చేస్తాను!"

"నావద్ద రూపాయికూడా లేదు."

"మరినువ్వు బజారుకు ఏమితీసుకు పోతున్నావ్?"

"ఒకనాణెం."

"చూద్దాం ఏది?"

ప్రఫుల్లనాణెమును అతనిచేతికిచ్చింది. అతడు దానిని చూసితిరిగి ఇచ్చివేశాడు. "దీనికితగినంత డబ్బునావద్దలేదు. పద, నీవెంటమీయింటికివస్తాను; అక్కడ తీసుకుంటాను" అన్నాడతడు.

"మాయింట్లోకూడా డబ్బులేదు."

"అన్నినాణేలేనా! సరేపదచూసివస్తాను. నీవద్దడబ్బు ఉన్నప్పుడే వచ్చి తీసుకుంటాను."

'అన్నినాణేలేనా!' అని అతడన్నమాట ప్రఫుల్లకు నచ్చలేదు. ఈ చతురబ్రాహ్మణుని తనవద్ద చాలానాణేలు వున్నాయని గ్రహించే ఇల్లుచూడగోరుతున్నాడని భావించిందామె. ప్రఫుల్ల ఆవస్తువులన్నింటినీ అక్కడవుంచేసి, 'నేను బజారుకే వెళ్ళాలి. దుస్తులుకూడా తెచ్చుకోవాలి" అనిఅంది.

బ్రాహ్మణుడు నవ్వాడు—"అమ్మా! ఇల్లుచూసి వచ్చి నీధనాన్నంతా దొంగలిస్తానని అనుకుంటున్నావు. బజారుకు వెళ్ళినంతమాత్రాన నన్నుతప్పించుకోగలననుకుంటున్నావా? నీవెంటే వుంటే నన్నెలా వదిలించుకోగల్గుతావ్?"

ప్రఫుల్ల కంపించింది.

'నేను నిన్ను మోసగించను నన్ను పండితుడనుకో. మరేమన్నా అనుకో. నేను దొంగల సర్దారును. నాపేరు భవానీ పాఠక్' అన్నాడు బ్రాహ్మణుడు.

ఆమాటవిని ప్రఫుల్ల మ్రాన్పడిపోయింది. భవానీ పాఠక్ పేరును ఆమె దుర్గాపురంలోకూడా విన్నది. అతడొక ప్రఖ్యాత బందిపోటు. అతని పేరుచెప్తే బరేంద్రభూమి యావత్తు భయంతో వణికిపోయేది. ప్రఫుల్ల ఏమీమాట్లాడ లేకపోయింది.

'నమ్మకంలేకపోతే చూడు' అని భవానీ లోపలనుంచి ఒకచిన్న నగారాను తెచ్చి నెమ్మదిగా మ్రోగించాడుఅది. విని క్షణంసేపట్లో ఇంచుమించు యమదూతలవంటి ౫౦మంది నల్లని యువకులు కర్రలువగైరాలతో హాజరయ్యారు.

'ఏమి ఆజ్ఞ?' అన్నారు భవానీనిచూసి.

'ఈబాలికను సరిగ్గా గుర్తుంచుకోండి ఈమెను నేను తల్లిగా భావించాను. మీరుకూడ ఈమెను తల్లిగాభావించి 'అమ్మా' అని పిలవండి. మీరు ఈమెకేమీ అపకారం కల్గించవద్దు, ఎవర్నీ కల్గించనీయవద్దు – ఇక వెళ్ళండి' అన్నాడు భవాని. ఆమాటవిన్న మరుక్షణంలో ఆదస్యులదళం మాయమైపోయింది.

ప్రఫుల్లకుచాలా విస్మయంకల్గింది. ఆమెబుద్ధి చాలా చురుకైనది. ఇతనిశరణుతప్ప తనకు వేరే ఉపాయమేది లేదని వెంటనే గ్రహించింది. రండి, మాయిల్లు చూపిస్తాను' అనిఅంది ప్రఫుల్ల.

ఆసామానంతా తీసుకొని ఆమె ముందునడపసాగింది. భవానీపాఠక్ ఆమె వెనుక రాసాగాడు. ఆ శిథిలగృహానికి చేరి ప్రఫుల్ల సామానుదించుకొని భవానీపాఠాక్‌కు ఒక చినిగిపోయిన తుంగచాప పరిచింది. ఆవైష్ణవుని వద్ద ఒక తుంగచాపకూడా వుండేది.

# 12

'ఈ శిథిలగృహంలోనా నీకు నాణాలుదొరికింది?' అని అడిగాడు భవానీపాఠాక్.

'అవునండి.'

'ఎన్ని?'

'చాలా.'

'సరిగ్గా చెప్పు ఎన్నో? నన్ను మోసగించ యత్నించావంటే మా మనుషులువచ్చి త్రవ్వి చూస్తారు.!'

'ఇరవై బిందెలు.'

'ఈ ధనంతో నువ్వేమి చేస్తావ్?'

'ఇంటికి తీసుకుపోతాను.'

'ఉంచుకొని కాపాడుకోగలవా?'

'మీ సహాయంలభిస్తే.'

'ఈఅడవిలోనాకు సంపూర్ణాధికారంవుంది. దీనిబయట నాకు అంతశక్తి లేదు. ఈఅడవిని దాటితీసుకుపోతే నేనురక్షించలేను.'

'అయితే ఈధనంతో నేనీఅడవిలోనేవుంటాను. మీరు రక్షిస్తారుగదా?'

'రక్షిస్తాను. కానీ, నువ్వింత ధనంతో ఏం చేస్తావ్'

'ప్రజలు డబ్బును ఏం చేస్తారు?'

'అనుభవిస్తారు.'

'నేనూ అనుభవిస్తాను.'

భవానీ ఠాకుర్ అట్టహాసం చేస్తూ 'అమ్మా! పసిపిల్ల వలె మాట్లాడే నీమాటలువిని నవ్వొస్తుంది. ఇంతకుముందే నువ్వు ఎవరూ లేరు అని అన్నావు. ఎవరితో కలిసి ఈధనాన్ని అనుభవిస్తావు. ఒక్కరే ఎక్కడైనా ఐశ్వర్యాన్ని అనుభవిస్తారా!' అన్నాడు.

ప్రఫుల్ల నిశ్చేష్టురాలై చూస్తూ తలవంచేసుకుంది.

'అమ్మా! విను. కొందరు కొందరు ఐశ్వర్యం లభించేసరికి అనుభవిస్తారు, కొందరు పుణ్యకార్యాలు చేస్తారు, కొందరు నరకానికి దారులేసుకుంటూరు. నువ్వు అనుభవించలేవు, నీకెవ్వరూ లేకపోవటమే ఇందుకు కారణం. నువ్వు పుణ్యకార్యాలైనా చేయాలి; లేదా నరకానికి మార్గం నిర్మించుకోవాలి. చెప్పు, నీ కేమార్గం ఇష్టమో?'

ప్రఫుల్ల చాలా సాహసంగలది. 'ఈమాటలుదొంగల సర్దారు మాటలవలె లేవే!' అనిఅంది.

'కాదు. నేను కేవలం దొంగల సర్దారునేకాదు; నీ ఎదుట అసలుకూడా కాదు. నేను నిన్ను 'అమ్మా' అన్నాను, కనుక ఇప్పుడు నీకు దేనివల్లలాభం కలుగుతుందో అదే చెప్తాను. ధనాన్ని నువ్వు అనుభవించలేవు, నీకెవరూలేరు. కనుక నువ్వు ధనంతో ఘోరమైన పాపాన్నిగానీ, అత్యధిక పుణ్యాన్నిగానీ ఆర్జించుకోగలవు. ఏం చేయదలచావో చెప్పు.'

'పాపమే చేయగలచానని అంటే?'

'అప్పుడు నామనుషులద్వారా నీవెంట ధనాన్నంతా ఈఅడవి బైటకు పంపేస్తాను. ఈఅడవిలో నాఅనుచరులనేక మంది ధనాశతో నీతోకలసి పాపానికిసిద్ధపడతారు. కనుక నువ్వుకో రేదదేఅయితే ఈక్షణమందే నిన్నుపంపివేయటానికి యత్నిస్తాను. ఈధనాన్ని నేను నాదిగానే భావిస్తున్నాను.'

'నావెంట కూరు నాధనాన్నంతా పంపివేస్తే నాకు నష్టంవేమిటి?'

'దాచుకోగలవా? నువ్వుయువతివి. దొంగలబారి నుంచైతేతప్పించుకో గలవుకాని యవ్వన సౌందర్యాలనుంచి తప్పించుకో లేవుగదా! పాపలాలస పూర్తవకముందే ధనం అయిపోతుంది. ఎంతధనమైనావుండుగాక, అయిపోటాని కెంతో కాలంపట్టదు. ఆతర్వాత?'

'ఆతర్వాత ఏమవుతుంది?'

'నరకమార్గం ఏర్పడుతుంది సరాసరి. తృష్ణతీరదు, కానీతృప్తి! మరోఉపాయమూవుండదు - అదే నరకమార్గం అంటే. పుణ్యాన్ని ఆర్జించుకుంటావా?'

'బాబూ! నేను సంసార స్త్రీని. పాపమంటే ఏమిటో ఎరుగను, పాపం ఎందుకు చేస్తాను! నేనుదరిద్రురాలను, తిండి గుడ్డలు తప్ప నాకేమీ అవసరం లేదు. నాకు ధనం అవసరం లేదు. ఏదో విధంగా జీవితం గడిచిపోతే అంతేచాలు. ఈ ధనమంతా నువ్వే తీసుకో, నాకు మాత్రం పట్టెడన్నం పెట్టే ఏర్పాటు చెయ్యి.'

భవానీ లోలోపలే ప్రఫుల్లకు ధన్యవాదాలర్పించాడు. 'ధనంనీదే, నేను తీసుకోను' అన్నాడు ప్రత్యక్షంగా.

ప్రఫుల్లకు విస్మయం కల్గింది. అది గ్రహించి భవానీ ఠాకూర్ 'చేసేదేమో దోపిడీలు, దొంగతనాలు, నాముందు ఈ కపట ప్రవర్తన ఎందుకో అని ఆలోచిస్తున్నావుగదూ? సరే, దానికి కారణం ఇప్పుడే నీతో చెప్పాల్సిన అవసరం లేదు. ఒక విషయం, నువ్వు పాపాలనాచరిస్తే మాత్రం నేనే దోచుకోవచ్చు ఈధనాన్ని. ఈ ధనంతో నువ్వేమి చేయ దలచుకున్నావని మరొక పర్యాయం అడుగుతున్నాను.'

'మీరు చాలా జ్ఞానులు. నన్నేమి చేయమంటారో మీరే ఉపదేశించండి.'

'ఉపదేశించటానికి ఏడెనిమిది సంవత్సరాల్లో నువ్వా ధనాన్ని తాకనైనాకూడదు. నీకు తిండి గుడ్డలకు ఏమీ లోటుండదు. నీ అవసరాలన్నింటినీ నేను తీరుస్తాను. అంగీ కారమేనా?'

'వుండేదెక్కడ?'

'ఇక్కడే, ఈ పాడుపడిన దానిని కొద్దిగా మరమ్మత్తు చేస్తాను.'

'ఇక్కడ ఒంటరిగా ఉండాలా?'

'లేదు, నేను మరిద్దర్ని స్త్రీలను పంపుతాను. వారు నీదగ్గరవుంటారు. భయపడవద్దు, ఆడవికి యజమానినినేనే. నేను ఉండగా నీకే అపకారమూ జరుగదు.'

'మీవిద్య ఎలా వుంటుంది?'

'నీకు చదువులో ప్రవేశంవుందా?'

'లేదు.'

'ముందు చదవటం వ్రాయటం నేర్పుతాను.'

ప్రఫుల్ల సమ్మతించింది. ఈ అడవిలో ఒక సహాయకుడు లభించినందుకు చాలా సంతోషించింది.

అక్కడినుంచి శలవు తీసుకొని భవానీఠాకుర్ బయటకువచ్చి చూసేసరికి ఒకవ్యక్తి అతనికోసం ఎదురు చూస్తున్నాడక్కడ. అతనిశరీరం చాలా బలిష్టమైనది. పెద్దపెద్ద మీసాలున్నాయతనికి. 'రంగ్‌రాజ్, ఇక్కడికి వచ్చావెందుకు?' అని అడిగాడు భవానీ.

'మిమ్మల్ని వెదుకుతూ. మీరిక్కడికెలావచ్చారు?' అన్నాడు రంగ్‌రాజ్.

'ఇంతకాలంనుంచి వెదికేది ఇవాళ లభించింది.'

'రాజా?'

'రాణి.'

'రాజు-రాణీలను వెదికాల్సిన అవసరంలేదిక. ఆంగ్లేయులు రాజులవుతున్నారు. కలకత్తాలో ఎవరోవాస్టిన్ వారెన్ హేస్టింగ్స (Warren Hastings) దొర తన రాజ్యాన్ని స్థాపిస్తూవున్నాడట.'

'నేనుఅటువంటి రాజును వెదకటంలేదు, నేను వెదికేదెటువంటి వాడినో నీకూ తెలుసు'

'పొందారా?'

'అది పొందతగినవస్తువుకాదు. స్వయంగా తయారు చేసుకోవాల్సివుంటుంది. ఈశ్వరుడు ఇనుమును సృష్టిస్తాడు. మానవుడు ఖడ్గాన్ని తయారు చేసుకుంటాడు. మంచిఉక్కు

ముక్కోలభించింది. ఏడెనిమిది సంవత్సరాలు నిర్మించాలిక. చూడు, ఈకొంట్లోకి నేనుతప్ప మరెవరూ వెళ్ళకుండావుండాలి, యువతి చాలా అందమైనది.'

'చిత్రం! జాగీరుదారు మనుషులు రంజనపురాన్ని దోచుకున్నారు, అందుకే మిమ్మల్ని వెదుకుతూవచ్చాను.'

'అయితేపద! మనం జాగీరుదారు ఖజానాను దోచి గ్రామవాసులకు తిరిగి ఇచ్చేద్దాం. గ్రామస్తులు సహాయ పడ్తారా?'

'సహాయ పడవచ్చు.'

## 13

భవానీఠాకూర్ తాను చెప్పినప్రకారంఇద్దరు స్త్రీలను పంపాడు. బజారుపనులు చూడటానికి ఒకరు, ఒకరుఎప్పుడూ ప్రఫుల్లవద్ద వుండటానికి. ఇద్దరూ రెండురకాలమనుషులు. బయట పనులన్నీచూసేస్త్రీపేరు గోబరాతల్లి. ఆమెవయస్సు 73 సంవత్సరాలు. ఆమె చాలా నల్లగావుంటుంది, చెవిటిది కూడాను. పూర్తిగా చెవిటిదా అంటే అదేమీకాదు. ఒక్కో క్కప్పుడు కొన్నిమాటలు విన్పించేవి, కొన్నివిన్పించేవి కావు. దీనివల్ల చాలా గడబిడ, తికమకగా వుండేది.

రెండవ స్త్రీఅందుకు పూర్తిగా భిన్నమైనది, వయస్సులో ప్రఫుల్లకంటే అయిదారేండ్లు పెద్ద, కాంతివంతమైన శ్యామవర్ణ శరీరం, తోణికిసలాడే అందము.

అమావాస్య పౌర్ణమిలు కలిసివచ్చినట్లుగా ఇద్దరూ ఒకేసారి వచ్చారు. గోబరాతల్లి ప్రఫుల్లకు నమస్కరించింది.

"నీ పేరేమిటి?" అని అడిగింది ప్రఫుల్ల.

గోబరాతల్లి కిది విన్పించలేదు. రెండో స్త్రీ "ఆమెకు కొంచెం చెవుడు. అందరూ గోబరాతల్లి అనే పిలుస్తారు" అంది.

"గోబరాతల్లీ! నీకు కుమారు లెందరు?" అని అడిగింది ప్రఫుల్ల.

"నేను గయ్యాళినికాదు. అందరూ అనవసరంగా నన్ను గయ్యాళి అంటారు."

"ఏ కులం మీది?"

"ఎక్కడికైనా వెళ్ళగలను, మీరు చెప్పిన చోటుకే వెళ్తాను."

"నే నడిగేది మీరెవరూ అని"అంది ప్రఫుల్ల గట్టిగా.

"ఎవరో ఎందుకమ్మా! పనులన్నీ నేనే చేస్తాను. ఒకటి రెండు పనులు చేయలేనంతే."

"ఏయే పనులు చేయలేవు?"

ఇప్పుడిక గోబరాతల్లికి కొంచెం వినిపించసాగింది — "అదే, నీళ్ళు తేవటం చేయలేను. వంట్లో ఇప్పుడంత బలం లేదు. మరి గుడ్డలువుంటే మీరే ఉతుక్కోవాలి"అని అంది.

"మిగిలిన పనులన్నీ చేయగలవా?"

"కాదు; పాత్రలు మీరే కడుక్కోవాలి."

"అదికూడా చేయలేకపోతే యిక నువ్వు చేయగల్గిం దేమిటి?"

"ఇంకేమీ లేదు. ఇల్లుకడగటం, ఊడ్చటం కూడా కొంచెం మీరే చూసుకోవాలి."

«అయితే నువ్వు చేసేదేమిటి?»

«ఇంకా యేదిచెప్పినా చేస్తాను. చేదత్రాడు చుట్టి లోపల దాస్తాను. నీళ్ళు దొర్లించేయగలను; నా విస్తరిని నేను పారవేసుకోగలను. అసలైన పనులన్నీ చేస్తాను - బజారుపని చూస్తాను.”

“సామానులుకొని లెక్కచూడగలవా?”

“వృద్ధురాలినై పోయాను. ఇప్పుడవన్నీ నావల్లకావు. అయినా మీరెంతడబ్బు ఇచ్చినా ఖర్చుచేసుకురాగలను. అది ఖర్చుచేయలేదు, యిది ఖర్చుచేయలేదు అని మీరనాల్సిన పనిలేదు” అంది గోబరాతల్లి.

“నీవంటి బుద్ధిమంతులు త్వరగా లభించరు.”

“ఏదో అదంతా మీదయ తల్లీ! ప్రేమకొద్దీ అలా అంటున్నారు.”

“నీ పేరేమిటి!” అని అడిగింది ప్రఫుల్ల రెండోస్త్రీని.

“అదేమో తెలియదు చెల్లీ!”

«ఏం, ఎందుకని, తల్లిదండ్రులు పేరేపెట్టలేదా?»

«పెట్టేవుంటారు కానీ నాకు తెలియదు» అంది ఆ సుందరి.

అలా ఎందుకని?»

“ప్రపంచజ్ఞానం తెలిసీ తెలియకముందే తల్లిదండ్రుల నుంచి వేరైపోయాను. చిన్నతనంలోనే నన్ను పిల్లల్ని ఎత్తుకుపోయే దొంగలు ఎత్తుకుపోయారు.»

«అయితే వారైనా ఏదోఒక పేరుపెట్టేవుందురుగా!» అడిగింది ప్రఫుల్ల.

"పెట్టటానికేం, చాలా పేర్లు పెట్టారు."

"ఏమిటవి?"

"రాకాసీ, పాడుముఖమూ, దరిద్రగొట్టు"

ఇంతవరకు గోబరాతల్లికి మాటలు సరిగ్గా విన్పించ లేదు. ఈ విశేషణాలు వినేసరికి శ్రవణశక్తి హెచ్చింది - "నన్ను రాకాసి అన్నవాళ్ళే రాకాసులు, నన్ను పాడు ముఖం అన్నవాళ్ళవే పాడుముఖాలు. నన్ను గొడ్రాలు అన్నవారే గొడ్రాళ్ళు-" అంటూ సాధించసాగింది.

సుందరి నవ్వి 'నేను నిన్ను గొడ్రాలనలేదు' అంది అంది.

"ఎందుకనవు, అనేవుంటావు తప్పకుండా. నన్నెందుకు తిడుతున్నావో చెప్పుముందు" అంది గోబరాతల్లి.

ప్రఫుల్ల నవ్వుతూ 'ఆమె నిన్ననలేదు. నన్ను అంటోంది' అని అంది.

"నన్ను అనలేదా? అందిలే తల్లీ కోపగించకు. ఆ బ్రాహ్మణస్త్రీ నోరుమంచిదికాదు. అయినా కోపం ఎందుకులే అమ్మా!" అని అంది.

గోబరాతల్లి తననుగురించైతే వీరరసము, ఇతరుల విషయంలో శాంతరస ప్రదర్శనచూసి ఆ యువతులిద్దరూ నవ్వేశారు. అప్పుడు ప్రఫుల్ల ఆ రెండవస్త్రీతో 'బ్రాహ్మణ స్త్రీవా? ఇంతసేపటినుంచి ఎందుకు చెప్పలేదు' అని ఆమెకు నమస్కరించింది.

ఆమె ప్రఫుల్లను ఆశీర్వదించి 'నేను బ్రాహ్మణకన్య ననే విన్నాను, కానీ వివాహితను కాదు' అంది.

"ఎందుకని?"

"బ్రాహ్మణుడు లభించలేదు!"

"పిల్లల్ని ఎత్తుకుపోయేవాళ్ళు వివాహాలుకూడా చేస్తారా?"

"నువ్వెప్పుడూ వారితోనే ఉన్నావా?"

"లేదు, వారు నన్నొక రాజుకు అమ్మివేశారు."

"ఆ రాజుగారు వివాహమాడలేదా?"

"రాజుకొడుకు వివాహమాడ దలచాడు-అదీ గాంధర్వవిధిగా."

"మిమ్మల్నేనా?"

"ఎన్నిరోజులు ఉండేవాడో ఏమో అది తెలియదు."

"తర్వాత?"

"అది తెలిసి నేను పారిపోయి వచ్చాను."

"తర్వాత?"

"రాణీగారు కొన్ని ఆభరణాలనిచ్చింది. ఆ నగలతో సహా పారిపోయి రావటంవలన మళ్ళీ దొంగల చేతుల్లో పడ్డాను. ఆ దొంగలకు భవానీ ఠాకూరు సర్దారు. వారు నా గాథనంతావిని నానగలు తీసుకోలేదు, మరికొన్ని నగల నిచ్చారు. వారే నాకు ఆశ్రయమిచ్చారు. నేను వారి కుమారైను. వారునాకుతండ్రి. వారు ఒకవిధంగా నాకు వివాహం చేసివేశారు."

"ఒకవిధంగా అంటే అదెలా?"

"నా సర్వస్వము ఆ శ్రీకృష్ణుడే."

"అదేమిటి?"

"నా అందము, యవ్వనము, ప్రాణము అన్నీ ఆ శ్రీకృష్ణుడే!"

"అతడు నీకు భర్తా!"

"అవును. నాపై సంపూర్ణాధికారముందిగనుక అతడే నా భర్త."

ప్రఫుల్ల దీర్ఘంగా నిట్టూర్చి 'ఏం చెప్పను. నువ్వెప్పుడూ భర్తను చూడలేదు. అందుకే ఇలా అంటున్నావు. భర్తనుగనుక చూసివుంటే శ్రీ కృష్ణునిపై చిత్తం నిలువదు అంది. మూర్ఖ వ్రజేశ్వరుడు ఆ మాత్రం ఎరుగడు

శ్రీకృష్ణునియందు బాలికలందరి చిత్తమూ లీనంకావచ్చు. వారి రూపగుణ యవ్వనాలు, ఐశ్వర్యభోగాలు అనంతమైనవి' అంది సుందరి.

ఈయువతి భవానీఠాకూరు శిష్యురాలు. కానిచదువు రాదు. ప్రఫుల్లకు, ఈమాటకు జవాబేమీ చెప్పలేదు. హిందూమత ప్రణేతలకే దీనికి సమాధానం తెలుసు. ఈశ్వరుడు అనంతమనేది యదార్థమే. కాని చిన్న హృదయంలో అనంతమును నింపలేరు. అంతమున్నదానిని మాత్రమే నిలుపుకోగలం. అందుకనే అనంతమైన జగదీశ్వరుడు హిందువుల హృదయాల్లో అంతమునేదిగల శ్రీకృష్ణుని రూపంలో నివాసం చేస్తున్నాడు. భర్త మరింతగా అంతమునేదిగలవాడు. అందుకనే ప్రేమ పవిత్రమైనదైతే భర్త ఈశ్వర ప్రాప్తికి మొదటిమెట్టు అవుతాడు కాబట్టి హిందూ స్త్రీలకు భర్త దైవసమానుడు. ఈ అర్థంలో ఇతరసంఘము లన్నియు హిందువులకంటే నికృష్టములు.

అజ్ఞానురాలయిన ప్రఫుల్లకు ఏమీ అర్థం కాలేదు. 'సోదరీ! ఇదేమీ నాకు అర్థంకాలేదు. ఇంతకూ నువ్వు పేరు చెప్పనేలేదు' అని అంది.

"భవానీఠాకూరు చేసిన నామకరణం నిశి అని. నేను దివ (పగలు) సోదరి నిశిని. దివాను ఒకరోజున తీసుకువస్తాను మాట్లాడటానికి. కాని ఆమె చెప్పేదిమాత్రం విను. స్త్రీకి దైవం భర్త. శ్రీకృష్ణుడు అందరికీ దైవం. ఇద్దరు దేవతలెందుకు ఉండాలి? ఇద్దరు ఈశ్వరులా? ఈ అల్ప ప్రాణియొక్క అల్పభక్తిని రెండు భాగాలుగా విభజించినచో ఎంతెంత ఉంటుంది?"

"స్త్రీల భక్తికి అంతమంటూ వుందా - ఏం?"

"స్త్రీల ప్రేమకు అంతంలేదు. భక్తి అనేది వేరు, ప్రేమ వేరు."

"నాకు రెండూ క్రొత్తవే. నేను యింతవరకుకూడా తెలుసుకోలేకపోయాను" అంది ప్రఫుల్ల.

ప్రఫుల్ల కంటనీరెట్టింది. 'చెల్లీ! నువ్వుచాలా దుఃఖాలనుభవించా వనుకుంటాను" అంది నిశి.

నిశి ఆమెను కౌగిటజేర్చుకొని కన్నీటిని తుడుస్తూ 'ఈ మాత్రం తెలియదూ?' అంది. ఈశ్వర భక్తికి మొదటి మెట్టు పతిభక్తి అని నిశి అప్పుడు గ్రహించింది.

## 14

దుర్లభ చక్రవర్తి ప్రఫుల్లను ఎత్తుకొనిపోయిన నాటి రాత్రి వ్రజేశ్వరుడు తలవని తలంపుగా ప్రఫుల్ల ఇంటికి వచ్చాడు. వ్రజేశ్వరునికి ఒక గుర్రం వుండేది. పరుగులో

అది చాలా చురుకైనది. ఇంట్లో అందరూ నిద్రపోగానే అతడు మెదలకుండా గుర్రాన్ని తీసుకొని దుర్గాపురానికి బయలుదేరాడు. ప్రఫుల్లవుండే ఇంటికిచేరి చూచుసరికి ఎవరూ కన్పించలేదు. ఒంటరిగా వుండలేక ఏబంధువు లింటికైనా వెళ్ళివుంటుందని యోచించాడతడు. ఎదురుచూడ లేదిక. తండ్రి భయంవల్ల తెల్లవారకముందే ఇంటికి తిరిగి వచ్చాడు.

రోజులు గడిచిపోతున్నాయి. హారవల్లభుని సంసారం ఎప్పటివలెనే సాగిపోతోంది. అందరూ యింత తిని తమతమ పనులుచేస్తున్నారు. ఒక్క వ్రజేశ్వరునికి మాత్రం సుఖంగా కాలం గడవటంలేదు. మొదట ఎవరికీ ఏమీ తెలియలేదు. నెమ్మదిమీద ముందు తల్లి గ్రహించింది. వ్రజేశ్వరుని పళ్లెం లోవడ్డించే చేపకూర వడ్డించినట్లే వుండిపోతోంది. గిన్నెలో పాలు గిన్నెలోనే వుంటున్నాయి. 'అంత రుచిగాలేవు' అంటూ ఏదో కొంచెం ఎంగిలిపడి వ్రజేశ్వరుడు లేచిపోయే వాడు. అబ్బాయికి ఆకలి మందగించిందని భావించింది తల్లి. మంత్రాలవలన, దిష్టితీయటంవలన ప్రయోజనమేమీ కన్పించ లేదు. అప్పుడిక వైద్యుణ్ణి పిలిపించాలని పట్టుబట్టింది తల్లి. వ్రజేశ్వరుడు నవ్వి తిరస్కరించేశాడు. తల్లి యెదుట నవ్వి తప్పించుకోగలిగాడు. కాని వృద్ధఠాకురానీఎదుట తప్పించు కోలేకపోయాడు. ఒకనాడు ఒంటరిపాటుగా చూసి వృద్ధు రాలు నిగ్గదీసి 'ఏంరా వ్రజా! నువ్వు నయనతార ముఖ మైనా చూడటంలేదు. ఎందుకనేమిటి?' అని అడిగేసింది.

వ్రజేశ్వరుడు నవ్వి 'అసలే ఆమెముఖం అమావాస్య

రాత్రివలె వుంటుంది, పైగా అందులో తుపాను - మేఘాలు కూడా నిండి ఉంటున్నాయి-చూడాలని బుద్ధిపుట్టటంలేదు' అన్నాడు.

"సరే, అదేమిటో నయనతారకే తెలియాలి. ఇంతకూ మరినువ్వు తిండికూడా తినటంలేదెందుకని?"

"నువ్వు వండుతున్నావుగదూ!"

"నే నెప్పుడూ ఇలాగే వండుతున్నాను."

"ఇప్పుడింకా చేతులు రాటుదేలిపోయాయి."

"సరే పాలుకూడా నేనే తయారుచేస్తున్నానా? అది కూడా వంటచేసేవారి దోషమేనా?"

"ఆవులపాలు చెడిపోయాయి."

"రోజంతా ఆలోచిస్తూ వుంటావేమిటి నువ్వు?"

"నిన్ను గంగాస్నానం ఎప్పుడు చేయించాలా అని."

"పిచ్చిగా మాట్లాడకు. ఇలా అనేవాళ్ళను చాలా మందిని చూశాను. ఆరోజువస్తే వేపచెట్టుక్రిందే చేసేస్తారన్నీ. తులసితీర్థమైనా పోయరెవరూ. సరే, నా గంగాస్నానాన్నిగురించి ఆలోచిస్తూనే ఇంత చిక్కిపోయావా?"

"అదేమంత తక్కువ విషయమా ఏమిటి?"

"నిన్న స్నానంచేయగానే నువ్వు వండిన పదార్థాలు తినాల్సివస్తుందిగదా అని ఆలోచించి ఏడ్చాను."

"వంట చేయటానికి సాగరకోడల్ని పిలిపించమంటావా?"

"ఎందుకూ? సాగర్ రోజూ వండేదిగా, దుమ్ము ధూళి కూర! బురదపాయసం! నువ్వే తినిచూడు ఒకనాడు?"

'ప్రఫుల్లను పిలిపించమంటావా పోనీ?'

దారివెంట ఎవరైనా దీపంతీసుకొని వెళ్తూవుంటే చీకట్లోవున్న ఇల్లు ఆ వెలుగులో నవ్వి వెంటనే అంధకారంలో మునిగిపోయినట్లయింది, ప్రఫుల్ల మాటవినేసరికి వ్రజేశ్వరుని ముఖం. 'ప్రఫుల్ల శూద్రస్త్రీగా?' అన్నాడు.

'శూద్రురాలుకాదు. అది అబద్ధమని అందరికీ తెలుసు. మీనాన్న సంఘానికి భయపడుతున్నాడు. కొడుకు కంటే ఎక్కువా యేం సంఘం. నన్ను మాట్లాడమంటావా?'

'వద్దు. నన్నుగురించి నాన్నకు సంఘంలో అపకీర్తి వస్తే అదెలా?'

ఆరోజున అంతకుమించి సంభాషణ జరగలేదు. వృద్ధురాలుకూడా ఎక్కువగా గ్రహించలేకపోయింది. అంత సూటియైన విషయంకూడాకాదు తెలియటానికి. ప్రఫుల్ల అత్యంత సౌందర్యవతి. సౌదర్యంవల్లనే ఆమె వ్రజేశ్వరుని హృదయంలో నిలిచిపోయిందొకటి; రెండోది - ప్రఫుల్ల వెలుపలి సౌదర్యంకంటే ఎక్కువ హృదయ సౌదర్యంకలది, మాధుర్యం గలది అని అతడారాత్రి ఆమెనుచూసి గ్రహించాడు. ప్రఫుల్ల వివాహితస్త్రీ! అధికారం ప్రకారం వచ్చి నయనతారవలె తన వద్దవుంటే ఈ ఉన్మత్తప్రేమ స్నిగ్ధప్రేమగా మారిపోయేది. రూపమోహపుతెర తొలగిపోయి, గుణముయుండే మోహముండేది. కానీ ఆవిధంగా జరుగలేదు. ప్రఫుల్ల మెరుపువలె ఒకసారి తళుక్కుమని అంధకారంలోదాగింది, శాశ్వతంగా. అందువల్ల ఆమోహం సహస్రాధిక మయింది. అంతవరకు విషయం సూటిగానేవుంది, ఆపైన వుందికరుణ.

ఆ బంగారు బొమ్మను, ఆమె అధికారాన్ని హరించివేసి, అవమానించి, మిథ్యా కళంకాన్నాపాదించి, శాశ్వతంగా బహిష్కరించాల్సివచ్చింది. ఇప్పుడామెకు పట్టెడన్నంకూడా లేదు. ఆకలితో చనిపోయినా చనిపోవచ్చు. ఆ అగాధ అనురాగానికి ఈ దారుణమైన కరుణ. వ్రజేశ్వరుని హృదయం ప్రఫుల్లమయం, అందులో మరెవ్వరికీ చోటులేదిక. వృద్ధురాలికి ఈమాత్రం కూడా అర్థంకాలేదు.

కొద్దిరోజుల్లో మంగలిపూలమణి ప్రచారంచేసిన ప్రఫుల్ల మరణవార్త హరవల్లభునివరకు చేరింది. విషయం ఎందరినోళ్ళగుండా ప్రయాణంచేసి వచ్చిందో అంతగా రూపాంతరం చెందింది. ప్రఫుల్లవాయు-శ్లేష్మ ప్రకోపంలో చనిపోయిందనీ, చనిపోవుముందు తను, చనిపోయినతల్లిని చూసిందనీ ఇక్కడకు చేరిన సమచారం వ్రజేశ్వరునికికూడా తెలిసింది.

హరవల్లభుడు మైలస్నానం చేశాడుకాని దినవారాలు జరిపించటానికిమాత్రం 'శూద్రులకు బ్రాహ్మణులు దినవారాలుచేయటం ఏమిటి?' అనితిరస్కరించాడు. నయనతార కూడా స్నానంచేసింది. తల తుడుచుకుంటూ 'ఒకపాపంతీరి పోయింది, మరొకదానికోసంకూడా ఈస్నానం చేయగలిగితే మనస్సు తేలికవుతుంది' అని అనుకుంది.

మరి కొద్దిరోజులుగడిచాయి. క్రమంగా వ్రజేశ్వరుడు మంచం ఎక్కాడు. రోగం అంతతీవ్రంగా లేదు, కొద్దిగాజ్వరం వస్తూవుండేది, అంతే. వైద్యుడుచూశాడు, ఔషధంవల్ల ఫలితం కన్పించలేదు. రోగం ఉన్నకొద్దీ హెచ్చుతూవుంది. రానురాను ప్రాణాలమీదికొచ్చింది.

అసలు రహస్యం ఇకదాగలేదు. ముందు వృద్ధురాలు గ్రహించింది, తర్వాత వ్రజేశ్వరుని తల్లికి అర్థమయింది. ఇవన్నీ స్త్రీలకే అర్థమవుతాయి. తల్లికి తెలియగానే తండ్రికి కూడా తెలిసింది. అప్పుడు హారవల్లభునికి గుండెల్లో గునపంలాగుచ్చుకుంది. అప్పుడతనువిలపిస్తూ 'ఛీఛీ, ఛీ! ఎంత తెలివి తక్కువపనిచేశాను! నా వ్రేలితో నాకన్నే పొడుచుకున్నాను' అనుకున్నాడు.

'అబ్బాయి జీవించకపోతే నేను ఏ విషమో తినేస్తాను' అని ప్రతిన చేసింది వ్రజేశ్వరుని తల్లి.

'పరమేశ్వరా! ఈసారికి వ్రజేశ్వరుణ్ణి కాపాడు! అతని కోర్కెకు విరుద్ధంగా నేనిక ఎన్నడూ ఏమీ చేయను' అని ప్రతిజ్ఞ చేశాడు హారవల్లభుడు.

వ్రజేశ్వరుడు జీవించాడు. క్రమంగా రోగం తగ్గిపోయింది. ఒకనాడు హారవల్లభుడు తనతండ్రి సాంవత్సరీకాన్ని జరిపాడు. అప్పుడు వ్రజేశ్వరుడు కూడా అక్కడే వున్నాడు. చివరకు పురోహితుడు చదివిన మంత్రాన్ని అతడువిన్నాడు —

"పితాస్వర్గః పితాధర్మః పితాహి పరమం తపః।
పితరి ప్రీతిమాపన్నే ప్రియంతే సర్వదేవతాః"

మంత్రాన్ని వ్రజేశ్వరుడు కంఠస్థం చేశాడు. ప్రఫుల్ల మదిలో మెదిలి దుఃఖం ముంచుకొచ్చినప్పుడు మనోనిగ్రహం కోసం ఈమంత్రాన్ని చదివేవాడు—

'పితాస్వర్గః పితాధర్మః—'

ఈవిధంగా వ్రజేశ్వరుడు ప్రఫుల్లను మర్చిపోవయత్నించసాగాడు. ప్రఫుల్లమరణానికి తనతండ్రే కారకుడు అనిగుర్తు

రాగానే 'పితాస్వర్గః పితాధర్మః-' అని శ్లోకం చదువు కునేవాడు.

ప్రఫుల్ల వెళ్ళిపోయింది, అయినా ప్రజేశ్వరునికి తండ్రి యందున్నభక్తి స్థిరంగావుండిపోయింది.

## 15

ప్రఫుల్ల చదువు ఆరంభమయింది. నిశిరాజాగారింటివద్ద, భవానిఠాకుర్ వద్దనూ చదవనూ వ్రాయనూ నేర్చుకొంది. అక్షరాలు, అంకెలు ప్రఫుల్లఆమెవద్దనేనేర్చుకొంది. ఆతర్వాత తామరే గురుత్వం వహించాడు. మొదట వ్యాకరణం ప్రారంభింపచేశాడు. నాలుగైదురోజులు పాఠాలుచెప్పగానే ఉపాధ్యాయులవారికి చాలావిస్మయంకల్గింది. ప్రఫుల్ల బుద్ధి చాలా చురుకైనది. నేర్చుకోవాలనే కోర్కెచాలా ప్రబలంగావుంది. ఆమె చాలా త్వరత్వరగానేర్చుకోసాగింది. ఆమె పరిశ్రమను చూసి నిశికికూడా విస్మయంకల్గింది. నిద్రాహారాలు నామమాత్రమైపోయా యామెకు. రాత్రింబవళ్లు వ్యాకరణంలోనే వుండేదిదృష్టి. ప్రఫుల్లఆరెండుక్రొత్తపరిచితుల్ని(భక్తి, ప్రేమ) మర్చిపోయేందుకే మనస్సునంతా చదువులో కేంద్రీకరించిందని నిశిగ్రహించింది. కొద్దిమాసాల్లో వ్యాకరణంముగిసింది. తదుపరి ప్రఫుల్ల కావ్యాలను నీటిని ఈదినట్లు దాటిపోయింది. అంతేగాక వాటిపై ఆమెకు అధికారంకూడాఏర్పడింది. రఘువంశము, కుమారసంభవము, నైషధము, శకుంతల మొదలగు వాటినామె చాలా తేలికగాపూర్తిచేసింది. వీటన్నింటితోనూ భూమికను తయారుచేసి అతడు ఆమెకు యోగశాస్త్రాన్ని సవి

స్తరంగా అధ్యయనం చేయించాడు. అయిదుసంవత్సరాల్లో శిక్షణపూర్తయింది.

ఈ విద్యతోపాటే ఇతర విద్యల్లోకూడా శిక్షణ నిచ్చాడు. గోబరాతల్లి బజారునుంచి తెచ్చేవాలు తేవటంతప్ప మరేపనీ చేసేదికాదు. నిశికూడాఎక్కువగా సహాయపడేదికాదు. అందువల్ల అన్నిపనులు ప్రఫుల్ల స్వయంగానే చేసుకొనేది. ఇందుకు ఆమె కేమాత్రం కష్టమనిపించలేదు. తల్లిగారింట్లో కూడా పన్నులన్నీ ప్రఫుల్ల స్వయంగా చేస్తూవుండేది. మొదటి సంవత్సరం భవానీటాకుర్ ఆమెకు ముతకబియ్యము, ఉప్పు, నెయ్యి, పచ్చి అరటికాయలు ఇచ్చేవాడు. మరేమీవుండేవి కావు. నిశికూడా అదేతినేది. ప్రఫుల్లకు అదీకష్టంగాలేదు. తల్లిఇంట్లో ఆమాత్రంకూడా వుండేదికాదు. ఒకవిషయంలో మాత్రం ప్రఫుల్ల భవానీఠాకుర్ మాటను ఎంతమాత్రం లక్ష్యం చేసేదికాదు. ఏకాదశిరోజున ఆమె చేపకూరను మాత్రం తప్పకుండా తినేది. బెంగాలులో పునిస్త్రీలు ఏకాదశిరోజున చేపల్ని తినటం ఆచారంగా భావిస్తారు. గోబరాతల్లి ఒకవేళ బజారునుంచి చేపల్ని తేకపోతే తానేస్వయంగా ఏ చెరువులోనో, గుంటలలోనో పట్టుకుతెచ్చేది అందుకని ఇప్పుడిక గోబరాతల్లే బజారునుంచి ఏకాదశిరోజున చేపలు తెస్తూ వుండేది.

రెండోసంవత్సరం నిశి ఆహారం అలాగేవుంది. ప్రఫుల్లకుమాత్రం ఉప్పు, కారం, అన్నం ఏకాదశిరోజున చేపలు లభించేవి. అందుకు ప్రఫుల్ల అభ్యంతరం చెప్పలేదు.

మూడో సంవత్సరం నిశికి మిఠాయి, వెన్న, నెయ్యి పండ్లు మొదలగునవి ఇష్టంవచ్చినన్ని తినవచ్చునని చెప్పారు. ప్రఫుల్లకుమాత్రం ఆడుప్పు, కారం, అన్నంమాత్రమే లభించేవి. ఇద్దరూ ఒకచోటనే కూర్చునితినాలి. భోజనసమయాలందు ఇద్దరూజతగాకూర్చుని నవ్వుకొనేవారు. నిశి మిఠాయి అంతఎక్కువ తినేదికాదు. గోబరాతల్లికి ఇచ్చివేసేది. ఈ పరీక్షలోకూడా ప్రఫుల్లనెగ్గింది.

నాల్గవసంవత్సరం ఆమెశరీరానికి అవసరమైన ఆహారం తీసుకోవచ్చునని అనుమతిలభించింది. అలాగే చేసిందామె.

ఐదో సంవత్సరం తనకుయిష్టమైనవి తినవచ్చునని ఆదేశించారు. ప్రఫుల్ల మొదటిసంవత్సపు ఆహారాన్నిఎన్నుకొంది.

శయనము, దుస్తులు, నిద్రలోకూడా ఈవిధంగానే వివిధఆదేశాలిచ్చాడు భవానీఠాకూర్. ధరించటానికి మొదట నాలుచీరలుండేవి. రెండో సంవత్సరంరెండు. మూడో సంవత్సరం వేసవికాలమందుబాగామురికి చీరొకటి, చలికాలంలో సన్నవిచీరొకటి, వంటిమీాదేఆరాలి. నాల్గోసంవత్సరంఢకా, శాంతిపూర్ చీరెలు లభించాయి. అయిదో సంవత్సరం ఇష్టమైనవి ఏవైనాసరే! ప్రఫుల్ల మురికిచీరలే ధరించేది. అప్పుడప్పుడు ఉప్పుతో ఉతుక్కునేది.

తలవెంట్రుకల విషయంలోకూడా అదేవిధంగా జరిగింది. మొదట నూనెను నిషేధించారు. అలాగే ముడుచుకోవాలి. రెండో సంవత్సరంకూడా నూనె నిషేధమే. కాని జుట్టును ముడుచుకోగూడదు. మూడో సంవత్సరం ఆదేశానుసారం జుట్టు తీసివేసుకొంది. ఎప్పుడూ సువాసన నూనెను

వాడమని భవానీఠాకుర్ ఆదేశం. నాల్గో సంవత్సరం ఆమె యిష్టం. అయిదో సంవత్సరం ప్రఫుల్ల జుట్టు విషయం ఏమీ పట్టించుకోనే లేదు.

మొదటి సంవత్సరం ఆమెకు పరుపు, తలగడ లభించాయి. రెండో సంవత్సరం, ఎండుగడ్డి తలగడ. మూడో సంవత్సరం కటిక నేల. నాల్గో సంవత్సరం హంసతూలికా తల్పంవలె అతికోమలమైన శయ్య. అయిదో సంవత్సరం ఆమె యిష్టానుసారం. అయిదో సంవత్సరం ప్రఫుల్ల ఎక్కడబడితే అక్కడే నిద్రించేది.

మొదటి సంవత్సరం మూడు జాములు, రెండో సంవత్సరం రెండు జాములు నిద్రించేది. మూడో సంవత్సరం రెండు రోజులకొక రాత్రంతా మేల్కొనివుండాలి. నాల్గో సంవత్సరం నిద్ర రాగానే నిద్రపోయేది. అయిదో సంవత్సరం ఆమె ఇష్టానుసారం. అయిదో సంవత్సరం రాత్రి మేల్కొని చదువుతూ వుండేది, లేదా వ్రాస్తూ వుండేది.

ప్రఫుల్ల తనశరీరాన్ని నీరు, ఎండ, గాలి, నిప్పు అన్నింటినీ సహించ కలిగేట్లు అభ్యాసం చేసుకోసాగింది. భవానీ ఠాకుర్ మరొకవిద్యను అభ్యసించ వలసిందని కూడా ఆదేశించాడు. చెప్పటానికి సిగ్గుగావున్నా అదిచెప్పనిదే విషయం అసంపూర్తిగా వుండిపోతుంది. రెండో సంవత్సరం 'మల్ల యుద్ధం నేర్చుకోవాలి' అని ఆదేశించాడతడు.

ప్రఫుల్ల సిగ్గుతో తలవంచుకుంది 'ఠాకుర్! మీరేదైనా చెప్పండి నేర్చుకుంటాను, ఇదిమాత్రం నేర్చుకోలేను' అని అందామె.

'అది లేనిదే పనిజరగదు.'

'ఎందుకని టాకుర్? స్త్రీ మల్లయుద్ధం నేర్చుకొని ఏమిచేస్తుంది?' అని అడిగిందిప్రఫుల్ల

'ఇంద్రియాలపై విజయం పొందటానికి. శారీరక బల హీనతవల్ల అది జరగదు. వ్యాయామం లేకుండా ఇంద్రియాలను జయించటంఅసంభవం' అన్నాడుటాకుర్ ఆమెతో.

'నాకు మల్లయుద్ధం ఎవరు నేర్పుతారు? పురుషులవద్ద మాత్రం నేను నేర్చుకోను? అంది.

'శశి నేర్పుతుంది. ఆమె పిల్లల్ని ఎత్తుకుపోయేవారివద్ద పెరిగింది వారు బలమైన బాలికల్ని వేరుగావుంచరు. ఈ విషయాన్ని Warren Hastings వ్రాసిందే. వారివద్ద ఉన్నందువల్లనే నిశిసి నీవద్దవుంచాను.

ప్రఫుల్ల నాల్గుసంవత్సరాలవరకు మల్లయుద్ధం నేర్చుకొంది.

మొదటిసంవత్సరం భవానీటాకుర్ ప్రఫుల్ల ఇంటికి ఎవర్నీ రానిచ్చేవాడుకాదు. ఆమెను బయట పురుషులెవ్వరితో మాట్లాడనిచ్చేవాడుకాదు. రెండోసంవత్సరం మాట్లాడటానికిమాత్రం నిషేధంలేదు. మూడోసంవత్సరం ఆమె జుట్టు తీయించుకొన్నప్పుడు, భవానీటాకుర్ ముఖ్యమైన శిష్యులతో కలిసి ప్రఫుల్లవద్దకు వస్తూవుండేవాడు. ఆమె తలవంచుకొని వారితో శాస్త్రచర్చలో పాల్గొనేది. నాల్గో సంవత్సరం భవానీటాకుర్ కర్రసాములో ప్రవీణులైనవారిని తీసుకొనిపోట్లాడించేవాడు.అయిదోసంవత్సరం ఏనిషేధాలూ లేవు.అవసరంకల్గినప్పుడు ప్రఫుల్ల పురుషులతో మాట్లాడేది,

లేకపోతే త్రైనేలేదు. పురుషులతో మాట్లాడునప్పుడు ఆమె వారిని తనపుత్రులుగా భావించేది.

ఈవిధంగాఅతులఐశ్వర్యానికిఅధికారాణిప్రఫుల్లనుభవానీ ఠాకుర్ అనేకవిధాలపరీక్షించి,అభ్యాసంద్వారాఐశ్వర్యాన్ని అనుభవించేందుకు యోగ్యురాలను చేయుయత్నించాను. అయిదుసంవత్సరాల్లో విద్యలన్ని ముగిశాయి.

ఏకాదశిరోజున చేపలుతినేవిషయంగాకప్రఫుల్లభవానీ ఠాకుర్ యొక్క మరొకమాటనుకూడా అలక్ష్యంచేసింది. తనస్వవిషయాలేమీ చెప్పలేదామె ఎంతఅడిగినా ఒక్కవిష యమైనా తెలుసుకోలేకపోయాడు భవానీఠాకుర్.

# 16

ఐదుసంవత్సరాల శిక్షణకార్యాన్ని ముగించి భవానీ ఠాకుర్ ప్రఫుల్లతో 'అయిదు సంవత్సరాలకు పూర్వం నీకు విద్యాభ్యాసం ప్రారంభించాను. ఇప్పుడిక నీధనాన్ని ఇష్టం వచ్చినట్లు ఖర్చుచేసుకో, నేనుఆపనుసన్ను. నాఅభిప్రాయాలు మాత్రంచెప్తాను– ఇష్టమైతేఆచరించు, లేదా మానివెయ్యి. నీతిండిగుడ్డల విషయంలో నేనిక సహాయమేమీ చేయను. నీ జీవితనిర్వహణనునువ్వేచూసుకో. కొన్నివిషయాలుచెప్తాను. అనేకపర్యాయాలు చెప్పినవే, మరొకసారిచెప్తాను. ఇప్పుడు నువ్వేమార్గాన్నవలంబిస్తావు?' అని అడిగాను.

'పనిచేస్తాను. జ్ఞానం నాలాంటివారికికాదు.'

'మంచిది. వినిఆనందంకలిగింది. కానిఅనాసక్తివైకర్మ నాచరించాలి. ప్రతిఫలాపేక్షలేనికర్మనుగురించి భగవానుడు చెప్పినమాట గుర్తుందా-

'తస్మాదసక్తః సతతం కార్యం కర్మసమాచర।
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥"

అనాసక్తి అంటే ఏమిటి? తెలుసా నీకు? దీనియొక్క ప్రథమలక్షణం ఇంద్రియనిగ్రహం. అదే ఈఅయిదు సంవత్సరాలలో నేనునీకు నేర్పాను. ఇకఅధికంగా చెప్పాల్సినఅవసరం లేదు. రెండోలక్షణం నిరహంకారం. ఇదిలేకుండా ధర్మాచరణ సాధ్యంకాదు. భగవానుడు ఏమన్నాడంటే—

'ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే॥'

'ఇంద్రియముల ద్వారా జరిగిన పనిని నేనేచేశాను' అనుకోటమే అహంకారం. నువ్వేదిచేసినా అది నీగుణంతో జరిగిందని యోచించకు, యోచించటంవల్ల పుణ్యకర్మలోపిస్తుంది. మూడోలక్షణం ఏమనగా, కర్మయొక్క ఫలితాన్ని శ్రీకృష్ణునికి అర్పించి వేయాలి. భగవానుడేమన్నాడంటే -

'యత్ కరోషి యదశ్నాసి యజ్జుహోషిదదాసియత్ ।
యత్ తపస్యసి కౌన్తేయ తత్ కురుష్వ మదర్పణమ్'

ఇప్పుడు చెప్పమ్మా! యీ ధనరాశితో నువ్వేమి చేయదలచావు?'

'నాకర్మ లన్నింటిని శ్రీకృష్ణునికి అర్పించినప్పుడు ధనాన్ని కూడా ఆ కృష్ణునికే అర్పించాను'

'అంతా?'

'అవును, పూర్తిగా.'

'కానీ, అలా చేసినంతమాత్రాన కర్మలో ఆసక్తి లేనట్లుకాదు. తిండికోసం నువ్వు ప్రయత్నం చేయాల్సివచ్చి నప్పుడు ఆసక్తి ఉత్పన్నమవుతుంది. అందువల్ల నువ్వు భిక్షా వృత్తినైనా ఆచరించాలి, లేదా ఈధనంతోనైనా పనిజరుపు కోవాలి. భిక్షలోకూడా ఆసక్తివుంది. అందుకని ఈధనం తోనే పనిజరుపుకో. అన్ని శ్రీకృష్ణునికి అర్పిస్తావు కానీ ఇది వారి చరణముల చెంతకు చేరే దేవిధంగా?'

''అతను 'సర్వభూతాని' అని నేను నేర్చుకున్నాను. కనుక సర్వభూతములకు ఈధనాన్ని పంచుతాను" అంది ప్రఫుల్ల.

'నిజమేనమ్మా! భగవానుడుకూడా స్వయంగా చెప్పిందేమంటే—

'యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయిపశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి॥
సర్వభూత స్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః
సర్వథా వర్తమానోపి సయోగీ మయివర్తతే॥
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోర్జున।
సుఖం వా యది వా దుఃఖ సయోగీ పరమోమతః॥

శ్రీమద్భగవద్గీత - 6 అ ౩౦-౩౨.

కానీ ఈవిధమైన దానంచేయటం చాలాకష్టమైనది, శ్రమతో కూడినటువంటిదిన్నూ. నువ్వది చేయగలవా?'

'మరినేను ఇంతకాలం నేర్చుకుందేమిటి?'

'ఆ కష్టమునుగురించి చెప్పటంలేదు. అప్పుడప్పుడు కొంచెంవ్యాపార పద్ధతుల్నవలంబించాల్సిన అవసరంకలుగు

తూవుంటుంది. కొద్దివేరువిన్యాసము, కొంచెంభోగవిలాసాల ప్రదర్శన అవసరమవుతూవుంటుంది. అందులోకలిగేకష్టాన్ని సహించగలవా !'

'అదెలాగు?'

'అయితేవిను: నేనుచేసేది దోపిడీ అనిమొదటే నీకు చెప్పాను.'

'నావద్దవున్న ఆ శ్రీకృష్ణుని ధనంలో కొంతభాగం మీరుకూడాతీసుకోండి. ధర్మాన్ని ఆచరించండి. ఈదుష్కర్మను వదలివేయండి' అంది ప్రఫుల్ల.

'ధనం నాకూ అవసరంలేదు. నావద్దకూడా చాలా ధనంవుంది. నేను ధనం కోసం దోపిడి చేయటంలేదు.'

'మరెందుకు?'

'నేను పరిపాలన సాగిస్తున్నాను.'

'దోపిడీవల్ల పరిపాలన ఎలాజరుగుతుంది.'

'రాజదండం వున్నవాడే రాజు.'

'రాజదండం రాజుచేతిలోనేవుంది.'

'ఈదేశంలో రాజులేడు. ముసల్మానులు అంతరించారు. ఆంగ్లేయులు ఇప్పుడేప్రవేశిస్తున్నారు. వారికిపాలించటమే తెలియదు, చేయుటంలేదు కూడాను నేనుచేయుచున్నది దుష్టశిక్షణ, శిష్టరక్షణ.'

'దోపిడి చేస్తూనా?'

'నేనుచెప్పేది శ్రద్ధగావిను.'

అనిభవానీఠాకుర్ దేశదుర్దశనుగురించికళ్ళకుకట్టినట్లు వర్ణించాడు. జమీందార్ల దుండగాలను చెప్పాడు. తిన్నగాపు

ప్రజల్ని ఏవిధంగా దోచుకుతింటున్నదీ వర్ణించాడు. సాతిపున్న ధనంకోసం ఇళ్ళను త్రవ్వివేస్తారు, దొరికితే ఒకరూపాయి రావల్సినచోట వెయ్యిరూపాయలు తీసుకుపోతారు; దొరక్కపోతే చావబాదుతారు, బంధిస్తారు. లేదా చంపేస్తారు. దేవతా విగ్రహాలను పెకలించివేస్తారు. పసిపిల్లల్ని కాళ్ళు పట్టుకొని నేలకేసిబాదుతారు. యువకులగుండెలపై బండలెత్తి తొక్కుతారు. వృద్ధులకళ్ళల్లో చీమల్ని, నాసికాపుటాల్లో పురుగుల్ని కట్టివేస్తారు. యువతుల్ని నిండుసభలో నగ్నం చేసి అవమానిస్తారు, కొడతారు, స్తనాల్ని కత్తిరించి, నిండుకొలువులోనే వారి శీలాన్ని హరిస్తారు.

ప్రాచీనకవులవలె భవానీ టాకుర్ బిగ్గరగా ఎలుగెత్తి వినిపించాడీ కథనంతా.

'నేను ఈదురాత్ముల్ని శిక్షిస్తున్నాను. అనాథుల్ని, దుర్బలులను కాపాడుతున్నాను. నే నేవిధంగా చేస్తున్నానో రెండురోజులు నా వెంటవుండి స్వయంగా చూసితెలుసుకో.' అని చెప్పాడతను ప్రఫుల్లకు.

ప్రజల దుఃఖగాథను విని ప్రఫుల్లకు హృదయంలో బాధకల్గింది. ఆమె భవానిఠాకుర్‌కు సహస్రనమస్కారాలు చేసింది. 'నేను మీవెంటవస్తాను. కొంత ధనంకూడా తెచ్చి దుఃఖితులకు ఇస్తాను' అంది.

'ఈధనులకే అలంకరించిన పాపవలెతయారు కావల్సి వుంటుందని నేను చెప్పింది. నాకోరాహాలంటే కొంచెం

ఆడంబరంగా రావాలి, సన్యాసివేషంలో పనిజరగదు' అన్నాడు భవానీఠాకుర్.

'నాకర్మలు శ్రీకృష్ణార్పణం. ఇప్పుడిక అదివారిదే కాని నాదికాదు. వారిపనికోసం ఏది చేయవల్సినా చేస్తాను' అంది ప్రఫుల్ల.

భవానీఠాకుర్ మనోవాంఛ సిద్ధించింది. అతను తన దళంతో కలిసి బందిపోటుకు బయలుదేరినప్పుడు ధన[illegible]ంపను తీసుకొని ప్రఫుల్లకూడా బయలుదేరింది. నిశి కూడా వెంట వెళ్ళింది.

భవానీఠాకుర్‌లో ఎంతశక్తి ఉన్నప్పటికీ వారికొక పదునైన ఆయుధం అవసరం. అందుకని అతను అయిదు సంవత్సరాల వరకు సానరాయిపై రాపాడి ప్రఫుల్లను పదునైన ఆయుధంగా తయారుచేసుకొన్నాడు. పురుషుడైవుంటే మంచిదే కానీ ప్రఫుల్లవంటి సర్వగుణసంపన్నులెవరూ లభించలేరు. ముఖ్యంగా ఇంతధనం ఎవరివద్దా లేదు. సంపద కూడా చాలా పనునుగావుంటుంది.

కానీ భవానీఠాకుర్ ఒక పొరపాటు చేశాడు. ప్రఫుల్ల ఏకాదశి రోజున బలవంతాన్నైనా చేపకూర తినేది. ఈ విషయాన్ని అతను శ్రద్ధగా పరిశీలించాల్సింది. సరే, ఏదైనా కానివ్వండి ఇప్పుడిక మేము ప్రఫుల్లను జీవితంలో ప్రవేశపెట్టి మరో అయిదు సంవత్సరాలు త్రిప్పేస్తాం. ప్రఫుల్లకు అన్ని విద్యలూ బోధించారు, కానీ కర్మ విద్యాబోధన జరగలేదు. ఈ అయిదు సంవత్సరాల్లో కర్మవిద్య బోధించబడుతుంది.

# రెండవ అధ్యాయము

ఆరుదు, అయిదు - పదిసంవత్సరాలు గడచిపో యాయి. శూద్రబాలిక అని హారవల్లభుడు ప్రఫుల్లనుబహి ష్కరించినరోజు మొదలు పదసంవత్సరాలు గతించాయి. హారవల్లభరాయ్‌కు ఈ పదిసంవత్సరాలూ అంతక్షేమంగా గడవలేదు. దేశదర్శనను గురించి ఇంతకుముందే చెప్పాము. జాగీర్దారు దేవీసింహుని అత్యాచారాలు జరుగుతూనే వున్నాయి, పైగా దొంగల దుండగాలొకటి. ఒకసారి హార వల్లభుని తాలూకానుంచి శిస్తువస్తూవున్న సమయంలో దొం గలు దోచుకున్నారు. అది దేవీసింహునకు చేరలేదు. దేవి సింహుడు ఒకతాలూకాను వేలంవేశాడు. హేస్టింగ్స్, గంగా గోవిందుసింహుల కృపాకటాక్షంవలన ప్రభుత్వ అధికారు లందరూ దేవీసింహుని పక్షానేవున్నారు. ఇటువంటివిషయా లన్నింటిలో అతడేవి తలిస్తే అదేచేసేవాడు. పదివేల ఖరీదు చేసే హారవల్లభుని తాలూకాను దేవీసింహుడు వేలంలో రెండున్నరవందలకు, తానే కొనివేశాడు. కాస్త దాసితో శిస్తుమొత్తం ముట్టలేదు, ఇవ్వటం హెచ్చిపోసాగింది. దేవి సింహుని వత్తిడి భరించలేక, కారాగారవాస భయంవలన హారవల్లభుడు తనఆస్తిని తాకట్టుగావుంచి ఋణంతీర్చాడు. ఈ కారణాలన్నింటివలన ఆదాయం చాలా తగ్గిపోయింది, ఖర్చుమాత్రం యథావిధిగా నేవుంది. అలవాటైన జీవితాన్ని మార్పించుకొనేదెలా. ఎప్పుడో ఒకప్పుడు అందరికీ ఈ పరిస్థితి ఎదురవుతూనే వుంటుంది. అప్పుడు లక్ష్మి నిలేసి 'వినకటి

నడకనైనామాను; లేదా నన్నైనా వదులుకో' అని అడుగు తుంది. ఎక్కువమంది 'తల్లీ, నువ్వే వెళ్ళు, అనడకనేలా వదులుకుంటాను!' అనే జవాబిస్తారు. హరివల్లభుడుకూడా అటువంటివారిలో చేరినవాడే. పూజా పునస్కారాలు, ఉత్స వాలు, వేడుకలు, దానధర్మాలు, కుస్తీపోటీలుఎప్పటిమాదిరిగా నే సాగుతున్నాయి. పైగా దొంగలు దోచుకున్న తర్వాత సాముగరిడీలవారు మరికొంత పెంచ్చారు.ఆదాయం ఖర్చుకు చాలటంలేదు. ప్రభుత్వానికి చెల్లించాల్సిన కప్పం చాలా పెరిగిపోయింది. ఇక ఉన్నదంతా అమ్ముకోవల్సిన స్థితి ఏర్పడింది. అప్పుమీద అప్పు పెరిగిపోతోంది, వడ్డీ పెరిగి అసలుకు సమానమయింది. ఇప్పుడిక అప్పిచ్చేవారు కూడా ఎవరూ కన్పించలేదు.

ఇంచుమించు దేవీసింహునకు ఏభై వేలు బాకీపడ్డాడు. హరవల్లభుడు ఎంత ప్రయత్నించినా డబ్బు చెల్లించలేక పోయాడు. చివరకుహరవల్లభ రాయ్‌నుబంధించాలనేఆజ్ఞ జారీ అయింది. ఆరోజుల్లోఎవరైనా బంధించటానికి ఎక్కువనియ మాలు, శాసనాలు ఏవీఅవసరంలేదు. అప్పుడు ఆంగ్లేయులు, చట్టాలులేవు ఆనాటి నియమాలకు పట్టునేదేమీ లేదు.

## 2

చాలాసందడిగావుంది. వ్రజేశ్వరుడు అత్తవారింటికి వచ్చాడు-ఏ అత్తవారిల్లో చెప్పాల్సినపనిలేదు. సాగర్ తండ్రి గారింటికే. ఆరోజుల్లో ఇంటికి అల్లుడురావటంఅంటే తేలిక

ర్థమే అయింది. ఇప్పుడిక సాగర్ వంతు వచ్చింది.

అత్తవారింట్లో భర్తను దర్శించటం కష్టమైనంతగా ఇంట్లో వుండదు. సాగర్ భర్తను ఏకాంతంలో కలుసుకుంది. వ్రజేశ్వరుని కాళ్ళపైబడి 'నే నేమీ అపరాధం చేయలేదు గదా, మరొకరోజు ఉండండి' అని ప్రాధేయపడింది.

వ్రజేశ్వరునికి చాలా కోపంగావుంది. అతను కాళ్ళు వెనక్కి లాక్కున్నాడు. క్రోధంలో పనులన్నీ చాలా గబగబ జరిగిపోతాయి, కాళ్ళు చేతులుకూడా కొంచెం ఎక్కువగా ఆడతాయి. అందుకని కాళ్లు లాక్కోవటంలో వ్రజేశ్వరుడు బలంగావిదిలించాడు, అది సాగర్‌కుతగిలింది. భర్త క్రోధంతో తన్నాడనిభావించింది సాగర్. ఆమె కాలువదలి క్రుద్ధసర్పం వలె లేచి నిల్చుంది. 'ఏమిటి? నన్ను తన్నారా?'

నిజానికి వ్రజేశ్వరుడు తన్నలేదు, అలా చేయాలనీ లేదతనికి. అతడావిషయాన్నే చెప్పివుంటే అంతటితో ముగిసేది. ముందే అతడు చాలాకోపంగావున్నాడు, సాగర్ క్రోధంతో బుసకొట్టటంచూసి అతనికి మరింత క్రోధం హెచ్చింది. తన్నానే అనుకో, అయితే? నువ్వుగొప్పవాని కూతురువే కావచ్చు. నీ తండ్రే పూజించాడు ఈకాళ్ళను ఒకనాడు' అన్నాడు.

సాగర్ క్రోధంతో తననుతాను మరిచింది.

'వారు పూజించటం పొరపాటే జరిగింది, అందుకు ప్రాయశ్చిత్తం చేస్తాను నేను' అని అంది.

'బదులుగా నన్ను తన్నుతావా?'

'నేను అంత అధమురాలిని కాదు. నేను బ్రాహ్మణ కన్యనే అయివుంటే మీరు నాకాళ్ళ......'

సాగర్ మాట పూర్తవకముందే వెనకవున్న కిటి లోంచి ఎవరో 'నాకాలిని ఒడిలో పెట్టుకొని నాకరు సేవచేయాలి' అన్నారు.

సాగర్ కూడా అలాంటిదే ఏదో అనాలనుకుంటోంది. ఆమె ఏమీ ఆలోచించకుండా, ఎటూ చూడకుండా ఆ మాటనే అనేసింది.

వ్రజేశ్వరుడు అదేవిధంగా జవాబిచ్చాడు. 'నీపాద సేవ చేయనంతవరకు నేనూ నీముఖం చూడను. ప్రతిజ్ఞను తప్పితే బ్రాహ్మణుడనేకాదు.' అని వ్రజేశ్వరుడు వెళ్ళి పోయాడు. సాగర్ కాళ్ళు చాచుకూర్చొని ఏడ్వసాగింది. ఇంతలో ఒకదాసీ వచ్చిందక్కడికి. ఆమెను చూసేసరికి వెనుక కిటికీలోంచి ఎవరో మాట్లాడినట్లు గుర్తొచ్చిందిసాగర్ కు. 'కిటికీలోంచి మాట్లాడింది నువ్వేనా?' అని అడిగిదామెను.

'లేదే' అందిదాసీ.

'అయితే కిటికీవద్ద ఎవరున్నారోచూడు' అందిసాగర్.

అప్పుడు సాక్షాత్తు లక్ష్మీదేవివలె సౌందర్యవతి, తేజస్వినిఐన స్త్రీ ఒకామె గదిలోకి ప్రవేశించి 'కిటికీవద్ద వున్నది-నేను' అని అంది.

'ఎవరుమీరు?' అని అడిగిందిసాగర్.

'నన్నెవరూ గుర్తించటంలేదా?' అని అడిగిందాస్త్రీ

దాసీ చేతిలోవున్న తాంబూలపేటిక ధనామని క్రింద పడిపోయింది; భయంతో కంపిస్తూ కూర్చొని ఏడ్వసాగింది. దేవీ చౌధరాణి, ఆమెకేసి కళ్ళెర్ర చేసిచూస్తూ 'నోర్మూయ్ తుచ్ఛురాలా! లేచి నిలబడు' అని అంది.

దాసీ వణుకుస్తూనే లేచినిల్చుంది. సాగర్ కూడా చెమటతో తడిసి ముద్దయిపోయింది. ఆమె నోటినుండి మాటరాలేదు. వారువిన్న పేరు; పిల్లలు, వృద్ధులు తెలియందెవరికి? ఆ పేరు చాలా భయంకర మైనది.

కానీ అప్పుడే సాగర్ పకాలున నవ్వేసింది, దేవీ చౌధరాణికూడా నవ్వింది.

## 3

వర్షాకాలం. వెన్నెలరాత్రి. వెన్నెల అంత ప్రకాశవంతంగాలేదు. మసకమసకగా మధురంగావుంది. త్రిస్రోతా నది వర్షపునీటితో తొణికిసలాడుతూ ప్రవహిస్తోంది. వేగంగా ప్రహించే నదీ ప్రవాహంలో లేచే చిరుతరంగాలపై చంద్ర కిరణాలుపడి మెరుస్తున్నాయి. తీరానవున్న చెట్లమొదళ్ళకు తాకి వాటి నీడపడటంవల్ల నీరు నల్లగావుంది. తీరాలకు తాకే నీటిచప్పుడు, సుడిగుండాల ఘోరగర్జన, వేగంగా ప్రవహించే ప్రవాహధ్వని అన్నీ కలిసి ఆకాశవ్యాప్త గంభీరశబ్దమయింది.

ఈ త్రిస్రోతా నదిలో, తీరానికి కొద్ది దూరంలోనే ఒక పెద్దపడవ ఆగివుంది. ఆపడవకు కొద్దిదూరాన చింతచెట్టు నీడలో సురొంక చిన్ననావ ఆగివుంది. పెద్దపడవ అనేకవిధాల

అలంకరించ బడివుంది. దానిలో వివిధ చిత్రాలు వ్రాసి వున్నాయి. పడవ ముందుభాగాన, పైన వెండితొడుగువేసిన ఒక మొసలి విగ్రహంవుంది. అంతా పరిశుభ్రంగానూ, ప్రశాంతంగానూవుంది. ఒకప్రక్క వాసాలపై తెరచాపను పరుచుకొని నావికులు నిద్రపోతున్నారు. ఎవరూ మేల్కొని వున్నట్లేమీలేదు. పడవపై భాగాన మాత్రం ఎవరో ఒక రున్నారు. ఆహా! అదొక అపూర్వదృశ్యం.

పడవపైభాగాన ఒక కంబళిపరచివుంది. ఆ కంబళి రెండంగుళముల మందముగానూ, అతికోమలంగా చాలా అందంగావుంది. దాని పైనకూడా చిత్రాలున్నాయి. కంబళిపై ఒకస్త్రీ కూర్చొనివుంది. ఆమె వయస్సును వూహించటం కష్టం. పాతికసంవత్సరాలలోపు వారికి ఇంత నిండుదనంగలశరీరం వుండదు. పాతికసంవత్సరాలు పైబడినవారిలో ఇటువంటి యవ్వనలావణ్యం కన్పించదు. వయస్సు ఎక్కువైనప్పటికీ, ఆస్త్రీ అత్యంత సౌందర్యవతి. ఆమె అంత సన్నగానూలేదు, మరీ అంత లావుగానూలేదు. అందుచే ఆమెలో పదహారుకళలు నిండివున్నాయి. త్రిస్రోతానది నేడు ఎలా తొణికిసలాడుతూవుందో ఆమె ప్రతి అవయవం అలాగే నిండుదనంతో పరిపూర్ణంగావుంది. యవ్వనపు వర్ష జలం ఆమె కమనీయ శరీరమంతటా నిండింది, నిండి ప్రవహించలేదు. ఆ జలం ప్రతి అవయవంలోనూ నర్తిస్తోంది. జలం చంచలంగావుంది, కానీ నది చంచలంగాలేదు. తరంగహీనంగావుంది. లావణ్యం చంచలంగావుంది; లావణ్యవతి చంచలంగాలేదు. నిర్వికారంగావుంది. ఆమె నదివలెనే

ప్రశాంతంగా, గంభీరంగా, జ్యోత్స్నామయి, ఆనందదాయిని వలెవుంది. బంగారు జరీగలపూలున్న సన్ననిథక్కా మల్లుచీర ధరించింది. దాని అడుగున వజ్రములు, ముత్యములు మెర యుచున్న అంగా ధరించింది. శరీరమంతా వజ్ర వైఢూర్య ములు మొదలగు నవరత్నములతో అలంకరింపబడి ధగధగ ప్రకాశిస్తోంది. వెన్నెలలో నవ్వుచున్న ఆ నదివలె ఆమె దుస్తులు నిర్మలంగా వున్నాయి. జలతరంగాలు వెన్నెలలో తళుకుత్రీనునట్లే ఆమె దుస్తులలోని రత్నాలు తళుకులీను తున్నాయి. నదీతీరాన ముసిరివున్న నీడవలె ఆమెనల్లని దీర్ఘ కేశరాశి వ్యాపించివుంది. పట్టుకుచ్చులాంటి ఆమె కేశరా శిపై చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. అత్తరు సుగంధాలంతటా నిండివున్నాయి. మల్లె, సన్నజాజుల మాల ఒకటి కేశము లందు అలంకరించబడివుంది

పడవపైభాగాన కూర్చొన్న ఆ సౌందర్యవతిసాక్షాత్ సరస్వతీదేవివలె వీణవాయిస్తోంది. జలతరంగాలపై వెన్నెల తేలియాడుతున్నట్లే ఆయువతి అలంకారాలపై చంద్రకిర ణాలునాట్యం చేస్తున్నాయి; అదేవిధంగా వనపుష్పసుగం ధంతో నిండి వెన్నెలలో జలకమాడి గాలిలో వీణాస్వరం దోబూచులాడుతోంది.

ఝుమ్ ఝుమ్-ఛన్-ఛన్-ఝునన్-దమ్-దమ్-క్రిమ్ స్వరాల్లో వీణపై ఎన్ని రాగాలాపనలు మ్రోగాయో నాకు తెలియదు. వీణ ఒకప్పుడు ఏడ్చేది, అంతలోనే క్రోధం, వెంటనే నాట్యంచేసేది. మరొకప్పుడుబుజ్జగించేది, అంతలోనే గర్జించేది; ఆ వెంటనేమధుర దరహాసాన్ని కురిపించేది. ఝుం

ఝూంటి, కమాచి, సింధు – ఎన్నిమధురరాగాలో అంతులేదు. కన్నడ, సహానా, బాగేశ్వరి మొదలగు సమ్మోహనరాగాల, వీణానాదం నదీకల్లోలంలో విలీనమైపోయింది. అకస్మాత్తుగా ఏదోనూత్నోత్సాహంతో యువతి వీణమీటింది. ఆమె చెవులనున్నకుండలాలు ఊగులాడాయి. సర్పంవలె ఆమె కేశరాశి మరింత చెదిరిపోయింది. వీణపై నటరాగం మ్రోగింది. తెరచాప పరుచుకొని నిద్రించువారిలో ఒకడు లేచిమెదలకుండావచ్చి సుందరిముందు నిల్చున్నాడు.

అతడు దీర్ఘకాయుడు, చాలాబలవంతుడు. మెడలో యజ్ఞోపవీతంవుంది. అతడు సమీపమునకువచ్చి 'ఏంజరిగింది'? అని అడిగాడు.

'కన్పించలేదా?' అని అంది స్త్రీ.

'ఏమీలేదు. వస్తుందాయేం?' అన్నాడు పురుషుడు.

కంబళిమీదున్న దూరదర్శిని తీసి స్త్రీ పురుషుని చేతికిచ్చింది. ఏమీ మాట్లాడలేదామె. అతడు దూరదర్శినితో నాలుగుదిక్కులూ కలయచూశాడు. ఒకచోట అతనికొక పడవ కన్పించింది – 'అవునవును, చూశాను, అదేనా?' అన్నాడతడు.

'ఈనదిలో ఇక మరో పడవవస్తుందనేదేలేదు' అందామె.

పురుషుడు దూరదర్శినితో చుట్టూచూడసాగాడు. యువతి వీణవాయిస్తూ 'రంగరాజ్!' అంది.

'చిత్తం!'

'ఏమిటి చూస్తున్నావ్?'

'ఎందరున్నారోనని చూస్తున్నాను.

'ఎందరున్నారు?'

'సరిగ్గా తెలియటంలేదు. ఎక్కువ మందిలేరు. మన నావను వదలనా?'

'త్వరగా వదలండి. చీకట్లో మెదలకుండా వెళ్ళు'

'నావను వదలండి' అని కేకేశాడు రంగరాజ్.

## 4

పెద్ద పడవకు కొద్దిదూరంలోనే ఒక చింతచెట్టు క్రింద అంధకారంలో ఒక చిన్న నావ దాగివుందని మొదటే చెప్పాం. అది చాలా చురుకుగాపోతోంది. ఎనిమిదిగజాలపొడవు, మూడు గజాల వెడల్పుకంటే ఎక్కువ వుండదది. అందులో ఇంచు మించు యాభైమంది ఒకరిపై ఒకరుపడి నిద్రపోతున్నారు. రంగరాజ్ కేకవిని వారందరూ ఒక్కసారిగా లేచి కూర్చు న్నారు. బల్లనుతీసి వారందరూ ఒక్కొక్క-ధాలు, బల్లెమును తీసుకొన్నారు. తర్వాత తలొక గడను పట్టుకొన్నారు. ఆ బోటు నెమ్మదిగా ఆపడవ చెంతకు చేరుకుంది. రంగరాజ్ పంచాయుధాలతో ప్రయాణమైదానిలోకివచ్చాడు. ఆయువతి అతన్నిపిలిచి 'రంగరాజ్! నేనుచెప్పింది గుర్తుంచుకో' అని చెప్పింది! 'గుర్తుంది' అని అతడాబోటులో కూర్చున్నాడు. బోటు నిశ్శబ్దంగా తీరం వెంబడే ముందుకుసాగింది.

ఇంతకుముందు దూరదర్శినితో రంగరాజ్ చూసినపడవ ప్రవాహపువాలునబడి చాలాసమీపానికేవచ్చింది. సమీపానికి రావటంచూసి బోటు తీరంవెంబడే వెళ్ళటంమాని ఆ పడవ

దిక్కుగా రాసాగింది. యాభైతెడ్లతో నడుపుతున్నప్పటికీ ఏమాత్రం ధ్వని విన్పించటంలేదు.

ఆపడవపైభాగాన ఎనిమిదిమంది పశ్చిమ దేశపుసైనికు లున్నారు. ఇంతమందిమనుషులులేకుండా ఆరోజుల్లో రాత్రు లందు పడవప్రయాణం చేయటానికెవరూ సాహసించేవారు కాదు.వారిలో ఇద్దరువ్యక్తులు ఎర్రనితలపాగాలుధరించి ఆయు ధాలుపట్టుకొని కూర్చొనివున్నారు. మిగిలినఆరుగురూ మధుర మైనదక్షిణపుగాలిఆనందాన్ననుభవిస్తూ గడ్డాల్ని గాలి!వదలి నిద్రిస్తున్నారు. కాపలావారిద్దరిలో ఒకడు బోటు తమ పడవ సమీపానికిరావటంచూసి 'బోటునుదూరంగావుంచండి' అని బిగ్గరగా కేకవేశాడు.

'నీకుఅవసరమైతేనువ్వేదూరంగావుంచుకో' అనిజవా బిచ్చాడు రంగరాజ్.

కాపలామనిషి బెదిరించేందుకుగాలిలోతుపాకిపేల్చాడు అదివట్టిదేనని గ్రహించాడురంగరాజ్, 'ఏం పండాగారూ! తుపాకిలో గుళ్లుకూడాలేవు! అప్పుగా ఇవ్వమంటారా ఏం?' అన్నాడు రంగరాజ్ నవ్వుతూ.

అనిరంగరాజ్ తుపాకిని తలకు గురిచూసి అంతలోనే క్రిందికిదించేసి 'ఇప్పుడేచంపనుసిన్ను. నీఎర్రతలపాగానుఎగర గొట్టాను' అంటూ తుపాకీని దించేసి గురిచూసి బాణం వదిలాడు. కాపలావాని తలమీదఎర్రతలపాగా ఎగిరిపోయింది. అతడు రామనామం జపించసాగాడు.

క్షణకాలంలోనే బోటు పడవ వెనుకభాగానికి వచ్చి ఆగింది. పదిపన్నెండుమంది ఆయుధాలుధరించిన వ్యక్తులు

పడవమీదికి ఎక్కారు. నిద్రపోయే అర్గుసైనికులు తుపాకీ ధ్వని విని మేల్కొన్నారు. కానీ తమఆయుధాలు వెతుక్కో వటంతోనే వెళ్ళిపోయింది కాలమంతా. ఆక్రమణదారులు వెంటనే వారందర్నీ బంధించివేశారు. మేల్కొనివున్న ఇద్దరూ పోట్లాడారు, కానీ కొద్దిక్షణాలుమాత్రమే నిలబడ గలిగారు, వారైనా. ఆక్రమణదారులు చాలా మంది వున్నారు, త్వరగానే వారిని కూడా బంధించారు. అప్పుడిక వారు పడవలోని గదుల్లోకి జొరబడ యత్నించారు. కానీ తలుపులు లోనినుంచి బంధించబడి వున్నాయి.

లోపల వ్రజేశ్వరుడు ఉన్నాడు. అతడు అత్తవారింటి నుంచి తిరిగి ఇంటికి బయలుదేరి వస్తున్నాడు. దారిలో ఈ ఆపద వచ్చిపడింది. ఇది అతడు సాహసించినందుకు కలిగిన ఫలితం. మరెవ్వరూ కూడా రాత్రులందు ప్రయాణం చేయరు.

రంగరాజ్ తలుపుతట్టుతూ 'మహాశయా, తలుపు తెరవండి' అన్నాడు. వ్రజేశ్వరుడు మేల్కొని 'ఎవరు? ఇంత గోలగా వుందెందుకు?' అన్నాడు.

'మరేమీ లేదు – పడవపైనోపిడి జరిగింది' అన్నాడు రంగరాజ్.

వ్రజేశ్వరుడు కాస్సేపు నిశబ్దంగావుండి 'పాండే, తివారీ, రామసింహ్!' అని కేకలేశాడు. రామసింహుడు పడవమీదినుంచే 'ధర్మావతారా! కొడుకులు అందర్నీ కట్టేశారు' అని జవాబిచ్చాడు.

వ్రజేశ్వరుడు నవ్వి 'చాలా విచారకరమైన విష యమే. మీవంటి వీరుల్ని పప్పన్నం తినకుండా చేశారు. బం

ధించారు పాపం! దొంగలు చాలా అపరాధమే చేశారు. సరే, ఏమీ భయపడకండి, రేపు మీకు పప్పన్నం మోతాదు పెంచిస్తాము' అన్నాడు.

రంగరాజ్ కూడా నవ్వి 'నాఅభిప్రాయంకూడాఅదే. ఇక తలుపు తెరవండి' అన్నాడు.

'నువ్వెవరవు?' అన్నాడు వ్రజేశ్వరుడు.

'నేను దొంగల్లో ఒకడ్ని, తలుపు తెరవమని నా ప్రార్థన.'

'తలుపు ఎందుకు తెరవాలి?'

'మిమ్మల్ని దోచుకుంటాం.'

'నన్నూ ఆసైనికులే అనుకున్నావా? నాచేతిలోజోడు-గుళ్ళబారుంది - సిద్ధంగా వున్నాను. ముందుగా ఎవరొస్తారో, చంపేస్తాను.'

'ఒకమనిషే రాడుగా?ఎందరినని చంపుతారు?మీరూ బ్రాహ్మణులు, నేనూ బ్రాహ్మణుడను. ఒకవిధంగా బ్రహ్మహత్య జరుగుతుంది. వ్యర్థంగా బ్రహ్మహత్యవల్ల లాభం?' అన్నాడు రంగరాజ్.

'లేకపోవచ్చు, నేనే ఆపాపం చేస్తాను' అని వ్రజేశ్వరునిమాట పూర్తవకముందే పక్కనేవున్న వేరొకతలుపును విరగ్గొట్టి దొంగలోనికి ప్రవేశించాడు. వ్రజేశ్వరుడు తుపాకీ మడమతో అతనినెత్తిపై మోదాడు. అతడు వెంటనేస్పృహ తప్పి పడిపోయాడు. ఇంతలో రంగరాజ్ ఎదురుగావున్న తలుపును గట్టిగా రెండు తన్నులుతన్నాడు. తలుపులు విరిగి పోయాయి, రంగరాజ్ లోన ప్రవేశించాడు. వ్రజేశ్వరుడు

రంగరాజ్ కేసి తిరిగి తుపాకిగురిపెట్టాడు. రంగరాజు ముందుకు దూకి తుపాకి లాక్కున్నాడు. ఇద్దరూ సమానబలవంతులే అయినప్పటికీ రంగరాజ్ చాలా చురుకైనవాడు. అప్పుడు వ్రజేశ్వరుడు పిడికిలిబిగించి సత్తువకొద్దీ విసరబోయాడు. రంగరాజ్ అతని చేతిని పైదానినిపైనే గట్టిగాపట్టుకున్నాడు. ఒక మూల ఇంకా ఇతర ఆయుధాలు వ్రేలాడుతున్నాయి. వ్రజేశ్వరుడు చురుకుగా ఒక ఖడ్గాన్నిదూసి నవ్వుతూ రంగరాజ్‌తో 'చూడు ఠాకుర్, నాకు బ్రహ్మహత్య అంటే భయం లేదు' అన్నాడు. అని రంగ్‌రాజ్ పైకి దుమికాడు. అంతలో విరిగిపోయిన వెనుకద్వారంనుంచి అయిదార్గురు దొంగలు లోనప్రవేశించారు. వారు వ్రజేశ్వరుని చేతినుంచి ఖడ్గాన్ని లాగేశారు. ఇద్దరు దొంగలు వ్రజేశ్వరుని చేతులు వెనక్కి విరిచి పట్టుకున్నారు. మరొక దొంగ త్రాడుదీసి 'బంధించాల్సి వుంటుంది' అన్నాడు.

'వద్దు, బంధించవద్దు. ఓటమిని అంగీకరిస్తున్నాను. మీకేం కావాలో చెప్పండి, ఇస్తాను' అన్నాడు వ్రజేశ్వరుడు.

'మీవద్ద వున్న సామానంతా అన్నీ తీసుకువెళ్తాను మొదట. అయితే ఏదైనా కొద్దిగా వదలివెళ్ళేవాడినేమో-కానీ మీ పిడికిలి పడితే నాతల బ్రద్దలైవుండేది - ఇప్పుడిక దమ్మిడీకూడా వదలను' అన్నాడు రంగరాజ్.

'పడవలో ఉన్నంతవరకు అన్నితీసుకువెళ్ళండి, నేనిక అభ్యంతరం కల్గించను' అన్నాడు వ్రజేశ్వరుడు.

వ్రజేశ్వరుడు చెప్పకముందే దొంగలు సామానులు జేరవేయ నారంభించారు. అప్పటికి సుమారు యామైయుంది

దొంగలు పడవమీదికి చేరుకున్నారు. సామాన్లు అంత ఎక్కువేమీ లేవు - దుస్తులు, పూజాపాత్రలు వున్నాయి - అంతే! 'అన్నీ తీసుకున్నారు, ఇక మీదారిని మీరుపొండి, ఇంకా బాధిస్తారెందుకు?' అన్నాడు బ్రజేశ్వరుడు.

'వెళ్తున్నాం, కానీ మీరుకూడా మావెంటరావాలి' అన్నాడు రంగరాజ్.

'ఎందుకు? నే నెక్కడికి రావాలి?'

'మారాణీగారి వద్దకు.'

'మీరాణీ ఎవరు?'

'మా మహారాణీ.'

'ఎవరేమిటి ఆమె? దొంగలకు కూడా మహారాణి వుంటుందా! నే నెప్పుడూ వినలేదే.'

'దేవీరాణీపేరు ఎప్పుడూ విననేలేదా?'

'ఓహో! మీరు దేవీ చౌధరాణి దళంలోనివారా?'

'దళంవమిటి? మేముమహారాణీవారి కార్యకర్తలం?'

'రాణీకి తగ్గ కార్యకర్తలే! కానీ నేను మీరాణీని దర్శించాల్సిన అవసరమేముందీ? నన్ను బంధించి ఏమైనా వసూలు చేయదలచారా ఏం?'

'పడవలో ఏమీ దొరకనేలేదు. మిమ్మల్ని బంధించి వుంచితే ఏమైనా లభించవచ్చు.'

'నాకూ రావాలనివుంది. మీరాణి చూడతగ్గదే నటగా? ఆమె యువతే కదూ?'

'ఆమె మాకుతల్లి. సంతానం తల్లివయస్సును లెక్క వేయరెప్పుడూ.'

'ఆమెచాలా అందంగా వుంటుందటగా?'

'మాతల్లి దేవత సమానురాలు.'

'అయితే దేవిని దర్శిద్దాంపద' అన్నాడు వ్రజేశ్వరుడు.

ఈమాట అని వ్రజేశ్వరుడు రంగరాజ్ వెంట గది నుంచి బయటకువచ్చాడు. పడవమీది నావికులు భయంవల్ల నీళ్ళల్లోకి దూకికారు. వ్రజేశ్వరుడు వారి నుద్దేశించి;

'ఇకమీరు పడవమీదికి వచ్చేయండి. భయపడాల్సిన పనేలేదు. భగవన్నామస్మరణ చేసుకోండి. మీప్రాణమాన ధనగౌరవాలకు ప్రమాదమేమీలేదు. మీరు చాలా తెలివి గలవారు' అనిఅన్నాడు.

నావికులు ఒక్కొక్కరే పడవమీదికి చేరుకున్నారు. వ్రజేశ్వరుడు రంగరాజుతో 'ఇక మాకాపలావారిని వదలి వేయండి' అన్నాడు.

'వదలివేస్తాం కానీ వదలినతర్వాత వారు మాపై ఆక్ర మణ చేసేట్లయితే మీతల నరికేస్తాం. మీరా విషయాన్ని వారితో చెప్పండి' అన్నాడు రంగ్‌రాజ్.

వ్రజేశ్వరుడు వారితో ఆవిషయం చెప్పి, 'మీమౌనానికి బహుమానంగా షప్పన్నంహెచ్చిస్తా'మని వాగ్దానంచేశాడు. తర్వాత అతడు తనజనాన్నుద్దేశించి 'మీరుఇక్కడేవుండండి. ఎక్కడికీ వెళ్ళనూవద్దు, ఏమీ చేయనూవద్దు, నేనిప్పుడేతిరిగి వస్తాను' అని ఆదేశించి రంగరాజువెంట బోటులోకి చేరు కున్నాడు. బోటులోనినావికులుము క్తకంఠంతో 'దేవీరాణీకి జై' అని నినాదించారు. బోటు ముందుకు సాగిపోయింది.

# 5

'నన్నెంతదూరం తీసుకువెళ్తారు? మీరాణీగారుండే దెక్కడ?' అని అడిగాడు బ్రజేశ్వరుడు దారిలో రంగరాజ్‌ను.

'అదుగో, పెద్దపడవ కన్పిస్తుందే, అది ఆమెగారుండే పడవే.'

'ఆపడవా? రంగపురం దోచుకుంటానికి వచ్చినఆంగ్లేయుల పడవనుకున్నాను దానినిచూసి. అంత పెద్దపడవలో ఉంటుందా మీరాణీ?'

'రాణీ అన్నతర్వాత రాణీవలెనే వుండాలి. దానిలో ఏడుగదులున్నాయి.'

'అన్నిగదుల్లో ఎవరుంటున్నారు?'

'ఒకటి రాణీగారి దర్బారుహాలు. ఒకటి ఆమె శయనాగారము. ఒకగదిలో దాసీలువుంటారు, వేరొకటి స్నానానికి, మరొకటి వంటయిల్లు. ఒక సింహద్వారంవుంది. ఈ రాత్రికి మీరక్కడే గడపాల్సి వుంటుందేమో!'

ఇంతలో బోటు పడవచెంతకువెళ్ళి ఆగింది. దేవిరాణీ అంటే దేవీ చౌధరాణి పడవ పయిభాగానలేదు. తన అనుచరులు దోపిడి చేయుచున్నంతవరకు దేవి పయిభాగాన వీణ మీటుతూ కూర్చుంది. ఆమె చాలా పరధ్యానంగా వుండటంవల్ల అపశ్రుతులుకూడా పల్కుతున్నాయి. బోటు సమీపానికి వస్తూవుండటంచూసి దేవిలేచి గదిలోకివెళ్ళిపోయింది. రంగరాజ్ ద్వారంచెంతకు వచ్చి 'రాణిజీకి జై!' అన్నాడు. ద్వారానికి పట్టుపరదావుంది; లోనివేమీ కన్పించటంలేదు. లోనినుంచే దేవి 'ఏమిటి సమాచారం?' అని అడిగింది.

'అంతా శుభమే'

'మీలో ఎవరైనా గాయపడ్డారా?'

'లేదు.'

'వారిలో ఎవరైనా చనిపోయారా?'

'లేదు. మీ ఆదేశానుసారమే పనిజరిగింది.'

'వారి మనుష్యులెవరైనా గాయపడ్డారా?'

'ఇద్దరు కాపలావారికి తేలిగ్గా దెబ్బలుతగిలాయి. కొంచెం చీరుకుపోయింది, అంతే.'

'సామాను?'

'అంతా తెచ్చేశాం. అంత ఎక్కువేమీ లేదు.'

'యజమాని?'

'బాబును పట్టుకు తీసుకొచ్చాం.'

'హాజరు పెట్టండి.'

రంగరాజ్ బ్రజేశ్వరునికి సైగచేశాడు. అతను వచ్చి ద్వారంముందు నిల్చున్నాడు.

'మీరెవరు?' అని అడిగింది దేవి. ఆమెగొంతుస్పష్టంగా లేదు, చలిజ్వరం వచ్చినట్లుగా వుంది.

బ్రజేశ్వరుడు ఎటువంటిమనిషో పాఠకులీపాటికివూహించుకునేవుంటారు. భయమంటే ఏపదార్థంపేరో అతనికి చిన్నతనంనుంచీ తెలియదు. ఏ దేవీచౌధరాణి పేరు విని ఉత్తర బెంగాలంతా భయంతో కంపించిపోయేదో ఆమెఎదుటకువచ్చి అతనికి నవ్వొచ్చింది. 'పురుషులు స్త్రీలకుభయపడ్డారాఎక్కడైనా? స్త్రీపురుషునికి దాసి' అని ఆలోచించాడతను.

అతడునవ్వి 'పరిచయంవల్లమీకువచ్చేలాభమేముంది! మీకు కావల్సింది సాధనం, అది లభించిందిగదా పేరుచెప్తే డబ్బులభించదుగా!' అన్నాడు.

'ఎందుకురాదు? మీరు ఏ హోదాలోని మనుషులో తెలిస్తే డబ్బుకూడా లభించవచ్చు.' అప్పటికీ ఆమెగొంతు కేదో అడ్డంపడ్డట్లువుంది.

'అందుకోసమే నన్ను పట్టితెప్పించారా?'

'లేకపోతే మీతో అవసరమేముంటుంది?'

దేవి పర్దాచాటునవుంది. ఈమాట అని ఆమె కళ్ళు తుడుచుకోటం ఎవ్వరూ చూడలేకపోయారు.

'నేనునాపేరు దుఃఖీరామ్ చక్రవర్తి అని చెప్తేమీరు విశ్వసిస్తారా?' అని అడిగాడు వ్రజేశ్వరుడు.

'విశ్వసించము'

'అప్పుడిక అడగాల్సిన అవసరమేముంది?'

'సరిగ్గాచెప్తారో లేదో చూద్దామని.'

'నాపేరు కృష్ణగోవింద ఘోషాలు.'

'కాదు.'

'దయారామ్ బక్షీ.'

'అదీకాదు.'

'వ్రజేశ్వరరాయ్.'

'కావచ్చు.'

ఇంతలోనే మరొక స్త్రీవచ్చి దేవీరాణివద్దకూర్చుంది. 'నీగొంతు మరీ తగ్గిపోయిందేమిటి?' అని అడిగిందాస్త్రీ నెమ్మదిగా.

దేవి కన్నీరు కట్టలు త్రెంచుకొందిక. వర్షాకాలంలో వికసించిన పుష్పాల్లో నీరు నిలిచి కొమ్మ కదలగానే టపటప చినుకులు రాలసాగుతాయే, అలాగే దేవికన్నులనిండా నీరు నిండివుంది ఇప్పుడిక కొమ్మకదలగానే టపటప రాలసాగాయి చినుకులు. దేవి ఆస్త్రీ చెవిలో మెల్లగా 'నేనిక ఇలానటించ లేను, ఇకనువ్వే మాట్లాడు. అన్నీనీకు తెలిసినవే' అనిఅంది. దేవి ఈమాటచెప్పి మరోగదిలోకి వెళ్ళిపోయింది. ఆస్త్రీ దేవిరాణి పీఠాన్నలంకరించి మాట్లాడసాగింది. పాఠకులకు పరిచితురాలే ఈమె—వివాహం కాని బ్రాహ్మణ స్త్రీ ఆ నిశి.

'ఈపర్యాయం నిజంచెప్పారు, మీపేరు వ్రజేశ్వర రాయ్ అని' అంది నిశి.

వ్రజేశ్వరునికి తల తిరిగిపోయింది. పర్దాలోనికిమాత్రం చూడలేడు, అయినా కంఠస్వరాన్నిబట్టి ఈమె మొదట ప్రశ్నించిన స్త్రీగాదని సందేహం కలిగిందతనికి. ఆ కంఠస్వరం చాలా మధురంగా వినిపించింది. ఇందులో అంతమాధుర్యం లేదు. 'మీకు నన్ను గురించి తెలిస్తే బేరం జరగనివ్వండి, నేను వెళ్ళిపోవాలి. నన్ను ఏషరతుపై విడుదలచేస్తారు?' అని అడిగాడు వ్రజేశ్వరుడు.

'ఒక చిల్లిగవ్వ ఇస్తే వదలివేస్తాం. దగ్గరవుంటే చెల్లించి వెళ్ళిపొండి.'

'ఇప్పుడు లేదే!'

'పడవలోంచి తెచ్చివ్వండి.'

'పడవలో వున్నదంతా మీ మనుషులే దోచుకొచ్చారు, ఇప్పుడిక చిల్లిగవ్వ కూడాలేదు.'

'నావికుల్ని అప్పు అడగండి.'

'నావికులవద్ద చిల్లిగవ్వ వుండదు.'

'అయితే మూవెల చెల్లించే వరకు మీరు ఖైదులో వుండాల్సి వుంటుంది.''

ఇంతలో గదిలో మరొక స్త్రీ 'రాణీగారూ, ఈమనిషి విలువ ఒకచిల్లిగవ్వ అయితే నేనిస్తానుస్వీకరించండి, అతన్ని నాకు అమ్మివేయండి' అని అనటం విన్పించిందివ్రజేశ్వరునకు.

'అభ్యంతర మేముంది! అయినా నువ్వేం చేసుకుం టావ్? బ్రాహ్మణుడు. నీళ్ళు తేడు, కట్టెలూపగలెయ్యడు' అని జవాబిచ్చింది రాణి.

'నావంటమనిషి వెళ్ళిపోయాడు. ఇతడువంటచేస్తాడు' అందాస్త్రీ.

అప్పుడు నిశి వ్రజేశ్వరుణ్ణి సంబోధించి 'మీరు విన్నారా? అమ్మేయబడ్డారు–నాకు చిల్లిగవ్వ వచ్చేసింది. మీరు మిమ్మల్ని కొన్నవారివెంట వెళ్ళండి - వంటచేయా ల్సివుంటుంది' అని అంది.

'ఆమె ఎక్కడ?' అని అడిగాడు వ్రజేశ్వరుడు.

'స్త్రీ, బయటకురాజాలదు; మీరే లోనికిరండి' అని అంది నిశి.

## 6

అనుమతి లభించగానే వ్రజేశ్వరుడు పరదాతొలగించి గదిలోకిప్రవేశించాడు. అక్కడి అలంకరణనుచూసి అతనికి చాలా విస్మయంకల్గింది. గదిగోడలపై అందమైనచిత్రాలు

వ్రాయబడివున్నాయి. శుంభ, నిశుంభులయుద్ధము, మహిషాసురమర్దనము,దశావతారాలు, అష్టనాయికా,సప్తమాత్రికా, దశమహావిద్యలు, కైలాసము,బృందావనము,లంకాపురము, ఇంద్రసభ, వస్త్రాపహరణము మొదలగు చిత్రాలున్నాయి. నాలుగు అంగుళములదళసరితివాచిపరిచివుంది. దానిపైకూడా రకరకాలచిత్రాలున్నాయి.ఆతివాసీపై ఒకసింహాసనమువుంది. సింహాసనంపై పూలమఖమలుపరుపు, మూడు ప్రక్కల అదే విధమైన తలగడాలున్నాయి. ఎదురుగా స్వర్ణ అత్తరుపేటిక, పన్నీరుబుడ్డి, పూలకూజావున్నాయి. పూలకూజాలో వివిధ సుగంధపుష్పాలున్నాయి.ఒకప్రక్క బంగారుహుక్కావుంది. హుక్కాగొట్టానికి ముత్యాలజాలరు వ్రేలాడుతోంది. హుక్కా కస్తూరిమిళితమైన తంబాకు నింపివుంది; ఇరుప్రక్కలరెండు వెండిదీప స్తంభాలున్నాయి. దేవకన్యలవెండివిగ్రహాలతలలపై రెండుసుగంధదీపాలు వెలుగుతున్నాయి. పైనుంచిఒకబంగారు గొలుసుకుచిన్నదీపం వ్రేలాడుతోంది. నాల్గుమూలలాదీపాలు పట్టుకొనివున్న నాల్గువెండిబొమ్మలున్నాయి. సింహాసనంపై ఒకస్త్రీకూర్చొనుంది. ఆమెముఖమండలంపై జరీవున్నఢక్కా మల్లురుమాలుకప్పివుంది. అందువల్ల ముఖం సరిగా కన్పించటంలేదు. కానీ మిలలమెరిసే బంగారుదేహచ్ఛాయ, నల్లని వుంగరాలజుత్తుమాత్రం చూపుల్ని ఆకర్షిస్తూనే వున్నాయి. కర్ణాభరణాలు అగ్నిశిఖవలెఎర్రగామెరిసిపడుతున్నాయి,విశాలమైనఆమెనేత్రాలు అంతకంటే తీక్షణంగాచూస్తూన్నాయి.

వ్రజేశ్వరుడు ప్రవేశించి 'రాణీగారిని ఏవిధంగా ఆశీర్వదించమంటారు?' అని అడిగాడు.

'నేను రాణీనికాను' అని జవాబిచ్చిందా సుందరి.

ఇంతవరకు తనతో మాట్లాడిన స్త్రీ ఒకంత స్వరంకాదని ప్రజేశ్వరుడు గ్రహించాడు. అయితే అవనూవచ్చు, ఎందుచేతంటే ఆస్త్రీ గొంతుమార్చి మాట్లాడటం స్పష్టంగా కనిపిస్తూనేవుంది. దేవి చౌధరాణి ఇంత మాయావిని కాకపోతే ఇన్ని బందిపోట్లు చేయనేలేదని అతడాలోచించాడు. 'ఇంతవరకు నే నామెతోనే మాట్లాడుతున్నానే, ఆమె ఎక్కడికి వెళ్ళింది?' అని అడిగాడతను.

'నువ్వు లోనికివచ్చుటకు అనుమతినిచ్చి ఆమె నిద్రపోవుటకు వెళ్ళిపోయుంది. ఆమెకు నువ్వు చెప్పాల్సిందేమైనా వుందా?' అని అడిగిందా సుందరి.

'మరి నువ్వెవరు?'

'నేను నీయజమానురాలను.'

'నాకు యజమానురాలవా?'

'అవును, ఇప్పుడేగదా నిన్ను చిల్లిగవ్వ ఇచ్చి కొన్నాను!'

'సరే అయితే. మరి నిన్నేమని ఆశీర్వదించాలి?'

'ఆశీర్వాదానికి కూడా అనేక పద్ధతులుంటాయా.'

'అవును. అది స్త్రీల విషయంలో వుంటుంది. పుణిస్త్రీని ఒకవిధంగా, వితంతువును ఒకవిధంగానూ, పుత్రవతిని మరొకవిధంగానూ—'

"త్వరగా చావమని ఆశీర్వదించు నన్ను."

"ఆవిధంగా నేనెవర్నీ ఆశీర్వదించలేను. నువ్వునూట మూడుసంవత్సరాలు దివ్యంగా బ్రతకాలి."

"నావయస్సు ఇప్పుడు పాతిక సంవత్సరాలు. మిగిలిన 78 ఏండ్లు నువ్వు నాకు వంచేసిపెడ్తావా?"

"ముందు ఒకరోజు చేసిచూస్తాను; తర్వాత నువ్వు చేయించుకోగలిగితే 78 ఏండ్లు చేస్తాను."

"కూర్చో! నువ్వేవంటలు చేయగలవో చెప్పు."

ప్రజేశ్వరుడు తివాసీపైకూర్చున్నాడు. "నీపేరేమిటి?" అని అడిగింది సుందరి.

"అది మీ అందరికీ తెలిసినదే. నాపేరు ప్రజేశ్వరుడు. నీపేరేమిటి? నువ్వలాగొంతునొక్కి మాట్లాడతావెందుకు? నాతో ఇంతకుముందెప్పుడైనా పరియచముందా?"

"నేను నీకు యజమానురాలిని. నన్ను నువ్వు, "అండి" "అమ్మా" "చిత్తం," అనిమాట్లాడాలి."

"చిత్తం! ఇక అలాగేమాట్లాడతాను. మీపేరేమిటి?"

"నాపేరు పాంచ్ కౌడి. నువ్వు నానౌకరువు గనుక నన్ను పేరుపెట్టి పిలవకూడదు. నీకు ఇష్టంలేకపోతే నేనుకూడా నిన్ను పేరుతో పిలవను."

"మరి మీరెలా పిలిచినప్పుడు నేను 'చిత్తం' అనాలి"

"నేను నిన్ను రామధన్ అనిపిలుస్తాను. నువ్వునన్ను 'అమ్మగారూ' అని పిలవాలి. ఇప్పుడిక నీపూర్తి వివరాలేమిటో చెప్పు. నీదేవూరు?"

"ఒక్క ఓల్లిగవ్వతోనేగదా మీరునన్ను కొన్నది, అందుకు ఇంత వివరాలెందుకు?"

"అయితే చెప్పవద్దు. రంగరాజును అడిగి తెలుసుకుంటాను. బ్రాహ్మణుల్లో ఏశాఖ నీది?"

"ఏశాఖైతేనేం – నా చేతివంట తింటారుగదా!"

"నువ్వు మాశాఖవాడివి కాకపోతే నీచేతివంట తినం. అప్పుడు నీకు మరోకపని ఒప్పగిస్తాం."

"మరోక పనిఏది?"

"ఏముంటుంది, కట్టెలు కొట్టటం, నీళ్ళుతేవడం, చెయ్యాలంటే పనులకేం తక్కువ?"

"నేను రాఢీయుణ్ణి."

"అయితే నువ్వు కట్టెలుకొట్టటానికి, నీళ్ళుమోయటానికే పనికొస్తావ్. మాది బారేంద్రశాఖ. రాఢీయుల్లో నువ్వు కులీనుడవేనా?"

"ఈవివరాలన్నీ ఎందుకు? ఇటువంటివి, వివాహసమయాల్లోమాత్రమే అవసరమవుతాయి. నాకు పెండ్లిచేయ దలచారాఏం? నాకు వివాహమైంది."

"వివాహమైయిందా? ఎన్నివివాహాలయాయి?"

"నీళ్ళు మోయమంటే మోస్తాను, ఈవివరాలన్నీ మాత్రం చెప్పను."

పాంచకొడీ రాణినిపిలిచి "రాణీజీ! ఈ బ్రాహ్మణుడు మొండివాడుగా నున్నాడు. అడిగినదానికి జావాబే చెప్పటం లేదు" అని చెప్పింది.

"బెత్తంతో నాలుగు తగిలించు" అని జవాబిచ్చింది నిశి మరోగదిలోంచి. వెంటనే ఒకపరిచారిక జవజవలాడే ఒకబెత్తాన్ని అందించింది. పాంచకొడీ పెదవులు బిగబట్టి బెత్తంతో క్రిందకొట్టింది. "చూస్తున్నావా?" అని అడిగింది వ్రజేశ్వరునికేసి చూస్తూ.

ప్రజేశ్వరుడు చిరునవ్వుతో "మీరేదైనా చేయగలరు. ఏమి అడుగుతారో అడగండి" అని అన్నాడు.

"నీ వివరాలడిగి నేను చేసేదేముంది ? నీచేతివంట తినాల్సిన అవసరం లేదు. మరిను వ్యేపనులు చేయగలవో చెప్పు"

"మీ రే శలవీయండి."

"నీళ్ళు మోయగలవా?"

"చేయలేను."

"కట్టెలు కొట్టగలవా?"

"అవీ చేయలేను."

"వెచ్చాలు తేగలవా?"

"అలవాటు చాలా తక్కువ."

"తక్కువంటే లాభం లేదు. విసనకర్రతో విసరటం చేతనవునా ?"

"చేయగల నా పని"

"అయితే ఆపనే చెయ్యి."

ప్రజేశ్వరుడు విసనకర్ర తీసుకొని విసరనారంభించాడు. పాంచకొడి అతనికేసి చూస్తూ "కాళ్ళుపట్టటంకూడా తెలుసునా నీకు?" అని అడిగింది.

ప్రజేశ్వరుడు దూరదృష్టిగలవ్యక్తి. పాంచకొడి ఇంత చంచలంగా వుండటంచూసి అతనికి రసికత స్ఫురించింది. ఈ దొంగల సర్దారులను సంతోష పర్చగలిగితే విడుదలపొందవచ్చుననే అభిప్రాయంకూడా కలిగింది. "మీవంటి సౌందర్యవతుల కాళ్ళుపిసకటం నాఅదృష్టమే" అన్నాడు.

"అయితే నాకాళ్ళుపిసుకు" అని పారాణి పూసిన తన కాళ్ళను పాంచకౌడి ప్రజేశ్వరుని తొడపైపుంచింది.

ఇకతప్పేదిలేదు, తనంతతానుగా కొని తెచ్చుకున్నాడా పనిని. వివశుడై రెండుచేతులతో ఆమెకాళ్ళు పిసకసాగాడు.

"ఈపనేనుంత మంచిదికాదు. దీనికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలిముందు ఇక్కడినుంచి తప్పుకుబయటపడాలిగా" అని ఆలోచించుకోసాగాడు.

ఇంతలో ఆ దుష్టపాంచకౌడి రాణిని కేకేసి "రాణీ గారూ! ఒకసారిటు రండి" అంది.

రాణీగారి పాదధ్వని విని ప్రజేశ్వరుడు ఆమెకాళ్ళను తన తొడమీది నుంచి తీసివేశాడు. పాంచకౌడినవ్వి "అదే మిటీ? పారిపోతా వెందుకు?" అని అడిగింది.

ఈపర్యాయం పాంచకౌడి గొంతుమార్చి మాట్లాడ లేదు. "ఇదెక్కడో విన్నగొంతు" అని ప్రజేశ్వరునికి చాలా విస్మయం కల్గింది. అతడు ధైర్యంచేసి పాంచకౌడి ముఖం మీదవున్న రుమాలును లాగవేశాడు. పాంచకౌడి పకపకా నవ్వేసింది. ప్రజేశ్వరుడు మరింత విస్మయంతో, "ఇదేమిటి? నువ్వా సాగర్?" అన్నాడు.

"అవును, నేనుసాగర్ నే. గంగా, యమున, చెరువు, సరస్సుకాదు, నేను సాక్షాత్తు సాగర్ నే. మీ దురదృష్టం గదూ! పరాయి స్త్రీ అనుకున్నప్పుడు సంతోషంగా కాళ్ళు పిసికారు. తనభార్య కాళ్ళుపిసకమని అడిగినప్పుడు కోపగించు కొని వెళ్ళిపోయారు. సరే, నామాట చెల్లించుకున్నాను, మీమాటకూడా చెల్లిపోయింది. మీరు నాకాళ్ళుపిసికారు.

ఇక నాముఖం చూడవచ్చు. ఇప్పటికి మీపాదాల చెంత స్థానమిచ్చినాసరే, త్యజించినాసరే మీ యిష్టం. నేను నిజమైన బ్రాహ్మణ కన్యననేది చూశారుగదా?"

## 7

వ్రజేశ్వరుడు కాస్సేపటి వరకు స్తబ్ధంగావుండి పోయాడు. చివరకతడు తెప్పరిల్లి "సాగర్, నువ్విక్కడి కెలా వచ్చావ్?" అని అడిగాడు.

'స్వామీ, మీరెలావచ్చారు?' అనిఅడిగింది సాగర్.

'నేను ఖైదీని. నువ్వుకూడా ఖైదీవేనా? నన్ను బంధించి తెచ్చినట్లే నిన్నుకూడా బంధించి తెచ్చారా?'

'నేను ఖైదీని కాదు. నన్నెవరూ బంధించి తీసుకు రాలేదు. నేను నాఇష్టప్రకారం దేవీ చౌధరాణీ సహాయం కోరాను. మీ చేత కాళ్ళుపిసికించుకునేందుకు, దేవీరాణీగారి రాజ్యానికి వచ్చాను.'

ఇంతలో అక్కడికి నిశివచ్చింది. ఆమెధరించిన వస్త్ర భూషణాల తళుకు బెళుకులుచూసి వ్రజేశ్వరుడు ఈమె దేవి రాణియని భావించాడు. అతడు లేచి నిల్చున్నాడు. "బంది పోటులైనంత మాత్రాన స్త్రీలను ఇంతగా గౌరవించా ల్సిన అవసరంలేదు మీరుకూర్చోండి. మేము మీనావపై ఎందుకు దాడిచేశామో ఇప్పుడు తెలిసిందా? సాగర్ యొక్క ప్రతిన నెరవేరింది, గనుక ఇప్పుడిక మీరు మీనావలోకి నిరాటంకంగా వెళ్ళిపోవచ్చు. మీసామానులో ఎవరూ గడ్డి పోచకూడా ముట్టుకోరు; మీసామాన్లన్నిటినీ తిరిగి మీనావ

లోకి పంపుతున్నాను. కానీ ఇప్పుడిక సాగర్‌ను ఏం చేయాలి! తిరిగి తండ్రి ఇంటి కెలా వెళ్తుంది? ఆమెను మీ వెంట తీసుకు వెళ్ళండి. ఈమెకు అమ్ముకుపోయిన దాసులని గ్రహించండి.'

నిశిమాటలు విని వ్రజేశ్వరునికి అంతులేని ఆశ్చర్యం కల్గింది. అతడుచాలా వ్యాకులపడ్డాడు. "అప్పుడు జరిగినదోపిడీ అబద్ధమా! వీరు దొంగలుకారా?" అని ఆలోచించి "మీరు నన్ను తెలివితక్కువ దద్దమ్మనుచేసి ఆడించారు. దేవీ చౌధరాణీ మా నావను దోచుకుందనే భావించాను నేను" అని అన్నాడు.

"నిజమే అది. ఇది చౌధరాణీగారి నావే. దేవీరాణీ నిజంగానే దోపిడీలు చేస్తూవుంటుంది" అని అంది నిశి.

"దేవీరాణీ నిజంగానే దోచుకుంటుందా? అయితే మీరు దేవీరాణీ కాదా?" అని అడిగాడతడు.

"కాదు, నేను దేవీరాణీనికాను. మీరు రాణీజీనిచూడ గోరితే ఆమెగారు దర్శనమివ్వవచ్చు. కానీ ముందుగా నామాటవినండి, మేము నిజంగానే దోపిడీలుచేస్తాము. కానీ మిమ్మల్ని దోచుకునేఉద్దేశం మాకు లేదు. ప్రతిజ్ఞను నెరవేర్చ టమే మావుద్దేశ్యం. మరి ఇప్పుడికసాగర్ ఇంటి కెలా వెళ్లాలి?"

"ఎలా వచ్చింది?"

"రాణీగారి వెంట.."

"నేనూ సాగర్ పుట్టినింటినుంచే వస్తున్నాను, అక్కడ నేను రాణీగారి నెక్కడా చూడలేదే!"

"మీరు బయలుదేరి వచ్చిన తర్వాతనే రాణీగారు అక్కడికి వెళ్ళారు."

"అయితే ఇంత త్వరగా ఇక్కడికెలా చేరుకోగలిగారు?"

"మా నావను మీరు చూశారా - యాభై తెడ్లున్నాయి."

"మరి మీరే ఆమెను పంపి రావచ్చుగదా!"

"అందుకో చిక్కింది. సాగర్ ఎవరితోనూ చెప్పకుండా వచ్చేసింది. ఇప్పుడు వంటరిగా తిరిగి వెళ్తే ఏవేవో ప్రశ్నలడుగుతారు. మీ వెంటగనుక వెళ్తే ఎవరూ ఏమీ మాట్లాడరు."

"అయితే అలాగే చేద్దాం, మీ నావను సిద్ధం చేయండి"

"ఇప్పుడే సిద్ధం చేయిస్తాను" అని నిశి వెళ్ళిపోయింది. అప్పుడికి అక్కడ ప్రజేశ్వరుడు, సాగర్ మాత్రమే వుండిపోయారు.

"సాగర్, నువ్వావిధంగా ఎందుకు ప్రతిజ్ఞ చేశావు?" అని అడిగాడు ప్రజేశ్వరుడు.

సాగర్ చీరతో ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఎంతో ఏడ్చింది - నిశ్శబ్దంగా - వెనకనుంచి దేవీరాణి వింటోనే వుంది.

ఆమె ఏడుపు ఆగగానే "సాగర్, నువ్వు నన్ను వెనక్కి ఎందుకు పిలవలేదు? పిలిస్తే అప్పుడే ఈ తగాదా పరిష్కారమై వుండేదిగా" అని అన్నాడు ప్రజేశ్వరుడు.

ఎంతో నిగ్రహంతో దుఃఖాన్ని దిగమ్రింగి కళ్ళు తుడుచుకొని "కర్మ అనుభవించక తప్పుతుందా! అయినా నేను పిలవలేదే అనుకోండి, మీరు మాత్రం రాకూడదా" అని అంది సాగర్.

"నువ్వు నన్ను తరిమేశావయ్యె, పిలవనిదే యెలా తిరిగి రాను?"

ఈ సంభాషణ ముగిసిన తర్వాత బ్రజేశ్వరుడు "సాగర్, నువ్వు దొంగలవెంట ఎందుకు వచ్చావు?" అని అడిగాడు.

"దేవీరాణి వరసకు నా సోదరి; ఇంతకుముందునుంచీ పరిచయం వుంది. మీరు వెళ్ళిపోగానే ఆమె అక్కడికి వచ్చింది. నేను ఏడుస్తూ వుండటం చూసి 'ఎందుకు అనవసరంగా ఏడుస్తావ్, నీ ప్రియుణ్ణి నేను బంధించి నీముందుంచుతాను, నా వెంట బయలుదేరివచ్చి రెండురోజులుండు' అని అంది. అప్పుడే నేను ఆమెతో కూడా బయలుదేరివచ్చాను. దేవీరాణిని అంతవిశ్వసించటానికి తగిన కారణం వుంది. నేను వచ్చేప్పుడు మీ వెంట వెళ్తున్నానని దాసీతో చెప్పివచ్చాను. మీకోసమే ఈ హుక్కా వగైరాలు ఏర్పాట్లు చేయబడ్డాయి. హుక్కా త్రాగినతర్వాత బయలు దేరండి."

"యజమాని అయినవారు ఏమీ మాట్లాడరేం?" అని అన్నాడు బ్రజేశ్వరుడు.

సాగర్ రాణిని పిల్చింది. రాణీ రాలేదు, నిశి వచ్చింది. ఆమెను చూసి బ్రజేశ్వరుడు "నావ సిద్ధంగా వుంటే మేము బయలుదేరి వెళ్తాం" అని అడిగాడు.

"నావ మీదే. మీరు మా రాణిగారికి వరుసకు బావగారవుతారు. మా యింటికి వచ్చిన బంధువును ఇంతవరకు మేము సత్కరించనే లేదు! పైగా అవమానించాం. అందుకు చాలా విచారిస్తున్నాం. దొంగలయితే ఏం? మేము మాత్రం హిందువులం కాదా?"

"ఇప్పుడేమి చేయమంటారు మరి?"

"ముందు మీరు లేచి సరిగ్గా కూర్చోండి"

అని నిశి సింహాసనం కేసి చూపింది. ప్రజేశ్వరుడు అక్కడే తివాసీమీద కూర్చొనివుండి "ఇక్కడే హాయిగానే వుంది" అని అన్నాడు.

అప్పుడు నిశి సాగర్ నుద్దేశించి "అమ్మాయీ, నీ వస్తువును నువ్వే తీసిసర్దుకో. మేము ఇతరుల వస్తువుల్ని తాకము-రజిత సువర్ణాలు తప్ప" అని అంది.

"అయితే నేను ఇత్తడి, కంచు నన్నమాట."

"నా ఉద్దేశ్యం ప్రకారమైతే పురుషుడు స్త్రీయొక్క పాత్రలు వగైరాలవంటివాడే. అవిలేకుండా సంసారంసాగదు కనుక ఉంచుకోవల్సివుంటుంది. వాటిని కడిగితుడిచి, సర్దేసరికి ప్రాణాలుపోతాయి. ఇదుగో సాగర్, మళ్ళీఎక్కడ మురికవుతాయో; నీ చెంబూ తప్పేలా నువ్వేసర్దుకో."

"మొదటేమో ఇత్తడి, కంచునా! ఇప్పుడేమో చెంబూ తప్పేలానా - బాగుంది వరస. బిందె, కలశం వగైరాల్లో కూడా లెక్కకు రానన్నమాట?"

"మహాశయా, అవన్నీ నాకేం తెలుసు. అటువంటి సంసార విషయాల్ని సాగర్నడుగు."

"పురుషులు నిజంగానే కలశంవంటివారు - సదా అంతశ్శూన్యులు. మావంటి గుణవతులు దానిని పరిపూర్ణంగా నింపుతారు" అంది సాగర్.

"నువ్వు చెప్పింది నిజమేసాగర్, అందుకనే స్త్రీలు వీళ్ళను మెడలో వ్రేలాడగట్టుకొని సంసారసాగరంలో మునుగుతారు; సరే నీకలశాన్ని తీసిసర్దుకో" అని అంది నిశి.

"కలశం తనచోటుకి తానే వెళ్తుంది" అని వ్రజేశ్వరుడు లేచి వెళ్ళి సింహాసనంపై కూర్చున్నాడు. వెను వెంటనే అందమగు వేషభూషణాలు ధరించిన ఇద్దరు దాసీయువతులు సువర్ణ వింజామరములతో ఇరుపార్శ్వములా ప్రత్యక్షమయ్యారు. నీభర్తకు నువ్వే హుక్కా తెచ్చి ఇవ్వమని నిశి సాగర్‌తో చెప్పింది.

సాగర్ వెంటనే లేచివెళ్ళి చిలుమునిండా కస్తూరితో కూడిన పొగాకును నింపి తెచ్చింది. అదిచూచి వ్రజేశ్వరుడు "మరొక హుక్కా గొట్టంవుంటే మార్చి ఇవ్వండి" అని అడిగాడు.

"ఈగొట్టాన్ని ఇంతవరకు ఎవరూ ఉపయోగించలేదు. ఇదికొత్తదే. మాలో ఎవరూ హుక్కా త్రాగరు" అని జవాబిచ్చింది నిశి.

"అయితే మరి హుక్కా ఇక్కడెందుకుంది?"

"దేవీగారి రాణీతనం ప్రదర్శించే అలంకారాలివన్నీ."

"నేనువచ్చేసరికే పొగాకు నింపివుంది, ఎవరికోసం?"

"ఎవరికోసమూగాదు."

సాగర్ భర్తకోసమని ఆహుక్కాను ఆరోజునే తెచ్చి పొగాకు నింపారు. వ్రజేశ్వరుడు పరిశీలనగా చూశాడు. కొత్తదిగానే కన్పించింది. అతడు పొగపీల్చసాగాడు. నిశి సాగర్‌నుద్దేశించి, "ఛీ, నువ్విక్కడేంచేస్తున్నావింకా! పురుషులు హుక్కా త్రాగేప్పుడు ఇల్లువాకిలి అన్ని మర్చిపోతారు. వెళ్ళి తాంబూలంతీసుకురా. చూడు, నువ్వే స్వయంగా చుట్టలుచుట్టి తీసుకురా. చేతనయితే ఏదైనా మంత్రించు" అని అంది.

"తాంబూలం నేనే చుట్టి తెచ్చాను. మంత్రతంత్రాలు తెలిసివుంటే ఈస్థితి ఎందుకొస్తుంది?" అని సాగర్ వివిధ సుగంధ ద్రవ్యములు వేసి చుట్టిన తాంబూలములను తెచ్చింది. అప్పుడు నిశి ఆమెను చూసి "భర్తతో చాలా పోట్లాడావు, ఇక వెళ్ళి కొద్దిగా ఫలహారం తీసుకురా" అని అంది.

వ్రజేశ్వరుని ముఖం వాడిపోయింది, "అమ్మబాబో! ఇంత రాత్రప్పుడు ఫలహారమా, క్షమించండి" అన్నాడు.

కానీ అతనిమాటను ఎవరూ విన్పించుకోలేదు. సాగర్ వెంటనేలేచి వెళ్ళి ప్రక్కనేవున్న గదిని ఊడ్చి పీట వేసింది. తిను పదార్థాలుంచిన నాల్గుపళ్ళేలను తెచ్చి అక్కడవుంచింది. సువర్ణ పాత్రతో సుగంధజలాన్నుంచింది. అప్పుడు నిశి అక్కడికి వచ్చి "లేవండి" అంది వ్రజేశ్వరునితో.

వ్రజేశ్వరుడు తొంగిచూచి నిశికి నమస్కరిస్తూ "దోచుకొని నన్ను బంధించారు, ఈదుండగాన్నైతే సహించాను కానీ అర్ధరాత్రప్పుడు ఈఘోరాన్ని భరించలేను - నేను మరొకపర్యాయం కూడా చెప్పుకునేదిదే" అన్నాడు.

కానీ స్త్రీలు అతనిమాటను పాటించలేదు, తప్పనిసరిగా వ్రజేశ్వరుడు ఎంగిలిపడాల్సివచ్చింది.

"భోజనం పెట్టిన తర్వాత బ్రాహ్మణులకు దక్షిణ ఇవ్వాలి" అని అంది సాగర్ నిశితో. అందుకు నిశి జవాబుగా "దక్షిణ విషయం రాణీగారు స్వయంగా చూస్తారు" అని చెప్పి వ్రజేశ్వరుణ్ణి మరోగదిలోకి తీసుకు వెళ్ళింది.

# 8

నిశి ప్రజేశ్వరుణ్ణి దేవీరాణియొక్క శయనాగారం లోకి తీసుకువెళ్ళింది. శయనాగారం కూడా దర్బారుహాలు వలె అలంకరించివుండటం ప్రజేశ్వరుడు గమనించాడు. ఒక ప్రక్కగా బంగారు రేకు వేయబడ్డ మంచంవుంది. దానికి ముత్యాల జాలరు వేయబడివుంది. కాని ప్రజేశ్వరుని దృష్టి వీటిపయి లేదు. అతను ఈఅపారసంపదకు యజమానురాలైన స్త్రీని చూడగోరి వచ్చాడు. ఒక ప్రక్కగా జల్లపం ముసుగువేసుకొనిన ఒకస్త్రీ కూర్చొనివుంది. నిశి, సాగర్‌లోవున్న చంచలత్వం ఈమెలో అతనికి కన్పించలేదు ఈమెధైర్యంగా స్థిరభావంతో, సిగ్గుతో తలవంచుకొని కూర్చొనివుంది. నిశి, సాగర్లవలె ఈమెరత్నాభరణాలనుఅలంకరించుకోలేదు. దేవీరాణిప్రజేశ్వరుని కలుసుకొనుటకు బహుమూల్య వస్త్రాభరణాలను ధరించిందని మేము మొదట చెప్పాము. కాని అది నిశి బలవంతంపయి జరిగింది. కాని తరువాత ఆమె ఈ మాయాజాలం తుచ్ఛమైనదని భావించి సాధారణమైన ముతకబట్టలు ధరించింది. ప్రజేశ్వరుడు ఆగదిలోనికి వెళ్ళగానే నిశి వెళ్ళిపోయింది. దేవీరాణి లేచినిలబడి ప్రజేశ్వరునకు నమస్కరించింది. ప్రజేశ్వరునకు మరింత ఆశ్చర్యం కల్గింది. మరింకెవ్వరూ ఈవిధంగా నమస్కరించి వుండలేదు. తనఎదుట నిల్చొనివున్న విగ్రహం సాక్షాత్తు దేవతామూర్తియని భావించాడతను. ఇటువంటి విగ్రహాన్నతను అంతకు ముందెప్పుడో ఒక పర్యాయం చూశాడు. ఆ విగ్రహం ఇంతకంటే మధురంగావుంది. అందుకుకారణం ప్రజేశ్వరుడు అప్పుడునూనూగు

మీసాల నూత్నయవ్వనంలో వున్నాడు. అప్పటి విగ్రహం కూడా బాలిక. ఈముఖాన్ని చూసి అతనికి ఆ విగ్రహం గుర్తుకొచ్చింది. ఈముఖానికీ ఆముఖానికీ పోలికవుందా? పూర్తిగావున్నట్టేవుంది. రెప్ప వేయకుండా చూడసాగాడు ఆమె ముఖంలోకి. కానీ ఆమె ఏనాడో చనిపోయింది. అప్పు డప్పుడు మనిషికి ఒక్కొక్కరి ముఖంచూస్తే మరొకరు గుర్తు రావటం జరుగుతూవుంటుంది. ఏం, వ్రజేశ్వర మహాశయా, అంతేగదూ?

ఈపోలికనుచూసి వ్రజేశ్వరునికి దుఃఖం ముంచుకొచ్చి నది, కనుకొలకుల్లో వచ్చిన కన్నీరు అక్కడే ఆగిపోయింది. అందుకనే దేవీరాణీ ఈవిషయాన్ని గమనించలేక పోయింది. గమనించివుంటే ఇవాళ ఏంప్రళయం జరిగేదో ఏమో, రెండు మేఘాల్లోనూ విద్యుత్ శక్తి నిండివుం దివాళ.

నమస్కరించి ఆవిధంగానే తలవంచుకొని దేవీరాణి 'నేను మీకివాళ చాలా కష్టంకల్గించాను. అందుకు కారణ మేమిటో మీరెరుగుదురు. నాఅపరాధాన్ని మన్నించండి' అనిఅంది.

'మీరు నాకు ఉపకారమే చేశారు' అనిజవాబిచ్చాడు వ్రజేశ్వరుడు. అంతకుమించిమాట్లాడే శక్తికూడా లేదతనిలో.

'మీకుదయయుంచి మాఆతిథ్యాన్ని స్వీకరించారు, ఇది నాకెంతో గౌరవకారణం మీరు కులీనులు, మీమర్యాద నుకాపాడటం మావిధి. మీరు మాసంబంధీకులు. నేనిచ్చే దక్షిణను దయతో స్వీకరించండి' అనిఅంది దేవీరాణి.

'స్త్రీకి మించినధనం మరేముంటుంది? మీరునాకు ఆ ధనాన్నే ఇచ్చారు, అంతకంటే మించినది మరేమిస్తారు?' అన్నాడు ప్రజేశ్వరుడు.

అయ్యో ప్రజేశ్వరా! నువ్వన్నమాటఏమిటి? స్త్రీకిమించినధనం ఏముంటుంది. ఆనాడు తండ్రికొడుకులుకలసి ప్రఫుల్లనెందుకు తరిమేశారు వారి?

మంచంచెంతఒక వెండికలశంవుంది. దానిని ప్రజేశ్వరుని ముందుంచుతూ 'మీరు దీనినిస్వీకరించాలి' అంది దేవీరాణి.

'మీనావలో వెండిబంగారాలు వెదజల్లినట్లున్నాయి. నేనీకలశాన్ని తీసుకొననిచో సాగర్‌కు కోపంరావచ్చు. కానీ ఒకమాట—'

దేవీరాణి ఆమాటనుగ్రహించి 'ఇదిదొంగసొత్తుకాదని నేను ప్రమాణంచేసి చెప్తున్నాను. నాకు స్వంతఆస్తి కూడా చాలావుందని మీరు వినేవుంటారు. మీరేమీ సందేహించనవసరంలేదు' అని చెప్పింది.

ప్రజేశ్వరుడు అందుకుఅంగీకరించాడు. కులీనబ్రాహ్మణబిడ్డ, ఉపాధ్యాయుడు పీటోకలిచ్చినా, దక్షిణయిచ్చినా స్వీకరించటానికి సంకోచించేవాడు కాదు – కలశం చాలా బరువుగాకన్పించింది. ప్రజేశ్వరుడు తేలిగ్గాదానినికదిలించలేకపోయాడు, ఈకలశం నిండుగావుందా ఏం?' అనిఅడిగాడు.

'పూర్తిగానిండుగా లేదు ఇక్కడవుంచేముందు ఖాళీవున్నట్లు ధ్వనివచ్చింది.'

'ఇందులో ఏముంది?'

ప్రజేశ్వరుడుకలశంలో చెయ్యివుంచిచూశాడు- దాని నిండా మొహరీలున్నాయి. 'వీటిని ఎక్కడవుంచమంటారు?' అని అడిగాడు.

'అవన్నీ మీకిచ్చేస్తున్నాను.'

'ఏమిటీ?'

'ఎందుకని?'

'ఈమొహరీలెన్ని?'

'33 వందలు.'

'33 వందలమొహరీలా! అంటేయాభై వేలరూపాయల కంటే అధికమే. సాగర్ మీతో డబ్బునుగురించి ఏమైనా చెప్పిందా?'

'మీకిప్పుడు యాభై వేలరూపాయలు చాలా అవసర మనిసాగర్ ద్వారా విన్నాను'

'అందుకని ఇస్తున్నారా?'

'ఈధనం నాదికాదు, దానంచేసే అధికారమూనాకు లేదు. ఈధనందైవానిది, నాఅధీనంలోవుంది, అంతే ఆదైవ ధనంనుంచి ఈడబ్బును మీకు అప్పుగా ఇస్తున్నాను.'

'డబ్బునాకుచాలాఅవసరమే దీనికోసందొంగతనం, దోపిడిచేయాల్సివచ్చినా నాకుపాపం అంటదు. ఇదిలేకపోతే నాతండ్రి ప్రాణాలుదక్కవు. నేనీడబ్బుతీసుకుంటాను, ఎప్పటి లోగా దీనినితీర్చాలి?'

'దైవసంపద దైవానికి లభిస్తేఅంతేచాలు! నామృత్యు సమాచారం విన్నతర్వాత దీనికివడ్డీగా ఒకమొహరీని కలిపి దైవసేవలో ఖర్చుచేయండి.'

'అది నేను ఖర్చుచేసినట్లే అవుతుంది. మిమ్మల్ని మోసగించటమేగదా అది. నేనది అంగీకరించను.'

'అయితే మీయిష్టంవచ్చిన రీతిని చెల్లించండి.'

'డబ్బుసమకూడగానే మీవద్దకుపంపగలను.'

'మీమనుష్యులెవరూ నావద్దకురా వీలులేదు.'

'అయితే నేనే సుకువతీస్తాను.'

'ఎక్కడికని తెస్తారు? నేనొకచోటఅంటూ స్థిరంగా వుండను.'

"మీరుచెప్పిన చోటుకితెచ్చి ఒప్పగిస్తాను."

"మీరు ఎప్పటికి ఇవ్వగలరో నిర్ణయించుకుంటే స్థలం నేను చెప్తాను."

"నాకు ఫాల్గుణ మాసాల్లోనే డబ్బు అందుతుంది. అయినాసమయంకొంచెం ఎక్కువకోరటమేనుంచిది. వైశాఖ మాసంలో మీడబ్బుసర్దగలను."

"వైశాఖశుద్ధ సప్తమినాటిరాత్రిడబ్బుతీసుకొని ఇక్కడికేరండి. సప్తమినాడు చంద్రుడు అస్తమించేవరకు నేనిక్కడ వేచివుంటాను. చంద్రాస్తమయంతర్వాత వస్తే నన్ను కలుసుకోలేరు."

ప్రజేశ్వరుడు అందు కంగీకరించాడు: ఆ కలశాన్ని నావపైకి చేర్చవలసిందని దేవీరాణిపరిచారికలకాదేశించింది. ప్రజేశ్వరుడుకూడా ఆమెనుదీవించి తన నావపైకి వెళ్ళటకు లేచాడు. అప్పుడు దేవీరాణిఅతనినిఆపి "ఇదిఅప్పుగాఇచ్చాను. ఇంకా నేను మీకు దక్షిణ నివ్వలేదుగా!" అనిఅంది.

"కలశం దక్షిణేగా!"

"అది మీకు తగినదికాదు."

ఈమాట అని దేవీరాణి తన వ్రేలికివున్న ఉంగరాన్ని తీసింది. వ్రజేశ్వరుడు సంతోషంగా దానిని స్వీకరించుటకు చేయిచాచాడు. కాని దేవీరాణి ఉంగరాన్ని అతనిచేతికి అందించలేదు. ఆమె స్వయంగా వ్రజేశ్వరునిచేతిని పట్టుకొని ఉంగరాన్ని వ్రేలికి ధరింపజేసింది.

వ్రజేశ్వరుడు జితేంద్రియుడైనప్పటికీ అతని హృదయం ఎలావుందో కూడా గ్రహించలేకపోయాడు అంతరంగంలో అమృతధార ప్రవహించినట్లుంది. జితేంద్రియుడైన వ్రజేశ్వరుడు చేతిని వెనక్కితీసుకోటంకూడా మర్చిపోయాడు. అదేసమయాన రెండు వెచ్చని నీటిబిందువులు వ్రజేశ్వరుని చేతిపైపడ్డాయి; దేవీరాణి ముఖం కన్నీటితో తడిసిపోయి వుండటం వ్రజేశ్వరుడు గమనించాడు. ఏం జరిగిందో ఏమో, వ్రజేశ్వరుడు జితేంద్రియుడైనప్పటికీ అతని మనోస్థితిని అతడే గమనించ లేకపోయాడు. ఆనాటిముఖం గుర్తొచ్చిందతనికి. ఆనాటిరాత్రి ఆముఖంకూడా ఈవిధంగానే కన్నీటితో తడిసి పోయింది. ఆ కన్నీటిని తాను తుడిచిన విషయంకూడా గుర్తొచ్చింది. వ్రజేశ్వరుడు వెనకముందు ఏమీ ఆలోచించకుండా అప్రయత్నంగా దేవీరాణి భుజంపై చెయ్యివేశాడు, రెండో చేతితో ఆమెముఖాన్ని పైకెత్తి పరిశీలనగా చూశాడు. ప్రఫుల్లముఖం మాదిరిగా నేవుంది. వ్రజేశ్వరుడు తనను తాను మరచి అశ్రుసిక్తమైన పెదవులపై "ఛీ! వ్రజేశ్వర్! మళ్లీనా!"

అకస్మాత్తుగా మిన్నువిరిగిమీదపడినట్లయింది. ఏమిటి తాను చేసేదేమిటి? ఈమె ప్రఫుల్లముఖియా? ఆమెఏనాడో

పదేండ్లకు పూర్వమే మరణించింది. అతడు ఒక్కపరుగులో తన నావమీదికి చేరుకున్నాడు. సాగర్‌ను వెంటతీసుకు వెళ్ళటం కూడా మర్చిపోయాడు. "పట్టుకోండి! పట్టుకోండి! ఆసామిపారిపోతున్నాడు" అనికేకలేస్తూ సాగర్ కూడా నావ లోకి వెళ్ళింది. ఆనావద్వారా అతని అమూల్యసంపదలైన సాగర్, ధనకలశాలను వ్రజేశ్వరుని నావలోకి చేర్చారు. ఇక్కడ నిశి దేవీరాణిగారి శయనాగారంలోకి వచ్చి చూ సింది. ఆమె నావచెక్కలపై పడివుంది. నిశి రాణిసపర్యౌ చ నచేసి కన్నీరు తుడిచి స్వస్థత చేకూర్చింది.

"ఇదేనా నీనిష్కామధర్మము? ఇదేనా నీసన్యాసము? ఇప్పుడు నీభగవద్వాక్యమెక్కడికిపోయింది?" అనిఅడిగిందినిశి.

దేవి ఏమీమాట్లాడలేదు. "ఇటువంటి వ్రతంస్త్రీలకు పనికిరాదు. ఒకవేళ స్త్రీలు ఇటువంటి వ్రతాన్ని నిర్వహిం చాలంటే నావలెవుండాలి. నన్ను ఏడ్పించటానికి వ్రజేశ్వరు లెవరూ లేరు. నాకువ్రజేశ్వరుడు, వైకుంఠేశ్వరుడూ ఇద్దరూ ఒకరే" అనిఅంది నిశి.

దేవి కన్నీటిని తుడుచుకుంటూ "నువ్వు యమధర్మ రాజు ఇంటికివెళ్ళు" అని అంది.

"అందుకు నాకేమీఅభ్యంతరంలేదు. నాపై యమ ధర్మరాజుకు అధికారమేమీలేదు. నువ్విక సన్యాసంవదలి ఇంటికివెళ్ళు."

"ఆమార్గమే దొరికితే ఇటు వచ్చేదానినేకాదు. మన నావను వదలమని చెప్పు ఇక. నాలుగుతెరచాప లెత్తండి."

వెంటనే నాలుగు తెరచాపలు విప్పుకొని నావ పక్షి చందాన ఎగిరిపోయింది.

## 9

వ్రజేశ్వరుడు తన నావలోకి తిరిగివచ్చి చాలా గంభీరంగా కూర్చున్నాడు, సాగర్‌తో కూడా మాట్లాడటంలేదు. దేవిరాణి యొక్క నావ పక్షిచందాన రివ్వున దూసుకు పోవటం అతడు గమనించాడు. అప్పుడతడు సాగర్‌నుద్దేశించి 'ఆనావ ఎక్కడికిపోయింది?' అని అడిగాడు.

'ఆవిషయం దేవీరాణికి తప్ప అన్యులెవ్వరికీ తెలియదు. ఆమె ఎవ్వరికీ చెప్పదుకూడాను.'

'ఇంతకూ దేవీరాణీ ఎవరు?'

'దేవిరాణీ దేవియే.'

'నీ కేమవుతుంది?'

'అక్కగారు.'

'ఎలాంటి అక్కగారు?'

'బంధుకోట్యా.'

వ్రజేశ్వరుడు మౌనం వహించాడు. అతడు నావికుల్ని పిలిచి 'ఆనావను వెంబడించి పోగలరా' అని అడిగాడు. అది అసంభవమని తెలిపారువారు. అదిరాలిన నక్షత్రంవలె రివ్వున దూసుకుపోతోంది. వ్రజేశ్వరుడు మరేమీ మాట్లాడలేదు. సాగర్ నిద్రపోయింది.

తెల్లవారి, సాగర్ వున్న నావబయలుదేరింది. సూర్యోదయమైన తర్వాతసాగర్ వ్రజేశ్వరునిచెంతకువచ్చికూర్చుంది.

'దేవి దోపిడీలు చేస్తుందా?' అని అడిగాడు.

'మీ రేమనుకుంటున్నారు?'

'దోపిడి చేయటానికి కావల్సిన హంగులన్నీ వున్నయ్. చేయాలంటే చేయగలదుకూడాను. కానీ ఆమె దోపిడీలు చేస్తుందంటే నమ్మకం కలగటంలేదు.'

'ఎందుకని నమ్మలేకపోతున్నారు?'

'ఎందుకనో తెలియదు. అయినా దోపిడీలు చేయనిదే ఇంతధనం ఎక్కడినుంచి వచ్చింది?'

'దేవుని వరంవల్లనే దేవికి ఇంతధనం లభించిందని కొందరంటారు. భూమిలో గుప్తధనం లభించిందని కొందరంటారు. దేవికి బంగారం తయారుచేయుట తెలుసునని కొందరుచెప్తారు.'

'ఈ విషయాన్ని గురించి ఆమె ఏమంటుంది?'

'నాదేమీలేదు, అంతా ఇతరులదే అంటుందిఆమె.'

'ఇతరులదైతే ఇంతధనం ఎలావచ్చింది?'

'నాకేం తెలుసు?'

'పరాయి ధనం మీద ఇంత గొప్పతనం చేస్తుందికదా, అసలు యజమాని ఏమీ అనడా?'

'దేవి గొప్పతనానికిపోదు, ఆమెనిద్రించేది నేలమీద, ధరించేది ముతకబట్టలు; నిన్నమీరు చూసిన అలంకారమంతామీకోసం చేయబడినఏర్పాట్లే! అదిఏమిటిమీకు వేలికి?'

'నిన్న దేవియొక్క నావలో ఫలహారం చేశానుగదా; అందుకని ఈ ఉంగరాన్ని దక్షిణగా ఇచ్చింది.'

'ఏదీ చూద్దాం.'

బ్రజేశ్వరుడు ఉంగరాన్ని తీసి సాగర్ చేతికిచ్చాడు. సాగర్ దానిని అటుఇటు త్రిప్పిచూసి 'దీనిమీద దేవీ చౌధరాణీ పేరుపుందే!' అని అంది.

'ఎక్కడ?'

'లోపలభాగాన -- పారసీభాషలో.'

వజేశ్వరుడు దానిని చదివి 'అరే ఇదేమిటి? ఇది నా పేరు. ఇది నాఉంగరమే. సాగర్, నిజం చెప్పు, నామీదబెట్టు దేవి ఎవరు?'

'మీరు గుర్తించలేకపోతే అందుకు నాతప్పేముంది? నేనొక క్షణకాలంలోనే గుర్తించాను.'

"ఎవరామె? దేవి ఎవరు?"

"ప్రఫుల్ల"

బ్రజేశ్వరుడు మౌనం వహించాడు. మొదట అతని శరీరం ముకుళించుకుపోయినట్లున్నా తరువాత ఒక అపూర్వ ఆనందచిహ్నం అతనిదేహంలో ప్రతిఫలించటం సాగర్ గమనించింది. అతనిముఖం దీప్తిచెందింది, కన్నులు మెరిశాయి. కన్నీరు తొణికింది. కానీ వెనువెంటనే ఆ భావములన్నియు మటుమాయమైపోయాయి. ఆనందానికి బదులు ఘోర విషాదంలో పడిపోయాడు. బ్రజేశ్వరుడు కదలకుండా సాగర్‌కేసి చూస్తూ నెమ్మదిగా కళ్లు మూసుకున్నాడు. ఆమె ఒడిలో తలపెట్టి పడుకున్నాడు. సాగర్ జాలిపడి ఎంతగానో అడిగింది, కానీ జవాబేమీరాలేదు. బ్రజేశ్వరుడు ఒక్కసారి మాత్రం 'ప్రఫుల్ల బందిపోటా - ఛీ!' అన్నాడు.

# 10

132

వర్మేశ్వర, సాగరులను సాగనంపిన తర్వాత దేవి నావలో బల్లపై చాపపర్చుకొని పడుకొంది. ఆమె శరీరంపై ముతకదుస్తులు, చేతికిసౌభాగ్యచిహ్నం మాత్రమేవున్నాయి. ఆ ఢకాచీర, బంగారము, వజ్రవైఢూర్య మరకత మాణిక్యాలన్నీ అదృశ్యమైపోయాయి. రాణిపడుకొంది కానీ నిద్ర వచ్చిందో లేదో కూడా తెలియదు.

ఉదయమయ్యేసరికి నావ తనగమ్యస్థానానికివచ్చి తీరానికి చేరింది. రాణి నావలోంచి దిగి స్నానంచేసింది. ఆమె శరీరంనిండా నదిలోని మట్టిని పూసుకొని జుట్టువిరబోసుకొంది. ఆతడిసినచీరలో ఆమెయొక్క సౌందర్యం, నిన్నరాత్రి వజ్రవైఢూర్యాల్లోకంటే అధికంగావ్యక్తమైంది. నిన్న వజ్రవైఢూర్యాల్లో ఆమె మహారాణివలె వుంది - కాని నేటి వేషంలో ఆమె సాక్షాత్తు దేవతవలెవుంది. సహజసౌందర్యవంతులకు మట్టిగాక వజ్రవైఢూర్యాలెందుకు?

అపూర్వమైన ఈవేషంలోనే రాణి ఒక స్త్రీనివెంటనిడుకొని నదీతీరం వెంటనే నడకసాగించింది. నావలోకి వెళ్ళలేదు. కొద్దిదూరంవెళ్ళి ఆమె అడవిలోకి ప్రవేశించింది.

మాటిమాటికి దొంగలు, అడవులవిషయంప్రస్తావించినందుకు, ఇది అతిశయోక్తియని, గానీ లేకపోతేదొంగలన్నా, అడవులన్నా ఇష్టమనో పాఠకులు భావించరాదు. ఈకథాకాలమందు మనదేశంనిండా అడవులే! ఇప్పటికీ బెంగాలులో అనేక అరణ్యాలున్నాయి. ఇక ఆకాలంలో దొంగల్నిగురించిచెప్పా

ల్సినపనేలేదు. భారతదేశంలో దోపిడీముఠాల నణచుటకు మార్క్వెస్ హేస్టింగ్స్ పంజాబులో జరిగినంత యుద్ధం చేయాల్సివచ్చింది. ఆకాలంలో బందిపోటుతనంబలవంతులకు వృత్తిగా తయారయింది. బలహీనులు, మూర్ఖులుమాత్రమే, 'మంచిమనుషులుగా' వుండేవారు. ఆకాలంలో దోపిడీలు, దొంగతనాలు దూష్యంగాగాని, లజ్జాకరమైనవిగాగానీ ఎంచ బడేవికావు.

రాణి అరణ్యములో బాగాలోనికి వెళ్ళినతర్వాత తన పరిచారికనుద్దేశించి 'దివా, నువ్విక్కడేకూర్చో! నే నిప్పుడే వస్తాను. ఈ అడవిలో క్రూరజంతువులభయం చాలతక్కువ. ఒకవేళవున్నప్పటికీ నువ్వేమీ భయపడవద్దు. ఇక్కడకాపలా వుంటుంది' అని చెప్పింది. ఈవిధంగా హెచ్చరించి దేవి మరింత దట్టంగావున్న అడవిలోకి వెళ్ళిపోయింది. ఆ దట్టమైన అడవి లోపల ఒకసారంగం వుంది. లోనికి దిగుటకు మెట్లున్నాయి. లోనరాతిలో తొలిచినఒకచిన్నగదివుంది. అదిఎప్పుడూచీకటి గానే వుంటుంది. పూర్వం అక్కడేదో దేవాలయం వుండి వుంటుంది. కాలక్రమానదానిపై ఇప్పుడుమట్టిపేరుకుపోయింది. అందుకనే అక్కడికిచేరటానికి ఇప్పుడుమెట్లుకావాల్సివచ్చింది రాణి ఆచీకట్లో మెట్లుదిగి వెళ్ళసాగింది.

ఆ ఆలయంలో ఒకదీపంమినుకుమినుకుమంటూవుంది. ఆవెలుగులోఒకశివలింగంకన్పిస్తోంది. ఒకబ్రాహ్మణుడు శివ లింగానికిఎదురుగా కూర్చొనిపూజచేస్తున్నాడు. రాణీ శివలిం గానికి నమస్కరించికూర్చుంది. బ్రాహ్మణుడు పూజముగించి, ఆచమనంచేసి ఆమెతో సంభాషించసాగాడు.

'అమ్మా! నిన్న రాత్రి మీరు దోపిడి చేశారా?'

'మీ రేమనుకుంటున్నారు?'

'నే నేమెరుగుదును?'

బ్రాహ్మణుడు మరెవరోకాదు, మనకుపరిచితుడే! భవాని ఠాకూర్.

'ఏం ఠాకూర్ మహాశయా, ఏమెరుగుదు వేమిటి? పది సంవత్సరాలు దొంగలతో కలిసివున్నాను, నన్ను మీరెరుగు రించుటలేదా? జరిగే దోపిడీలన్నీ నేనే చేయిస్తున్నానని జనం అనుకుంటున్నారు. కానీ ఒక్కనాడైనా నే నివేవీ చేయలేదని మీ రెరుగుదురు- అయినప్పటికీ నే నేమెరుగుదును - అంటున్నారు మీరు'

'ఆగ్రహిస్తా వెందుకమ్మా! ఏ ఉద్దేశ్యంతో మనం దోపిడీ చేస్తున్నామో దానినిమనం చెడుగాభావించటంలేదు. ఒకవేళ చెడుగాభావించివుంటే మనం ఆవిధంగా చేసివుండే వాళ్ళంకాము. నువ్వూ దీనిని చెడుగాభావించటంలేదు. ఎంచేతంటే ఈ పదిసంవత్సరాల్లోనూ-'

'ఈవిషయంలో నాఅభిప్రాయంమారింది. నేను ఇంత కాలం మీమాటల్లోపడి పొరపాటుచేశాను ఇకముందుచేయ నావిధంగా. ఇతరులసొత్తును దోచుకోటం చెడుకాక పోతే మరేమవుతుందంటారు? నే సిక మీతో సంబంధం వదులు కుంటున్నాను'

'ఏమిటిది? ఇంతకాలం నేను చెప్పిన విషయాలనుమళ్ళీ మొదటినుంచీచెప్పాలా? నేనిదోపిడీ సొత్తులోంచి ఒకదమ్మిడీ తీసుకున్నా మహాపాపమే. కాని నేను ఇతరులకు ఇవ్వటానికే

దోపిడీ చేయిస్తారనినీకు తెలుసు. ధర్మాత్ములైనవారిని, ఉచిత మార్గాన ధనము సంపాదించుకునేవారిని లేదామనందోచుకొనుటవల్ల తిండికిగుడ్డలకు ఇబ్బందిపడేవారినిగాని ఇంతవరకు మనం ఎన్నడూదోచుకోలేదు. జూదగాండ్లను, దగాకోర్లను, ఇతరులను మోసగించి డబ్బుసంపాదించేవారిని మాత్రమే మనం దోచుకుంటున్నాం. దానిలో ఒకకానికూడా మనం మనస్వంతానికి ఉపయోగించుకోటంలేదు. ఏప్రజల్ని దోచుకొని ఆ పాపాత్ములు ఈధనాన్ని కూడబెట్టారో ఆ ప్రజలకు పంచి పెడుతున్నాం నీకు ఈవిషయాలన్నీ తెలియవా. ఇప్పుడు దేశంలో అరాజకం ప్రబలివుంది, దుష్టుల్ని అణిచేవారెవరూ లేరు. ఎవరిష్టంవచ్చినట్లు వారు జనాన్ని దోచుకుంటున్నారు. అందుకనే మేము నిన్ను రాణీగా చేసి రాజ్యపాలన చేస్తున్నాం. నీపేరట దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తున్నాం.'

'రాజుగాని రాణీగాని ఎవర్ని చేసినా అవుతారు. నాకీ రాణీగిరీ అంటే ఇష్టంలేదు. నన్ను వదలివేయండి.'

'ఈరాజ్యంమీరెవ్వరికీ శోభించదు. మీరెవ్వరివద్దనూ ఇంత అపార సంపద లేదు. నీ దానధర్మాలవల్ల అందరూ నీ అధీనంలో వుంటున్నారు.'

'ఈసంపదనంతా మీకు ఇచ్చివేస్తాను. నేను ఖర్చు చేసినట్లే మీరుకూడా చేయండి. నేనిక కాశీ వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను.'

"నీ ధనాన్ని చూసే కేవలం వీరందరూ నీఅధీనంలో లేరు. నువ్వు రూపంలో, గుణాల్లో, అన్నివిషయాల్లో మహారాణీవి. అనేకమంది నిన్ను సాక్షాత్తుభగవతిగా భావిస్తున్నారు.

తల్లివలెఅందరి క్షేమాన్నీనువ్వు కోరటమే ఇందుకుకారణం. ముక్తహస్తంతో దానధర్మాలు చేస్తావు, భగవతివలె చూపవతివి. అందుకనే నీపేరిట మేమీరాజ్యాన్ని నడుపుతున్నాం. లేకపోతే మామాట ఎవరు వింటారు."

"అందరూ నన్ను దోపిడీదొంగ అంటున్నారు. మరణించిన తర్వాతకూడా ఈ కళంకం పోదు."

"కళంకమా! ఈపేరునుకించపర్చగలిగేవారీబ కేంద్ర భూమిపైనేలేరు. సరేదానిని వదలివేద్దాం - ధర్మమార్గాన నడుచుకోటంలో కీర్తి అపకీర్తులతో పనేముంది? కళంకమనే భయమేవుంటే నీపని నిష్కామకర్మ ఎలా అవుతుంది? నువ్వు కేవలం కళంకాన్ని గురించే ఆలోచించేట్లయితే — నువ్వు నీలాభనష్టాలను మాత్రమే చూచుకున్నట్లవుతుంది. గాని, ఇతరులలాభనష్టాలను గురించి ఆలోచించినట్లెలా అవుతుంది? అది ఆత్మత్యాగమెలా అవుతుంది?"

"వాదనలో నేను మిమ్మల్ని జయించలేను - మీరు మహామహోపాధ్యాయులు. నా స్త్రీ బుద్ధికి తోచినదేదో చెప్తున్నాను, నేను - నేని రాణీగిరంనుంచి విముక్తి కోరుతున్నాను. ఇప్పుడు నాకేవేమీ నచ్చటంలేదు."

"అంత నచ్చకపోతే నిన్నరంగరాజ్‌ను దోపిడీకి ఎందుకు పంపావ్? ఏమీదాచవద్దు. అన్నీ నాకు తెలుసు, నిజం చెప్పు."

"అన్నీ తెలిసేవుంటే, నిన్న రంగరాజ్ దోపిడీచేయలేదని; దోపిడీచేసినట్లు నటించటం మాత్రమే జరిగిందని కూడా తెలిసేవుంటుంది."

"ఆ వివరాలన్నీ నాకు తెలియవు. అందుకే అడుగుతున్నాను."

"ఒక మనిషిని పట్టుకోడానికి అద తా చేయబడింది."

"ఎవర్ని?"

దేవి నోటినుంచి పేరు వెలువడటం లేదు. కానీ చెప్పకుండా కూడా పని జరుగదు. భవానీని మోసగించటం సాగదు. అందుకని దేవి "అతనిపేరు వ్రజేశ్వరరాయ్" అని చెప్పింది.

"నేనతని బాగా ఎరుగుదును. అతనితో నీకేంపని?"

"అతనికి కొంత ధనం ఇవ్వదలచాను. అతని తండ్రిని జాగీర్దారు బంధించయత్నిస్తున్నాడు. అందుకని ధనసహాయం చేసి బ్రాహ్మణుని కులగౌరవాన్ని కాపాడాను."

"అదేమీ మంచిపని కాదు. హరవల్లభ రాయ్ చాలా దుర్మార్గుడు. అతడు తెలిసి చేతులారా వియ్యపురాలిని వెలివేశాడు_ అతని కులగౌరవం పోతేనేమంచిది."

దేవి కంపించి "అదెలాగ?" అని అడిగింది.

"అతని రెండో కోడలుండేది, ఆ మెకు వితంతువైన తల్లి తప్ప ప్రపంచంలో మరెవ్వరూ లేరు. హరవల్లభుడు వారిని కులభ్రష్టులని నిందించి ఇంటినుంచి గెంటివేశాడు. ఈదుఃఖంతోనే ఆ బాలిక తల్లి మరణించింది."

"ఆ బాలిక గతేమయింది?"

"ఆకలితో అల్లాడుతూ చనిపోయిందని తెలిసింది."

"ఇవన్నీ మనకెందుకు? పరోపకారమనే మనం ఎత్తదగ్గది, బాధపడేవారి బాధల్ని తొలగించటమే మన పని."

"సరే అందుకేమీ అభ్యంతరం లేదు. జాగీర్దారుదుండగాలతో అనేకమంది ప్రజలు నిలువనీడలేక అల్లాడిపోతున్నారిప్పుడు. తినడానికింత తిండిదొరికితే చాలు, వారు మళ్ళీ తమశక్తిని కూడతీసుకుంటారు. ఆశక్తి లభించగానే తమ హక్కుల్ని తామే కాపాడుకుంటారు. నువ్వు త్వరలోనే ఒకనాడు సభచేసి వారికి సహాయం చేయాలి."

"రేపు సోమవారంనాడు ఇక్కడ సభ జరుగుతుందని వార్త పంపండి."

"కాదు, నువ్వింక ఇక్కడ వుండటానికి వీల్లేదు. నువ్వీ ప్రదేశంలో వుంటున్నావని ఆంగ్లేయులకు వార్త చేరింది. అయిదువందలమంది సైనికులతో నిన్ను బంధించటానికి బయలుదేరి వస్తున్నారు. కనుక సభ ఇక్కడ జరగటానికి వీల్లేదు, వైకుంఠపురారణ్యంలో సభ జరుగుతుంది. సోమవారంనాడే జరుగుతుందని తెలియజేశారు. ఆంగ్లసైనికులు ఆ అరణ్యానికి రాసాహసించరు, సాహసించివస్తే ప్రాణాలతో తిరిగి వెళ్ళరు. నీయిష్టం వచ్చినంత ధనంతో ఈ రోజునే అక్కడికి బయలుదేరి వెళ్ళు."

"ఈసారికి వెళ్తున్నాను. కాని ఇక ముందెప్పుడూ ఈ పని చేయలేనని సందేహంగా వుంది. నాకు ఇది మనస్కరించటం లేదు."

భవానీ పాఠక్‌తో ఈమాట చెప్పి దేవిఅక్కడినుంచి బయలుదేరి నావలోకి చేరుకుంది. రంగరాజ్‌ను పిలిచి నెమ్మదిగా "వచ్చే సోమవారంనాడు వైకుంఠపురారణ్యంలో స[illegible] జరుగుతుంది. వెంటనే నావను అక్కడికి తరలించండి. వ

వీరులందరికీ ఈ విషయం తెలియజేయండి. దేవీగృహంనుంచి వెళ్ళాలి, వెంటడబ్బుకూడా తీసుకువెళ్ళాలి. ప్రస్తుతం దగ్గర ఎక్కువ డబ్బులేదు" అని చెప్పింది.

మరుక్షణానే నావపై రెండుమూడు తెరచాపలు పైకి లేచాయి. ఆ నావ ముందుభాగాన మరొకనావను కట్టారు. దానిలో అరవైమంది యువకులుకూర్చొని "రాణీగారికీజై" అంటూ తెడ్లువేయసాగారు. ఇటు స్థలమార్గాన బాటసారుల వేషాల్లో అనేకమందివీరులు నావతోపాటు పరుగెత్తసాగారు. వారిచేతుల్లో కర్రలు మాత్రమేవున్నాయి. నావలోమాత్రం లెక్కలేనన్ని కత్తులు, కటారులు, బల్లెములు, తుపాకులు నిండుగావున్నాయి. ఇది దేవీరాణియొక్క తుపాకీసైన్యం.

ఏర్పాట్లన్నీ సరిగ్గావున్నదీ లేనిదీ చూసి దేవీ తన భోజనం వండుకొనుటకు వంటగదికి వెళ్ళింది-అయ్యో దేవీ! ఇదేమి సన్యాసమమ్మా నీకు!

## 6

సోమవారం, ప్రభాతసమయం. కీకారణ్యంమధ్య దేవీరాణి దర్బారు జరుగుతూవుంది. ఈ దర్బారులో ఫిర్యాదులు, వాజ్యాలు జరగవు. రాజ్యకార్యాల్లో కేవలం ఒకే ఒకపని – ముక్తహస్తంతో దానధర్మాలు చేయటం జరుగుతుంది.

దట్టమైన అడవి అది. దానిలో ఇంచుమించు మూడు వందల ఎకరాలమేర శుభ్రంచేశారు. చిన్నచిన్న మొక్కల్ని

నరికి శుభం చేశారే కానీ పక్కపక్క వృక్షాలన్నీ అల్లాగే వున్నాయి. ఆ చెట్లక్రిందనే అందరూ నిల్చొనివున్నారు. అక్కడ సమావేశమైనవారు పదివేలమందివరకు వుంటారు. మధ్య దేవీరాణి డేరా వుంది వెండి స్తంభాలపై, ముత్యాల జాలర్లతో శోభాయమానం వుంది డేరా. దాని క్రింద చందనపు బల్లపై మెత్తనిపరుపులు పరిచివున్నాయి. దానిపై ఒక రజితసింహాసనంవుంది, దానిపైముత్యాలసౌరులు వ్రేళ్ళాడే పట్టుపరుపువుంది. దేవీరాణియొక్క వేషంకూడా ఇవాళ కళ్లు మిరుమిట్లుగొలిపేట్లుంది. ఆమె ధరించిన చీరనిండా వజ్రాలు మెరుస్తున్నాయి. శరీరము నేని ఎక్కడా కన్పించకుండా ఆభరణాలున్నాయి మెడనిండా స్వచ్ఛ ముత్యాల హారాలు దుస్తుల్నికూడా కప్పేశాయి ఆమె శిరస్సుపై రత్న ఖచిత కిరీటముంది.

పూజ చేయుటకు అలంకరించే దేవీ విగ్రహంవలె వుందివాళ దేవీరాణి. ఇదంతా రాణీతనాన్ని ప్రదర్శించటానికే. ఇరు పార్శ్వములా ముస్తాబైన నలుగురు యువతులు సువర్ణవింజామరములను పట్టుకొని నిలబడివున్నారు. వెనుక, ముందు అనేకమంది సేవకులు నీలవర్ణ దుస్తులు ధరించి ఆదేశాలకు ఎదురు చూస్తున్నారు. సైనికులు సభను మరింత వన్నె తెచ్చారు. ఇంచుమించు అయిదువందలమంది సైనికులు సింహాసనమునకు ఎదురుగా బారులుతీరి నిల్చున్నారు. అందరూ ఎర్రని దుస్తులు; ఎర్రతలపాగాలు ధరించారు. ప్రతి సైనికుని చేతిలోనూ కత్తి [illegible] వున్నాయి చుట్టూ ఎర్ర జండాలు ఎగురుతున్నాయి.

దేవి సింహాసనంపై ఆసీనురాలు కాగానే పదివేల గొంతులు "దేవీరాణీకి జై" అని నినదించాయి. పదిమంది యువతులు ముందుకు వచ్చి దేవీరాణీని కీర్తిస్తూ గానం చేశారు. అప్పుడిక రంగరాజ్ ఆ పదివేలమంది దరిద్రులను ఒక్కొక్కరిచొప్పున దేవిఎదుటకు తీసుకురాసాగాడు. అందరూ వయస్సులో పెద్దలు. బ్రాహ్మణులుసైతం సాష్టాంగనమస్కారం చేసేవారు. దేవి సాక్షాత్తు తమవంటి దరిద్రులను ఉద్ధరించుటకు అవతరించిన భగవతేనని వారివిశ్వాసం. అంతకన్నే పెద్దవారూ ఆమె ఉనికిని ఆంగ్లేయులకు తెలియజేస్తేవారు కారు. ఆమెను బంధించటానికి ఎవరూ సహాయపడేవారు కాదు. దేవి, ప్రేమతో అందరియోగక్షేమాలు విచారించి వారివారి బాధలనుగమనించి తగినంత సహాయం చేసింది ధనంతోనిండివున్న కుండలు ఆమె సింహాసనం వద్దనేవున్నాయి.

ఉదయం ప్రారంభించిన దానధర్మాలు రాత్రి జాము ప్రొద్దుపోయేసరికి ముగిశాయి. అంతవరకు దేవి మంచినీరం కూడా ముట్టలేదు. దేవియొక్క దోపిడీ అంటే ఈవిధంగానే వుంటుంది.

కొద్దిరోజుల అనంతరం గుడ్లెడ్ దొరకు వైకుంఠపురారణ్యంలో దేవీరాణిదళం సమావేశమైనట్లున్నూ-దొంగలు అధికసంఖ్యలో వున్నట్టునూ వార్తఅందింది. దొంగలు చాలా ధనంతో తిరిగివస్తున్నారని కూడా తెలిసింది. అంతే ఈ పర్యాయం ఎక్కడో పెద్దమొత్తపు దోపిడీ చేసివుంటారని కూడా భావించాడు. దేవియొక్క సహాయం పొందినవారు కూడా "డబ్బెక్కడుంది?" అనే చెప్పేవారు. దీనికి వారొక

కారణంకూడావుంది. డబ్బు వుందని తెలిస్తే జాగిర్దారు మనుషులువచ్చి దోచుకుంటారని భయం. అయినప్పటికీ వారు ఖర్చుచేసుకునేవారు, అందువల్ల ఈపర్యాయం దేవీరాణిపెద్ద దోపిడీయే చేసిందనే అందరూ విశ్వసించారు.

# 12

సరిగ్గా సమయానికే వ్రజేశ్వరుడు ఇంటికి చేరాడు. అతడు వెళ్ళి తండ్రికి నమస్కరించాడు. హారవల్లభుడు క్షేమ సమాచారాలు అడిగిన తర్వాత "అసలు విషయం ఏమయింది? డబ్బు సంగతి ఏం జరిగింది" అని ప్రశ్నించాడు.

"మామగారు డబ్బివ్వలేదు" అన్నాడు వ్రజేశ్వరుడు. హారవల్లభునిపై పిడుగు పడినట్లయింది. "అంటే డబ్బు దొరకలేదా?" అని అరిచాడతడు.

"మామగారు డబ్బివ్వలేదు. అయితే మరొకరివద్ద డబ్బు తెచ్చాను."

"తెచ్చావా? అయితేఇంతవరకు నాతో చెప్పనేలేదే! జై కాళీ! బ్రతికిపోయాను!"

"డబ్బుఅయితే తెచ్చాను, కాని అవ్యక్తివద్ద డబ్బు తీసుకోవటం మంచిదా కాదా అనేది నాకు అర్థంకాలేదు."

"ఎవరిచ్చారురా డబ్బు?"

వ్రజేశ్వరుడు తల వంచుకొని "పేరు గుర్తురావటంలేదు – అదే, దోపిడీలుచేసే స్త్రీ లేదూ? ఆమె."

"ఎవరు? దేవి చౌధరాణియా?"

"అవునవును. ఆమే."

"ఆమె ఎలా ఇచ్చింది నీకు?"

ఇటువంటి పరిస్థితుల్లో తండ్రివద్ద బొంకవచ్చునని వ్రజేశ్వరుని ప్రాచీన ధర్మశాస్త్రాలు చెప్తున్నాయి. అందులో దోషమేమీ లేదని భావించి అతడు "అదృష్టవశాత్తు ఏదో దొరికింది" అన్నాడు.

"దొంగయొక్క డబ్బు! వ్రాతకోతలేమైనా జరిగాయా?"

"అదృష్టవశాత్తు లభించటంవల్ల వ్రాతకోతలతో పని లేక పోయింది."

ఈ విషయంలో తండ్రి మరేమీ ప్రశ్నించకుండా వుండేందుకుగాను మాటలు నొక్కి పలుకుతూ "పాపపు సొమ్మును తీసుకునేవారుకూడా ఆ పాపంలో పాలుపంచుకున్నట్లేగదా! అందుకని ఆ డబ్బును ఉంచుకోటం నాకిష్టం లేదు" అన్నాడు.

హారవల్లభుడు క్రుద్ధుడై "డబ్బుతీసుకోకపోతే జైలుకు వెళ్ళమంటావా ఏం? అప్పుతీసుకోటంలో పాపపుణ్యాలేమిటి. జ్ఞాతపాల డబ్బు అనేదిమాత్రం ఎవరివద్ద వుండేడ్చింది? అదంతా ఆలోచించాల్సిన అవసరమేమీలేదు; దొంగ యొక్క సొమ్ము, వ్రాతకోతలు జరగలేదు, సమయానికి సర్దకపోతే ఇల్లు-వాకిలి దోచుకుపోతారేమో అనేదే ఇప్పుడు ఆలోచించాల్సింది" అని అన్నాడు.

వ్రజేశ్వరుడు ఏమీ మాట్లాడలేదు.

"ఎప్పటివరకు గడువు వుంది?" అని అడిగాడు హారవల్లభుడు.

"వైశాఖ శుద్ధ సప్తమినాటి రాత్రి చంద్రాస్తమయం వరకు గడువు వుంది."

"మరి ఆమె చూడబోతే దొంగ. ఒకేచోట ఖాయం గా వుంటుందనే దేముంది? డబ్బు ఎక్కడికి పంపాలి."

"ఆ రోజున ఆమె సాయంత్రమయేసరికి సంధానపురం రేవులో వుంటుంది. అక్కడికే పంపాలి"

"సరే, ఆనాటికి అక్కడికే పంపుదాం."

వ్రజేశ్వరుడు వెళ్ళిపోయాడు. హారవల్లభుడు లోనలో తాను ఆలోచించుకోసాగాడు – "హాఁ! ఈ ముండకు డబ్బు చెల్లించాలా? సైనికుల్ని పిలిచి పట్టిస్తే పేచీయే వుండదు. వైశాఖశుద్ధసప్తమినాడు చీకటి పడగానే సైన్యసమేతంగా కెప్టెన్ దొర ఆమె నావపై దాడి చేయకపోతే నాపేరు హార వల్లభుడే కాదు!"

ఈసద్భావన అతడు తనమనస్సులోనే వుంచుకున్నాడు, వ్రజేశ్వరుడితో కూడా అనలేదు.

వ్రజేశ్వరుడు ఒక మహారాణిని ఆమె నావలో కలుసుకుని ఆమెను వివాహమాడాడని, తానెంత వారించినా వినలేదనీ ఆమె శూద్రస్త్రీయని, ఆమెకు అంతకుముందు మరి రెండు వివాహాలు జరిగాయని, దీనివల్ల వ్రజేశ్వరుడు జాతిభ్రష్టుడయ్యాడు- కనుక తానిక అతని ఎంగిలి పళ్ళెంలో భోజనం చేయననీ ప్రతిజ్ఞ చేసినట్లు సాగర్ వృద్ధబ్రాహ్మణికి చెప్పింది. ఆమె వ్రజేశ్వరుణ్ని పిలిచి అడిగింది. వ్రజేశ్వరుడు తన తప్పును అంగీకరించాడు. "రాణిగారు మంచి వంశం

లోనిదే. మా తండ్రిగారికి పెదతల్లి అవుతుంది. ఆమెకూ మూడు వివాహాలయ్యాయి, నేనూ మూడో పెండ్లి వాడినే గదా!" అని అన్నాడు.

ఇదంతా అబద్ధమని గ్రహించింది వృద్ధ బ్రాహ్మణి. ఈ విషయం ఎలాగైనా నయనతారకు తెలియాలనేదే సాగర్ యొక్క ముఖ్యోద్దేశ్యం. అది నెరవేరేందుకు కాస్తైనా విలంబన జరగలేదు. నయనతార సాగర్‌ను చూసే మండిపడుతూ వుంది. భర్త పెద్దవయస్సు స్త్రీని వివాహమాడినట్లు విని మరింత రెచ్చిపోయింది. అందువల్ల కొద్దిరోజులవరకు బ్రజేశ్వరుడు నయనతారను తొంగిచూడనైనా లేదు. సాగర్ కోర్కె ఫలించింది.

కానీ నయనతార పెద్దతుపాను రేపింది - చివరికి ఆమె అత్తగారికి ఫిర్యాదు చేసింది. అందుకు బ్రజేశ్వరుని తల్లి 'నువ్వు పిచ్చిదానవై పోయావమ్మా. బ్రాహ్మణుడు శూద్ర స్త్రీని వివాహమాడటం జరుగుతుందా? నువ్వు రెచ్చినకొద్దీ రెచ్చగొడుతున్నారు' అని అంది.

నయనతార అప్పటికీ గ్రహించలేదు. 'ఒకవేళ నిజంగానే చేసుకుంటే ఎలా?' అని అడిగింది.

'నిజంగానే చేసుకుంటే కోడల్ని ఇంటికి తెచ్చుకుంటాను. కోడల్ని వదులుకుంటారా ఎక్కడైనా?' అని అంది బ్రజేశ్వరుని తల్లి.

ఇంతలో బ్రజేశ్వరుడు వచ్చాడు. నయనతార వెంటనే అక్కడినుంచి పారిపోయింది.

'అమ్మా ఏమిటో చెప్తూందే నయనతార!' అని అడిగాడు బ్రజేశ్వరుడు.

'నువ్వు వివాహమాడితే కోడల్ని ఇంటికి తీసుకు రమ్మని అంటోంది' అనిఅంది తల్లి.

వ్రజేశ్వరుడు ఏదో ఆలోచనలో మునిగి పోయాడు. ఏమీ మాటాడకుండానే అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

సాయం సమయమందు వ్రజేశ్వరుని తల్లి భర్తవద్దకు వచ్చి ఈవిషయాన్నే ప్రస్తావించింది. అందుకు హరవల్లభుడు 'నీ ఉద్దేశ్యమేమిటి?' అని అడిగాడు.

'నాఉద్దేశ్యమేమంటే-సాగర్ ఇక్కడ అంతగా వుండటంలేదు.నయనతార అబ్బాయికి తగినదికాదు. వాడు మరో వివాహంచేసుకుని సుఖంగావుంటే నాకదే సంతోషం.'

'అయితే అబ్బాయి వుద్దేశ్యం ఏమిటో తెలుసుకో. అతనికి ఇష్టమైతే నాతో చెప్పు, మంచిసంబంధ మేదైనా చూడవచ్చు.'

'సరే, వాడి అభిప్రాయం యెలా వుందో తెలుసుకుంటాను.'

అతని అభిప్రాయమేమిటో తెలుసుకునేభారం వృద్ధ బ్రాహ్మణిపైబడింది. ఆమె వ్రజేశ్వరునకు విరహంతో బాధపడే అనేకమంది రాకుమారుల కథలు చెప్పింది. కానీ ఫలితం కన్పించలేదు. చివరకు వృద్ధ బ్రాహ్మణి స్పష్టంగా అడగసాగింది. కానీవ్రజేశ్వరుని అభిప్రాయమెలావుందో మాత్రం తెలుసుకోలేక పోయింది

'అమ్మా-నాన్న చెప్పినట్లే నడుచుకుంటాను' అని మాత్రమే అతడు జవాబు చెప్పాడు.

సంభాషణ అంతకుమించి ముందుకు పోలేదు.

# మూడవ అధ్యాయం

వైశాఖమాసం సమీపించినప్పటికీ దేవీరాణికి అప్పు తీర్చే ప్రయత్నమేమీ జరగలేదు. ఇప్పుడు హరవల్లభుని స్థితి బాగానేవుంది. అతడు తీర్చదలచినచో సునాయాసంగా ఏర్పాటు చేయగలిగేవాడు. కానీ అతడీవిషయాన్నే పట్టించుకోలేదు. గడువు నెత్తిమీదికొచ్చింది. ఇంకా నాలుగైదు రోజుల వ్యవధిమాత్రమేవుంది. ఇప్పుడిక వ్రజేశ్వరుడు తండ్రిని డబ్బుకోసం వత్తిడి పెట్టనారంభించాడు. హరవల్లభుడు 'నువ్వేమీ గాబరాపడకు. నేను డబ్బుకోసమే వెళ్తున్నాను. షష్టినాటికి తిరిగివస్తాను' అని చెప్పి బయలుదేరి వెళ్ళాడు. వెంట వంటవాడు, ఒక నౌకరు, ఇద్దరు వస్తాదులు కూడా వెళ్ళారు.

హరవల్లభుడు వెళ్ళింది డబ్బుకొరకే కానీ అది మరో మార్గంలో. సరాసరి రంగపూర్ వెళ్ళి కలెక్టరును కలుసుకున్నాడు. శాంతిభద్రతలు కాపాడే బాధ్యత ఆనాడు కలెక్టరుపైనే వుండేది.

'నావెంట సైనికుల్ని పంపండి, నేను దేవీచౌధరాణిని పట్టిస్తే నాకేమి బహుమానం ఇస్తారు?' అని అడిగాడు హరవల్లభుడు కలెక్టర్ని.

అతనిమాట విని కలెక్టరు చాలా సంతోషించాడు. దేవీ చౌధరాణీయే దొంగలందరికి నాయకురాలనీ, ఆమెను బంధిస్తే మిగిలినవాళ్ళందరూ దొరకటం తేలికనివారికి తెలుసు. దేవీరాణినిబంధించటానికి కలెక్టరుద్వార స్వయంగా చాలా

ప్రయత్నించాడు- కానీ వారి ప్రయత్నాలేవీ ఫలించలేదు. అందుకని హారవల్లభుడు ఆరాక్షసిని పట్టిచ్చేగలడనివిని చాలా సంతోషించి గొప్పగా బహూకరించుటకు అంగీకరించాడు. 'నాతోకూడా అయిదువందలమంది సైనికుల్ని పంపండి' అని కోరాడు హారవల్లభుడు. హారవల్లభుని వెంట దొరగారి ఆదేశంప్రకారం లెఫ్టినెంట్ బ్రేనన్ ఐదువందలమంది సైనికులతో బయలుదేరి వెళ్లాడు.

దేవీరాణి కలుసుకోమని చెప్పిన రేవుపేరు హారవల్లభుడు బ్రజేశ్వరునిద్వారా వినేవున్నాడు. దేవీరాణినావలోనే వుండవచ్చునని ఆలోచించి బ్రేనన్ సైన్యంతోసహా నావలోనే బయలుదేరాడు. మరికొంత సైన్యాన్ని భూమార్గం గుండా రహస్యంగా అక్కడకుపంపారు. దేవీరాణి నావ ఆగే ప్రదేశాన్నిగురించి హారవల్లభుడు వారికి తెలియజేశాడు. భూమార్గాన వెళ్ళిన సైన్యం ఆ స్థలానికి దగ్గరలోనే అడవిలో దాగివుండాలని నిర్ణయించబడింది.

దేవీరాణి నావ కన్పించగానే అకస్మాత్తుగా ఇటు నావలద్వారాను, అటు అడవిలో దాగినసైన్యమూ ముట్టడి జరపాలని నిర్ణయం.

ఒక సన్యాసినిని పట్టుకొనుటకు ఇంత హంగామా చేశారు; కానీ చూసిన వాళ్ళు ఈ హంగామా చాలా అవసరమనే చేశారు. దేవి రాణి సన్యాసిని అయినా, మరేమైనా కావచ్చు. కానీ ఆమె ఆధీనంలో వెయ్యిమంది వీరులున్నారని దొరలకు తెలుసు. ఈ వీరుల్ని లాఠీపళం అంటారు.

అనేక పర్యాయాలు కుంపెనీ సైన్యం ఈవీయుల లాఠీ మజా రుచిచూసి కాలికి బుద్ధి చెప్పారు.

అయ్యో లాఠీ! నీకాలం గతించి పోయిందిక. నువ్వు సామాన్యమైన వెదురువంశంలో జన్మించావు, కానీ అభ్యస్తమైన చేతిలో పడి సర్వేసను స్తమూ చేయగలిగావు. నువ్వు ఎన్నో ఖడ్గాలను తుత్తునియలు చేశావు, మరెన్నో ఢాలు, పటాకత్తుల మత్తువదలించావు. నీ తీవ్రాఘాతంలో శత్రువుల చేతినుంచి తుపాకీ సన్నీలు నేలగూలాయి. శత్రువులు విరిగిన చేతులతో పారిపోయేవారు. ఓ లాఠీ! నువ్వు బాగాలు దేశ గౌరవమర్యాదలను కాపాడావు. దేశ సౌభాగ్యాన్ని, సంపదను, జనాన్ని రక్షించేదానివి. నీపేరు వింటే మహమ్మదీయులు కంపించేవారు. నీపేరువిని దొంగలు హడలిపోయేవారు. ఆననుయాన నువ్వే పీనల్ కోడ్ వు. నువ్వు పీనల్ కోడ్ వలె దుష్టుల్ని శిక్షించేదానివి, పీనల్ కోడ్ వలె శిష్టుల్ని శిక్షించే దానివి. పీనల్ కోడ్ వలె రాముడు చేసిన తప్పుకు భీముని తలవ్రయ్యలు చేసే దానివి. కానీ ఒక విషయంలో మాత్రం నువ్వు పీనల్ కోడ్ కంటేకూడా ఎక్కువ – నువ్వు చేసేపనికిక అప్పీలు అంటూ వుండేదికాదు. అయ్యో! అటువంటి నీ గొప్పతనమంతా పోయిందే! నిన్ను తరిమేసి ఇప్పుడిక నీస్థానాన్ని పీనల్ కోడ్ ఆక్రమించింది. సంఘంపై పెత్తనంచేసే అధికారాన్ని నీనుంచిగుంజుకుంది పీనల్ కోడ్. ఓలాఠీ! నువ్విప్పుడిక లాఠీవికావు, సామాన్యమైన వెదురు ముక్కవు. నువ్విప్పుడిక బెత్తం అవతారంతో జనంచేతుల్లో పడి కుక్కల్ని, నక్కల్ని తోలటానికి ఉపయోగపడు

తున్నావు. ఆకాలంలో నువ్వుదివ్యౌషధమనికూడావిన్నాము. మానసిక రోగాలను కుదిర్చే గొప్ప గొప్ప వైద్యులు "మూర్ఖస్య లాఠ్యౌషధమ్" అంటారు కాని ఇప్పుడు మూర్ఖులకు 'అన్నా! బాబాయీ! అబ్బాయీ!' అనేక ఔషధాలు. కాని వాటివల్ల కూడా రోగం కుదరటంలేదు.

మీవంశంలో ఇంకా ఇతరమైన మేకులు, కట్టె కొయ్యలు, శ్రీకృష్ణభగవానుని మురళి వీటన్నిటి గుణాలు ప్రపంచ విఖ్యాతమైనవే. కానీ, ఓలాఠీ, నీకు నువ్వేసాటి. ఇప్పుడిక నువ్వీ ప్రపంచంలో లేవు, మరణించావు. నీకు శాశ్వత స్వర్గం లభించివుంటుంది. ఇంద్రలోకానికి పోయి నందనవనంలో పుష్పభారంతో వాలిపోయే పారిజాత వృక్షానికి సహాయంగా నిలబడివుంటావు. దేవకన్యలు నిన్ను ఉపయోగించి కల్పవృక్షాన్ని కొట్టి ధర్మ, అర్థ, కామ, మోక్షాలనుపొందుతూవుంటారు. అందులో రెండు ఈభూమి మీదికి దొర్లివస్తే ఎంతబాగుండును !

## 2

ఎవరి లాఠీనిచూసి ఇంతగా భయపడి ఇన్నిఏర్పాట్లు చేయవలసి వచ్చిందో వారిచేతులలో కనీసంలాఠీకూడా లేదు. ఒక్క రక్షకభటుడైనా లేడు దగ్గర. ఏ రేవులోనైతే నావను ఆపి బ్రజేశ్వరుడ్ని బంధించారో ఆరేవులోనే దేవీరాణి నావ ఆగివుంది. సంజచీకట్లు ముసురుకుంటున్నాయిప్పుడే. ఆనాటి వలెనే నావపూర్తిగా అలంకరించివుంది, కానీ ఆనాటిఏర్పాట్లన్నీమాత్రం లేవు. ఆనాటి యువకసేవకులు, నావికులు, రంగ

రాజే ఎవరూ లేరక్కడ. తెరచాపలు ఎత్తేవున్నాయి. గాలి లేకపోవటంవల్ల చుట్టచుట్టుకొని వున్నాయి. నావకు ప్రత్యేకంగా లంగరువేయలేదు. మోకులతో ఒడ్డునవున్న మేకుకు కట్టారు. దేవిరాణి ప్రత్యేకమైన రత్నాభరణాల నలంకరించుకోలేదు. ఇప్పటి ఆమె సౌందర్యశోభ చాలా విలక్షణంగా వుంది. శరీరమంతటా చందనంపులుముకుంది. చందనచర్చిత లలాటంపై ఒక మాలశోభిస్తోంది. చేతులకుకూడా పూలమాలలున్నాయి, మరేవిధమైన ఆభరణాలూ లేవు. ముతక దుస్తులు ధరించివుంది.

ఆమె ఈనాడు నావపైభాగాన ఒంటరిగాలేదు. ఆమెచెంత మరిద్దరు స్త్రీలున్నారు- నిశి, దివాలు. వారి కేదో సంభాషణ జరుగుతోంది. మనం వారి సంభాషణను మధ్యనుంచి విన్నప్పటికీ అభ్యంతరమేమీ లేదు.

'భలే! పరమేశ్వరుణ్ణి ప్రత్యక్షంగా చూడటం సాధ్యపడుతుందా ఎక్కడైనా?' అని అంది దివా. ఆమె నిరక్షరకుక్షియని పాఠకులకు తెలిసేవుంటుంది.

'ప్రత్యక్షంగా చూడలేము. ప్రత్యక్షంగా చూడాలనే విషయాన్నిగురించి కాదే నేను మాట్లాడింది- ప్రత్యక్షంచేసుకోవాలనే విషయాన్నిగురించి మాట్లాడాను. ప్రత్యక్షమనేది ఆరువిధాలుగావుంటుంది. నువ్వు ప్రత్యక్షంగా చూడటమని చెప్పావే, అంటే కళ్ళతో ఎదుటవున్న దానిని చూడటమని అర్థం. నువ్వునామాటవింటున్నావు గదా, అది ప్రత్యక్షశ్రవణమవుతుంది. నా చేతికివున్న పూలమాలలోని సుగంధం నీకు తెలుస్తుందిగదా?' అంది ప్రఫుల్ల.

'తెలుస్తుంది, అయితే?'

'ఇది ఘ్రాణప్రత్యక్ష మవుతుంది. ఇప్పుడు నేను నిన్నొక దెబ్బ వేశాననుకో అది త్వచాప్రత్యక్షమవుతుంది. నిశి ఇప్పుడు నిన్ను తినేస్తుందనుకో, అది రుచ్యప్రత్యక్షం అవుతుంది'

'అవును, కానీ దేవుణ్ణి చూడలేము, వినలేము, వాసన చూడలేము, స్పర్శించలేము, తినలేము, మరి ఏవిధంగా ప్రత్యక్షం చేసుకోగలం?'

'ఇప్పటికి అయిదువిధాలైన ప్రత్యక్షాలు అయ్యాయి. నేను ఆరువిధాలని చెప్పానుగదా, కన్ను, చెవి, ముక్కు, శరీరము, జిహ్వ, ఇవి కాక జ్ఞానేంద్రియమునేకి ఒకటుంటుంది తెలుసా?'

'దంతములా?'

'ఛీ! పాడుదానా! ఒక్క గుద్దుతో ఆ జ్ఞానేంద్రియ వరుసను మొత్తం రాలగొట్టాలి' అంది నిశి.

దేవి నవ్వుతూ 'కన్ను మొదలగునవి అయిదు జ్ఞానేంద్రియాలు, కాళ్ళు చేతులు మొదలగునవి ఐదు కర్మేంద్రియాలు. ఇంద్రియాలన్నింటికి రాజు, జ్ఞానేంద్రియాల్లోనూ, కర్మేంద్రియాల్లోనూ లెక్కించబడే మనసు మనస్సు అనే ఈ జ్ఞానేంద్రియంద్వారా కూడా ప్రత్యక్షం జరుగుతుంది. దానిని మానస ప్రత్యక్షం అంటారు. ఈశ్వరుడు మానస ప్రత్యక్షానికి సంబంధించినవాడు, అని వివరించింది.

'ఈశ్వరా సిద్ధేః ప్రమాణాభావాత్' అంది నిశి.

సాంఖ్య, ప్రవచన, సూత్ర భాష్యాదులు చదివినవారు నిశియొక్క ఈవ్యంగ్యోక్తిలోని మర్మమును తెలుసుకోవచ్చు.

నిశి ఒకవిధంగా దేవిరాణియొక్క సహాధ్యాయిని.

'సూత్రకార స్యోభయేంద్రియ శూన్యత్వాత్ - నతు ప్రమాణ భావత్' అని జవాబిచ్చింది దేవిరాణి.

'మంచిదే, మీహావాత్, భవాత్‌లు మీదగ్గరే వుంచుకోండి. నేను ఎప్పుడూ నా మనస్సులో ఈశ్వరుణ్ణే చూడలేను' అంది దివా.

'అదుగో మళ్లీ చూడాలని అంటావేం? చూడట మంటే కళ్ళతోనే. మనస్సులో ఈశ్వరప్రత్యక్షంసాధ్యమవుతుంది, కానీ నువ్వన్నట్లుచక్షువులకు ప్రత్యక్షంసాధ్యపడదు.'

'మరి నేటివరకు నేను ఈశ్వరుణ్ణి మనస్సులో ఏవిధం గానూ ప్రత్యక్షం చేసుకోలేకపోయానే.'

'మనిషియొక్క స్వాభావిక ప్రత్యక్షశక్తి చాలా స్వల్పం. అది మరేసహాయమూ, యితర ఆధారములేకుండా అన్నీ ప్రత్యక్షం చేసుకోలేదు.'

'ప్రత్యక్షానికి సహాయంతో పనేముంది. ఈనదిని, నీళ్ళను, చెట్లను, నక్షత్రాలను ఏసహాయం లేకుండానే నేను చూడగల్గుతున్నాను గదా!'

'అయితే విను. నువ్వు అన్నీ చూడడం లేదనటానికి ఒక ఉదాహరణ చెప్తాను' అని దేవి నవ్వింది. ప్రత్యేకమైన ఆ నవ్వును చూసి 'ఏమిటది?' అని అడిగింది నిశి.

'ఇవాళ కుంపినీ సైన్యం నన్ను బంధించటానికి వస్తున్నారని నీకు తెలుసుగదా?' అని అడిగింది దేవి.

దివా దీర్ఘంగా నిట్టూర్చి 'అవును, తెలుసు_ఆ విషయం' అని అంది.

"సైనికుల్ని నువ్వు ప్రత్యక్షంగా చూశావా?'

'లేదు, వస్తే ప్రత్యక్షంగా చూస్తాను.'

"కానీ, వాళ్ళువచ్చారని అంటున్నాను నేను. అయితే ఏ సహాయమూ లేనందువల్ల నువ్వు చూడలేకపోతున్నావు. ఇదుగో, ఇప్పుడు దీనిసహాయంతో చూడు.'

అని చెప్పి దేవి దివాకు దుర్భిణి యంత్రాన్నిచ్చింది. దివా దానినందుకొని చూడసాగింది.

'ఏమి చూశావ్?' అని అడిగింది దేవి.

'ఒకనావ. అందులో చాలామందిమనుషులున్నారు.'

'వాళ్ళే సైనికులు. ఇదుగో, యిటుచూడు' అని దేవి వేరు వేరు ప్రదేశాల్లో వున్న అయిదు నావల్ని చూపింది.

నిశికూడా చూసింది. 'నావలన్నీ లంగరేసి వున్నాయి. మనను పట్టుకొనుటకే వచ్చివుంటే అక్కడే ఎందుకు ఆగాయి,' అని అడిగింది నిశి.

'భూమార్గాన వచ్చేసైనికులింకా యిక్కడికి చేరి వుండరు. అందుకే నిరీక్షిస్తున్నారనుకుంటా. వాళ్ళు రాక ముందే నావలు ముట్టడిజరిపితే నేను దిగి స్థలమార్గాన పారి పోవచ్చునని వారి భయం. అందుకనే ముందుకు రాలేదు.'

'మనం వాళ్ళను చూశాముగదా, మనం పారిపోతే యేం?"

'మనవద్ద దుర్భిణీవుందని వారికి తెలియదు' అంది దేవి.

'బ్రతికివుంటే భర్తను మరోసారి కలుసుకోవచ్చు. ఇంకా భూమార్గాన సైనికులువచ్చి వుండరు. అటుగుండా పారిపో! ఇప్పటికీ అవకాశం వుంది' అని అంది నిశి.

"నాకు ప్రాణభయమేవుంటే అస్సీ తెలిసికూడా ఇక్కడికి రా సాహసించను? వచ్చినతర్వాత నాకు ఆ భయమేవుంటే మన వెయ్యిమంది సైనికుల్ని మరోచోటుకి పంపేవుండను."

"మాకు ఈ విషయం ముందుగా తెలిసివుంటే నిన్ని పని చేయనివ్వము" అంది దివా.

"నీకేమి అధికారంవుంది దివా! నా నిశ్చయం ప్రకారం నేను చేసితీరుతాను. నే నివాళ నా భర్తను దర్శించాల్సిందే. వారి అనుజ్ఞ తీసుకొని ముందు జన్మలో తిరిగి కలుసుకోవాలనే కోర్కెతో ప్రాణత్యాగం చేస్తాను. నిశీ! దివా! మీరిద్దరూ నామాట వినండి! నాభర్త తిరిగివెళ్ళేప్పుడు మీరుకూడా వారి నావలో వెళ్ళిపొండి. నేనొక్కదానినే పట్టుబడతాను, నేనొక్కదానినే ఉరికంబ మెక్కుతాను. అందుకనే మనవీరుల్నందర్నీ పంపివేశాను. వాళ్ళ వెంట మీరు వెళ్ళలేదు. కనుక మీరిద్దరూ నాభర్తయొక్క నావలో వెళ్ళిపోవాలని ప్రార్థిస్తున్నాను."

"బొందిలో ప్రాణాలుండగా నిన్ను వదలివెళ్ళను. అవసరమయితే నీతోకూడా చస్తాను" అంది నిశి.

"సరే, ఆ విషయాన్నలావుంచు. ముందు మీరడిగిన దానికి జవాబు చెప్తాను. మీ కళ్ళకు కన్పించని దానిని దుర్భిణి సహాయంతో ప్రత్యక్షం చేసుకోగల్గినట్లే మానస ప్రత్యక్షానికి మనో దుర్భిణి అవసరం."

"మనోదుర్భిణి అంటే ఏమిటి?"

"మోగం."

"అదే అభ్యాసము, ప్రాణాయామం, కుంభక్—"

"దానిని నేను యోగంఅనను. యోగమంటేఅభ్యాస మనిఅర్థం. కాని అభ్యాసాలన్నీ యోగంకావు నువ్వు పాలు, వెన్న తినటం అభ్యాసం చేసుకున్నానంటే అది యోగం కాదు. మూడు అభ్యాసాలు మాత్రమే యోగంఅంటారు."

"ఏమిటో అవి?" అని అడిగింది దివా.

"జ్ఞానము, కర్మము, భక్తి. జ్ఞానయోగము, కర్మ యోగము, భక్తియోగము."

నిశి దుర్భిణితో చుట్టూ చూడసాగింది. చూస్తూ చూస్తూ 'ఇదుగో, యిది గోల్ యోగం!' అని అంది.

"ఆదేమిటి? గోల్ యోగం ఏమిటి!"అనిఅడిగిందిదేవి.

"అదుగో, చిన్న డిగ్గీఒకటి ఇటేవస్తోంది. కుంపినీ వాళ్లది కావచ్చు" అంది నిశి.

దేవి నిశి చేతిలోంచి దుర్భిణిని తీసుకొని చూసింది. 'ఇది నాకు మంచియోగమే, వారు వస్తున్నారు. మీరిక క్రిందికి వెళ్ళండి' అని అంది దేవి.

నిశి, దివాలు క్రిందికి దిగివచ్చి ఒక గదిలోకివెళ్లారు. ఆ డిగ్గీ నెమ్మదిగా నావచెంతకుచేరి ఆగింది. దానిని కొద్ది దూరాన కట్టివుంచమని ఆదేశించి వ్రజేశ్వరుడు దేవిచెంతకు బయలుదేరాడు. దేవిలేచి తలవంచి అతని పాదధూళి శిర మున దాల్చింది.

"ఇవాళ డబ్బు తేలేకపోయాను. నాలుగైదురోజుల్లో సర్దగలను. నాల్గయిదు రోజులతర్వాత మళ్ళీ ఇక్కడే కలుసు కుంటాను" అని చెప్పాడు వ్రజేశ్వరుడు.

అయ్యో బ్రజేశ్వరా! పదిసంవత్సరాల తర్వాత ప్రఫుల్లను కలుసుకున్నావే! ఇదా నువ్వు మాట్లాడేది! ఛీ!

"ఇక నన్ను కనుక్కోలేరు" దుఃఖంతో దేవి మాట్లాడలేకపోయింది. కన్నీరు తుడుచుకుంటూ 'నన్నిక కలుసుకోలేరు, అప్పుతీర్చటానికి వేరొక ఉపాయంవుంది. మీకు అవకాశం వున్నప్పుడు ఆ ధనాన్ని దీన దుఃఖితులకు పంచిపెట్టండి–నాకు ముట్టినట్లే!' అని అంది.

బ్రజేశ్వరుడు ఆమె చేతినిపట్టుకుని 'ప్రఫుల్లా! నీడబ్బు' అతడామాటను పూర్తిచేయనేలేదు. బ్రజేశ్వరుడు 'ప్రఫుల్లా' అని ఎప్పుడయితే అన్నాడో ఆవెంటనే పది సంవత్సరాలుగా వున్న దుఃఖం పెల్లుబికింది. కంటికి మంటికి ఏకధారకట్టింది. బ్రజేశ్వరుడు చెప్పబోయిన డబ్బువిషయం ఆ ప్రవాహంలో పడి అంతు తెలియకుండా కొట్టుకుపోయింది. మహాతేజ స్వరూపిణియైన దేవీరాణి పసిపాపవలె ఏడ్వసాగింది. బ్రజేశ్వరుని పరిస్థితి చాలా విచిత్రంగా తయారయింది. ఈ పాపాత్ములరాలు దోపిడీలుచేస్తోంది. ఈమెను గురించి కంటతడి పెట్టటం కూడా అనవసరమని అతడాలోచించాడు. కానీ కన్నీటికి ఈ విషయాలేమీ తెలియవు. అవి గుబగుబ పొంగి వచ్చాయి. కళ్ళు తుడుచుకుంటే ప్రఫుల్ల చూస్తుందని బ్రజేశ్వరుడు ఆ పని చేయలేదు. అందువల్ల నిండినచెరువులవలె కట్టలపైగా ప్రవహించిది, బ్రజేశ్వరుని కన్నీరు కపోలముల పైగాజారి ప్రఫుల్ల చేతిమీద పడసాగాయి. దానితో అస్సుగా వున్న కట్ట కాస్తాకూడా తెగిపోయింది. దోపిడీలు చేస్తున్నందుకు బాగా దూషించాలని అనుకున్నాడు బ్రజేశ్వరుడు.

పాపాత్మురాలా- అని తిట్టి అడగవల్సిన నాల్గుమాటలూ అడిగి శాశ్వతంగాఆమెనువదలి వెళ్ళిపోవాలనుకొనివచ్చాడు. ఆమెను చూడగానే ఇాతదుఃఖం ముంచికొచ్చినప్పుడు ఆతడా మాటలన్నీ ఎలా అనగలడు?

ప్రజేశ్వరుడు కన్నీరు తుడుచుకుని ఈ విధంగా అన్నాడు- 'ప్రఫుల్లా! నీ డబ్బు నాడబ్బే. దానిని చెల్లించటానికి నేనింతగా కోరవలసిన అవసరంలేదు. కాని ఇవాళ చాలా వేడుకొంటున్నాను. గత ఎదిసంవత్సరాలుగా నేను నిన్నేస్మరిస్తూ వచ్చాను. నాకు నురిద్దరు భార్యలున్నప్పటికీ నేను వారిని భార్యలగా నే భావించలేదు-నిన్నే భార్యగా భావించాను, ఎందుకని? నేను నీకా విషయం అర్థమయ్యేట్లు చెప్పలేకపోవచ్చు. నువ్విక ఈ లోకంలో లేవని విన్నాను. కాని నాకు మాత్రం నువ్వున్నావు. ఆతర్వాతకూడా నేను నిన్నే నా భార్యగా భావిస్తూవచ్చాను-నా మనస్సులో మరెవ్వరికీస్థానం లేనేలేదు. ఒక విషయం నీకింకో చెప్పాలని లేదు. కాని అందువల్ల నష్టమూ లేదు-నువ్వు చనిపోయావని విని నేనూ చనిపోవాలనుకున్నాను. చనిపోయివుంటేనే బాగుండేదని ఇప్పుడను కుంటున్నాను. ఇప్పుడు వింటున్నవన్నీ వినవలసివచ్చేది కాదు; నిన్నీ స్థితిలో చూడవలసి వుండేదికాదు. ఇవాళ నేను పదిసంవత్సరాలుగా పోగొట్టుకున్నసంపదను తిరిగిపొందాను. ఇవాళ నేను స్వర్గసుఖంకంటే ఎక్కువసుఖం పొంది వుండాల్సింది. అటువంటదేమీ జరగలేదు. ఇవాళ నువ్వు లభించటంవల్ల నామనస్సెంతో క్షోభపడుతోంది' అని ప్రజేశ్వరుడు ఒకక్షణమాగి రెండుచేతులతోనూ తలను గట్టిగా పట్టుకొని

'నేను నామనస్సులో స్వర్ణవిగ్రహాన్ని ప్రతిష్ఠించుకున్నాను-ఆ నా ప్రఫుల్ల, అయ్యో-ఆ ప్రఫుల్ల ఇటువంటిపని చేస్తోంది' అన్నాడు.

"ఏమిటది? దోపిడీ చేస్తున్నాననా?"

"చేయటం లేదా?"

దీనికి జవాబుగా ప్రఫుల్ల ఒకమాట చెప్పవచ్చు. వ్రజేశ్వరుని తండ్రి ప్రఫుల్లను ఇంటినుంచి గెంటివేసినప్పుడు ఆమె "నేను దరిద్రురాలను, మీరు గెంటవేస్తే ఎలా జీవిస్తాను?" అని అడిగింది మామగారిని అందుకు హరవల్లభుడు "దోపిడీలు, దొంగతనాలు చేసి బ్రతుకు" అని అన్నాడు. తెలివిగల ప్రఫుల్ల ఈ మాటను మర్చిపోలేదు. మర్చిపోగలిగే మాట కూడా కాదది. ఇవాళ వ్రజేశ్వరుడు ఆమెను దొంగ అని దూషిస్తున్నాడు. అందుకామె తగిన జవాబు చెప్పవచ్చు ఈనాడు."

"నేను దొంగననేది నిజమే; అయినా మీరింతగా దూషించటం దేనికి? ఆనాడు మీరే దొంగతనం చేసి బ్రతుకు అని చెప్పారు. నేను పెద్దల ఆదేశాన్ని శిరసావహిస్తున్నాను" అని చెప్పవచ్చు. కానీ ఈ జవాబును నిగ్రహించుకోటమే పుణ్యం. ప్రఫుల్ల పుణ్యం దక్కించుకొంది. ఆమె భర్తకు నమస్కరించి "నేను దొంగను కాదు. ప్రమాణం చేసి చెపుతున్నాను-నే నెప్పుడూ దోపిడీ చేయలేదు, దొంగసొత్తును అనుభవించనూ లేదు. మీరు నా దైవం. మరో దైవాన్ని పూజించటం నేర్చుకోజూశాను. కాని నేర్చుకోలేకపోయాను. సమస్త దేవతల్లోనూ మీరే వున్నారు. మీరే నా ఏకైక దైవం. ప్రమాణం చేసి చెపుతున్నాను-నేను దొంగను కాదు. జనులు నన్ను దొంగ అంటున్నారని

నాకు తెలుసు; ఎందుకు అంటున్నారో కూడా నేనెరుగుదును. ఆ విషయాలన్నీ మీరు వినాలి. అవన్నీ చెప్పటానికే ఇవాళ ఇక్కడికి వచ్చాను. ఇక మీ రెప్పుడూ వినబోరు"

"అ త్రివారింటినుంచి వెళ్ళిపోయిన తర్వాత జరిగిన విషయాలన్నింటినీ ఉన్నదున్నట్లుగా ప్రఫుల్ల ప్రజేశ్వరునితో చెప్పింది. ఆమె జీవితగాధవిని అతనికి విస్మయమూ కలిగింది, సంతోషమూ కలిగింది. లజ్జితుడై మహామహిమాన్వితురాలైన తన భార్యనుచూసి కొంచెంభయపడ్డాడు. ప్రఫుల్ల ఆసాంతము చెప్పి "నా మాటల్ని మీరువిశ్వసిస్తున్నారా?" అని అడిగింది.

విశ్వసించలేనిదేముంది. ప్రఫుల్ల చెప్పిన ప్రతిమాటా ప్రజేశ్వరుని మనస్సులో నాటుకుపోయింది. అతను జవాబేమీ చెప్పలేకపోయాడు. అయినా అతని ముఖంలోని కాంతినిచూసి నమ్మకంకుదిరిందనే భావించిందామె.

"ఇప్పుడిక మీ పాదధూళినిచ్చి నా కీజన్మలో శలవిప్పించండి. మీ రేమాత్రం ఇంక ఆలస్యం చేయవద్దు, ఆపద ముంచుకొస్తోంది. పది సంవత్సరాల అనంతరం కలుసుకొని కూడా మిమ్మల్ని వెళ్ళమని చెప్పాలంటే ఆ ఆపద సామాన్యమైనది కాదని మీరు గ్రహించే వుంటారు. ఈ నావలో నా చెలికత్తె లిద్దరున్నారు. వాళ్ళిద్దరూ బుద్ధిమంతులు. నా కెంతో ఇష్టులు. వారిని మీ వెంట తీసుకువెళ్ళండి. ఇంటికి వెళ్ళిన తర్వాత వాళ్ళిష్టం వచ్చినచోటికి పంపివేయండి. ఎప్పటిలాగే నన్ను మర్చిపోకండి. సాగర్‌తో నన్ను మర్చిపోవద్దన్నానని చెప్పండి."

ప్రజేశ్వరుడు చాలాసేపు. మౌనంగానే వున్నాడు. తర్వాత "ప్రఫుల్లా! నాకేమీ బోధపడటంలేదు. నీ బలగం

ఎక్కడుంది? నావలో నావికులు కూడా లేరేమి? ఇద్దరు స్త్రీలు మాత్రంవున్నారు, వారినికూడాపంపి వేయాలనుకుంటున్నావు. ఈ జన్మలో ఇక కలుసుకోలేము అంటున్నావు – ఇదంతా ఏమిటి? రాబోయే ఆపదలు ఏమిటో నాతో చెప్పు, లేనిచో నే నిక్కడనుంచి కదలను, అతర్వాతనైనా వెళ్తానో లేనో కూడా చెప్పలేను' అని అన్నాడు.

'అది మీరు వినవలసిన మాట కాదు.'

'అంటే నేను సివిషయం విననేగూడదా?'

ఇంతలో తుపాకి కాల్చిన శబ్దం విన్పించింది.

# 3

తుపాకి శబ్ద వినిఇద్దరూ త్రుళ్ళిపడిముందుకుచూశారు. అయిదు నావలు అటురావటం కన్పించింది. తెడ్లువేసినప్పుడు చిందే నీరు వెన్నెలలో మెరుస్తోంది. ఆ అయిదునావల్లోనూ సైనికులున్నట్లు తెలిసింది. తుపాకిశబ్దం వినిపించగానే అయిదు నావలూ ముందుకు సాగాయి. ఇదంతాచూసి ప్రఫుల్ల 'మీరిక క్షణంకూడా ఆలస్యం చేయవద్దు, వెంటనే వెళ్లి పొండి' అని చెప్పింది.

'ఎందుకని? ఆనావలు ఎవరివి? తుపాకికాల్చిందెవరు?'

'చెప్పనిదే వెళ్ళరా మీరు?'

'వెళ్ళను.'

'ఆనావల్లో కుంపినీ సైన్యంవుంది. కుంపినీ సైనికులే ఆ చెట్లచాటునుంచి తుపాకి కాల్చారు.'

'ఆసైనికులందరూ ఇటు ఎందుకొస్తున్నారు? నిన్ను పట్టుకోవటానికా?'

ప్రఫుల్ల మాట్లాడలేదు.

'నీకీవిషయం ముందుగానే తెలుసునని నీమాటలవల్ల అర్థమవుతోంది?' అన్నాడు వ్రజేశ్వరుడు.

'తెలుసు-అన్నిచోట్ల నా గూఢచారులున్నారు.'

'ఇక్కడికి వచ్చిన తర్వాత తెలిసిందా లేక అంతకు ముందే తెలిసిందా?'

'ముందుగానే తెలిసింది'

'అయితే తెలిసికూడా ఎందుకొచ్చావ్?'

'మిమ్మల్ని మరోకపర్యాయం చూడాలని'

'మీ దళం అందరూ ఎక్కడున్నారు?'

'అందర్నీ పంపివేశాను. నాకోసం వారెందుకు మరణించాలి?'

'లొంగిపోవాలని నిశ్చయించుకున్నావా!'

'ఇప్పుడిక బ్రతికి చేసేదేముంది? మిమ్మల్ని చూశాను, నామనస్సులోనివన్నీ మీకు చెప్పాను. మీరు నన్ను ప్రేమిస్తూనే వున్నారనికూడా తెలుసుకున్నాను. నావద్దవున్న ధనాన్నంతా పంచివేశాను. ఇప్పుడిక బ్రతికివుండి ఏమిచేస్తాను? తీరాల్సిన కోర్కెలూ లేవు.'

'ఎందుకులేవు?-ఇప్పుడిక నాతో ఇంటికి తిరిగివచ్చి సంసారం చేయవచ్చు.'

'మీరు నిజమే చెప్తున్నారా?'

'ప్రమాణం చేసి నువ్వు విషయాలన్నీ చెప్పావు. నేను కూడా ప్రమాణం చేసి చెప్తున్నాను. నువ్వు బ్రతికి బయటపడి- నిన్ను నా భార్యగా స్వీకరిస్తాను.'

"మామగారు ఏమంటారో?"

"వారికి నేను చెప్తాను."

"అయ్యో! నిన్ననే ఈ విషయం తెలిసివుంటే!"

"నిన్న వినివుంటే ఏం జరిగేది?"

'అప్పుడు నన్ను పట్టుకోగలిగే వారుండేవారే కాదు.'

"ఇప్పుడో?"

"ఇప్పుడిక మార్గమేమీ లేదు. మీరు నిశి, దివాలను తీసుకొని మీ పడవలోకి వెళ్ళిపోండి."

బ్రజేశ్వరుడు తనపడవవాళ్ళను పిలిచి కుంపెనీసైన్యం వస్తుందనీ, త్వరగా పారిపొమ్మనీ, తానిక్కడే వుంటాననీ చెప్పాడు. పడవవాళ్ళేమీ ప్రశ్నించలేదు. త్వరగా పడవను వదలి బయలుదేరారు. బ్రజేశ్వరుడు తనకు బాగా పరిచయమున్నవాడే గనుక బాడుగ విషయంలో అప్పటికేమీ మాట్లాడలేదు.

పడవ వెళ్ళిపోవటం చూచి "మీరు వెళ్ళలేదేం?" అని అడిగింది ప్రఫుల్ల.

"చావటం నీకు తెలిసినట్లు నాకు మాత్రం తెలియదా ఏం? నువ్వు నా భార్యవు. నేను నిన్ను వందపర్యాయాలు త్యజించవచ్చు. కాని నేను నీ భర్తను, ఆపద సమయంలో నిన్ను రక్షించే భారం నాదే. ఇప్పుడు నేను నిన్ను రక్షించలేను కనుక నిన్ను ఆపదలో వదిలి పారిపొమ్మంటావా?"

"అయితే తప్పించుకునే మార్గమేదైనా వుందేమో నేనూ ప్రయత్నించి చూస్తాను" అని ప్రఫుల్ల ఆకాశంలోకి చూడసాగింది. చూసినదానినిబట్టి ఆమెకుకొంచెంఆశకల్గింది. కానీ మరుక్షణానే నిరాశచెందింది "నేనుతప్పించుకుంటేమరొక అశుభం కలుగుతుంది" అని అంది.

"ఏమిటది?"

"ఆవిషయం మీతో చెప్పవద్దనే అనుకున్నాను. ఇప్పుడు చెప్పకతప్పదిక. ఆ సైనికులవెంట మా వృద్ధమామగారు న్నారు. నేను పట్టుబడనిచో వారికి ఆపద కలగవచ్చు."

వ్రజేశ్వరుడు భయకంపితుడై తలబాదుకొని "అయితే గూఢచారి వారేనా?" అని అడిగాడు.

ప్రఫుల్ల మాట్లాడలేదు. వ్రజేశ్వరునికి విషయమంతా అర్థమయింది. నేటిరాత్రి దేవీరాణి తనను ఇక్కడ కలుసు కుంటుందని వ్రజేశ్వరుడు తండ్రితో చెప్పాడు. వ్రజేశ్వరుడుఈ విషయంమరెవ్వరికిచెప్పలేదు. రాణియొక్క రహస్యాలుమరె వ్వరూ తెలుసుకోలేరు. రాణి ఇక్కడకుబయలుదేరే ముందు కుంపినీసైన్యాలు రంగపూర్ నుంచి కదిలివచ్చాయి. లేనిచో ఇంతత్వరగా ఇక్కడికి రాలేదు. హరవల్లభుడు ఎవ్వరికీ ఏమీ చెప్పకుండా ఎక్కడికో వెళ్లిపోయాడు. ఈనాటివరకు ఇంటికి తిరిగిరాలేదు. అందుకనే డబ్బువర్పాట్లుకూడా అతడు ఏమీ చేయలేదు. వ్రజేశ్వరుడు వెంటనే ఈవిషయాన్ని అర్థంచేసు కున్నాడు. అయినప్పటికీ అత డిశ్లోకాన్ని మర్చిపోలేదు.

పితా స్వర్గః పితా ధర్మః పితాహి పరమం తపః !
పితరి ప్రీతిమాపన్నే ప్రియంతే సర్వదేవతాః ॥

"నేను చనిపోయినా అభ్యంతరమేమీ లేదు. నువ్వు చనిపోవటం నాకు ఎంతో దుఃఖకారణమవుతుంది. నేను జీవించలేను. మనిద్దర్నీ రక్షించుకునేముందు నాన్నగారిని కాపాడాలి" అని అన్నాడు ప్రజేశ్వరుడు.

'ఆ భయమేమీ లేదు. నేనెలాగో తప్పించుకోలేను, వారి కేఆపదా రాదు. వారు తలుచుకుంటే మిమ్మల్నికూడా కాపాడగలరు. వారికి ఏమాత్రం కీడుజరిగే సూచనలు కన్పించినా నేను తప్పించుకోటానికి ప్రయత్నించనని శపథం చేస్తున్నాను. మీరుచెప్పినా చెప్పకపోయినా నేను చేయదలచిందదే. మీరునిశ్చింతగా వుండండి"

ఈమాటను ప్రఫుల్ల హృదయపూర్వకంగానే అంది. హారవల్లభుడు ఆమెను సర్వనాశనం చేసినప్పటికీ, ఇప్పుడు రాణిని నాశనంచేయయత్నించినప్పటికీ, ఆమె అతనిక్షేమాన్నే కాంక్షిస్తోంది. అందుకు కారణం ప్రఫుల్ల నిష్కామవ్రతి. నిష్కామధర్మాన్నాచరించేవారు, వ్యక్తుల్నిగాక వారిక్షేమాన్నే ఆలోచిస్తారు.

కానీ ఇంతలో నదీతీరపు అడవిలోనుంచి గంభీరమైన తూర్యనాదం విన్పించింది. ఇద్దరువ్యక్తులూ త్రుళ్ళిపడ్డారు.

# 4

"నిశీ!" అని పిలిచింది దేవి.

నిశి నావపైకి వచ్చింది.

"ఆ భేరీనాదం ఎవరిది?"

"గడంబాబా అనుకుంటాను."

"రంగరాజ్ దేనా?"

"అవును. అలాగే వుంది."

"అదేమిటి? నేను రంగరాజ్‌తో ఉదయమే దేవీగఢానికి వెళ్ళవలసిందని చెప్పానే?"

"మధ్యలోనుంచే తిరిగి వచ్చినట్లున్నారు."

"రంగరాజ్‌ను నావద్దకు పంపు."

"భేరీనాదం చాలాదూరానవినిపించింది. ఇక్కడినుంచి కేక అందదు. నేను వెళ్ళి అతనిని తీసుకువస్తాను" అన్నాడు వ్రజేశ్వరుడు.

"మీరేమీ చేయవద్దు, క్రిందికి వెళ్లి నిశియొక్క చాతుర్యాన్ని చూడండి" అని అంది రాణి.

వ్రజేశ్వరుడు, నిశి ఇద్దరూ క్రిందికివచ్చారు. నిశి ఒక పిల్లన గ్రోవిని తీసి పాడసాగింది. ఆవిద్యలో నిశికి మంచిప్రావీణ్యంవుంది. సంగీతవిద్యను ఆమె రాజదర్బారులో నేర్చుకొంది. రాణికి వీణ నేర్పిన గురువు నిశియే. ఆమె వేణువుపై మల్హారరాగం ఆలాపించింది కాస్సేపటికే రంగారాజ్ నావలోకి వచ్చాడు.

"నువ్వు నావపైకివెళ్ళు. నీముందు ఏ విషయాన్నీ దాచరు. అక్కడ జరిగేసంభాషణను వచ్చి నాతో చెప్పు" అన్నాడు వ్రజేశ్వరుడు నిశితో.

నిశిగదిలోంచిబయటకు వెళ్లి అంతలోనేమళ్ళీ వెనుదిరిగి వచ్చి 'మీరొకపర్యాయంఅటుచూడండి' అని చెప్పింది వ్రజేశ్వరునితో. వ్రజేశ్వరుడుతలవెళ్ళబెట్టి బయటకుచూశాడు-అడవిలోనుంచి లెక్కలేనంతమంది జనం బయటకు వస్తున్నారు.

అతడు నిశినుద్దేశించి "ఎవరు వాళ్ళందరు? సైనికులా?" అని అడిగాడు.

"మా లాఠీదళం వలెవుంది.' రంగరాజ్ వెంటవచ్చి వుంటారు."

దేవికూడా ఆమనుష్యుల్నే చూస్తోంది. ఇంతలో రంగరాజ్ వచ్చి ఆశీర్వదించి నిల్చున్నాడు.

"రంగరాజ్! నువ్విక్కడికి ఎందుకొచ్చావ్" అని అడిగింది రాణి.

రంగరాజ్ ఏమీమాట్లాడలేదు, రాణిమళ్ళీ అడిగింది—"నిన్ను ఉదయం దేవీగఢం పంపానుగదా! అక్కడికి ఎందుకని వెళ్ళలేదు. నా ఆజ్ఞను ఎందుకు తిరస్కరించావ్?"

"నన్ను దేవీగఢానికే పంపారు—మార్గంలో భవాని ఠాకూర్‌గారు కలిశారు—"

"భవానీ ఠాకూరా?"

"కుంపినీసైన్యం మిమ్మల్ని పట్టుకొనుటకు వస్తుందని వారిద్వారా తెలిసింది. అందుకని మేమిద్దరమూ మన వీరుల్ని తీసుకొని బయలుదేరి వచ్చాం. మన వీరుల్ని అడవిలో వుంచి నేను ఒడ్డున కూర్చున్నాను—కుంపినీనావలు బయలుదేరటంచూసి, భేరీనాదంద్వారా మన దళానికి తెలియపర్చాను."

'ఆ అడవిలోకూడా సైనికులు ఉన్నారా?'

'మేము వాళ్ళను ముట్టడించి వేశాం.'

'ఠాకూర్‌గారు ఎక్కడున్నారు?'

'మన దళాన్ని వెంటబెట్టుకొని అటుగావస్తున్నారు.'

"నువ్వెందరు వీరుల్ని తీసుకొచ్చావ్?"

"వెయ్యిమంది వరకు వుంటారు."

"సైనికులు ఎందరుంటారు?"

"అయిదు వందలని విన్నాం"

"ఈపదిహేనువందల మందిలో యుద్ధం జరిగితే ఎందరు మరణిస్తారు?"

"నాలుగైదువందలమంది వరకు మరణించవచ్చు."

"వెళ్ళి ఠాకూర్ గారితో చెప్పు, నువ్వుకూడా విను–మీరు చేసిన ఈపనికి నాహృదయం చాలాబాధపడుతోంది"

"ఎందుకని తల్లీ?"

"ఒకస్త్రీ ప్రాణాలనుకాపాడటానికి ఇందరి ప్రాణాలు తీయ యత్నించారుమీరు. మీకుధర్మజ్ఞానమేమీ లేనేలేదా? నాకు ఆయువుమూడితే నేనేమరణిస్తాను – నాగురించి నాల్గు వందలమంది చావడం ఎందుకు? ఇంతమంది ప్రాణాలు తీసి నా ప్రాణంకాపాడుకునేంత నీచురాల ననుకున్నారానన్ను"

"మీరుంటే అనేకమంది ప్రాణాలు నిలుస్తాయి." దేవి ద్వేషము, క్రోధంతో 'ఛీ' అంది గట్టిగా. ఈ తిరస్కారానికి రంగరాజు తలవంచుకున్నాడు. "భూమిబ్రద్దలైతే నేను అందులో ఇమిడిపోతాను" అని ఆలోచించ సాగాడతడు.

దేవి క్రోధంతో కళ్ళెర్రచేసి, ద్వేషంవెలిగ్రక్కుతూ "రంగరాజ్! తక్షణం మనదళాన్ని తీసుకొని వెళ్ళిపొమ్మని ఠాకూర్ గారితో చెప్పు. ఒక్క క్షణం ఆలస్యం చేశావంటే నేనీ నదిలో దుమికి ప్రాణాలు విడుస్తాను, అప్పుడిక మీరెవ్వరూ రక్షించలేరు నన్ను" అని అంది.

రంగరాజ్ ముఖం చిన్నబోయింది - 'నేను వెళ్ళి ఠాకుర్‌గారితో విషయాలన్నీ చెప్తాను. వారికి ఉచితమని తోచినదేదో చేస్తారు. నేను మీ ఇద్దరి ఆజ్ఞలను శిరసా వహించేవాడిని' అన్నాడు.

రంగరాజ్ వెళ్ళిపోయాడు. నిశి వారి సంభాషణంతా వింది. రంగరాజ్ వెళ్ళగానే ఆమె దేవిచెంతకువచ్చి 'నీ ప్రాణాలను నీయిష్టంవచ్చినట్లు చేసుకోవచ్చు. ఇతరులకు చెప్పే అధికారం లేదేమో. కానీ ఇప్పుడు నీ భర్తకూడా వున్నాడిక్కడ, వారినిగురించైనా ఆలోచించు' అని అంది.

'ఆలోచించాను సోదరీ! ఆలోచించికూడా ఏమీ చేయలేకపోయాను. ఇక ఆ పరమేశ్వరునిదే భారమంతా. జరగవలసిందేదో జరుగుతుంది. ఏది ఏమైనా ఒక విషయం మాత్రం ముఖ్యం. నా భర్త ప్రాణాలను కాపాడటానికైనా సరే ఇంతమందిని బలిచేసే అధికారం నాకులేదు. నా భర్త నాకు సర్వమున్నూ, కానీ వాళ్ళందరికీ ఏమవసరం?'

నిశి దేవి మాటలువిని లోలోపల ఆమెను ఎంతగానో శ్లాఘించింది. 'నిజమైన నిష్కామధర్మాన్ని నేర్చింది. ఈమెతోకలసి మరణించటంకూడా సుఖకరమే' అనియోచించింది నిశి.

నిశి వెళ్ళి ఈ విషయాలన్నింటిని ప్రజేశ్వరునితో చెప్పింది. ప్రజేశ్వరుడు ప్రఫుల్లను ఇప్పుడిక తన ధర్మపత్నిగానే అర్థంచేసుకోలేదు-'నిజంగా ఆమె దేవత. నేను మహాపాపిని. దొంగఅని నిందించటానికి వచ్చాను నేను' అనుకున్నాడు ప్రజేశ్వరుడు.

ఇటు అయిదునావలూ దేవిరాణి నావను సమీపించాయి. ప్రఫుల్ల వాటని కన్నెత్తి చూడనైనా లేదు. నిశ్చలంగా నావపై కూర్చుంది.

ప్రఫుల్ల కుంపినీవారి నావల్ని చూడటంలేదు, తమ దళాన్నీ చూడటంలేదు. ఆమె దూరంగా ఆకాశంలోకి చూస్తోంది. ఆకాశంలో చాలాసేపటినుంచి ఒక మబ్బుతునక కన్పిస్తోంది. చూస్తూచూస్తూ వుండగానే అది మరికొంచెం వ్యాపించింది. 'జయ్ జగదీశ్వర్!' అంటూ ప్రఫుల్ల నావపై నుంచి దిగివచ్చింది.

రాణి గదిలోకి రావటంచూసి 'ఇప్పుడేమి చేయదలచావు?' అని అడిగింది నిశి.

'నా భర్తను రక్షిస్తాను.'

'మరి నువ్వో?'

'నా విషయం అడగవద్దు. ఇప్పుడు నేనుచెప్ప బోయే విషయాన్ని, చేయబోయే విషయాన్ని జాగ్రత్తగాఆలోచించి అనుసరించు. నీసంగతి, నాసంగతి ఏమైనాసరే, నా భర్తను, దివాను, మామగారినీ రక్షించాలి.'

నిశితో ఈమాటచెప్పి రాణి శంఖంపూరించింది. 'సరే అంతవరకైనా మంచిదే' అంది నిశి.

'మంచి, చెడు తర్వాత చూడు. ఇప్పుడు చేయాల్సిందేమిటో నీకు చెప్తాను జాగ్రత్తగా విను. అంతా నీ మీదే ఆధారపడివుంది.'

# 5

త్రిస్రోతానదీ తీరానవున్న అడవిలోంచి దేవీరాణి వీర సైన్యం చీమలబారువలె బయటకువస్తోంది. ఎర్రని దుస్తులు ధరించారు- నీటిలో దిగాల్సి వస్తుంది కనుక వాళ్లెవరూ కాళ్ళకు పాదరక్షలుధరించలేదు. బల్లాలు ఢాలులుఉన్నాయి. అందరివద్ద తుపాకులుకూడా వున్నాయి కానీచాలాతక్కువే. అందరివద్దా లాఠీలున్నాయి. ఇది బెంగాలీల జాతీయఆయుధం. దీనినెలా ఉపయోగించాలో బెంగాలీలకు తెలుసు. లాఠీలు పోయిన తరువాతనే బెంగాలీలు ఇంత నిర్జీవులై పోయారు.

కుంపెనీనావలు దేవీరాణి నావను సమీపించాయి-అది చూసి వాళ్ళందరూ పరుగున దుముకుతూ వస్తున్నారు- 'దేవీ రాణీకిజై' అనే జయఘోషతో కుంపెనీ నావలపైకి బయల్దే రారు. వారు కుంపెనీ నావలకంటే ముందుగానే రాణి నావవద్దకు చేరుకున్నారు. శంఖనాదం వినగానే అనేకమంది వీరులు రాణి నావలోకి ప్రవేశించారు. అలా ప్రవేశించిన వాళ్ళందరూ నావనునడిపే నావికులే. అవసరమైతే లాఠీ. బల్లెములను ఉపయోగించటానికి కూడా సిద్ధపడేవారు, కానీ ఇప్పుడు వారికెవరికీ యుద్ధంలో పాల్గొనాలనే కోర్కెలేదు. అందరూ తమతమస్థానాల్లో తెడ్లు, తెరచాపలు, చుక్కాని వద్దకూర్చున్నారు. ఇంకా అనేకమంది వీరులు నావలోకి వచ్చారు. నాల్గయిదు వందలమంది ఒడ్డున నిలబడే కుంపెనీ నావలపైకి బల్లెములు విసరసాగారు. కుంపెనీసైనికులనేకమంది తుపాకులకు సన్నిలుతగిలించి క్రిందకిదుమికారు. మరికొందరు సైనికులు రాణి నావపై దండెత్తారు. ఇరుపక్షాలు చేతులు

కలిపి పోరాడసాగాయి. తుపాకి ధ్వనులు, మూల్గులు, లాఠీ దెబ్బలు- కేకలు- వీటన్నిటితో ఆ ప్రదేశం గందరగోళంగా తయారయింది. ఒకరిమాట ఒకరికి విన్పించటంలేదు.

ఇరుపక్షాలు దూరదూరంగా వుండి యుద్ధం చేస్తూ వుండటంవల్ల రాణి సైనికులను ఎదుర్కొ-లేక పోతున్నారు- దూరంగా వుండి లాఠీతో యుద్ధంచేయలేరు. నావల్లోవుండటం సైనికులకు కొంత ఇబ్బందిగానే వుంది. ఒడ్డున వున్న సైనికులు సన్నీలతో విజయవంతంగానే పోరాడుతున్నారు- నావల్లోవున్న సైనికులుమాత్రం బల్లెములు, లాఠీలు తగిలి నేలగూలుతున్నారు

ప్రఫుల్ల పైనుంచి క్రిందిగదిలోకి వచ్చిన కొద్దిసేపటికే ఇదంతా ప్రారభమయింది. 'భవానీఠాకుర్ కు నా వార్త అందివుండదు. ఒకవేళ అందినప్పటికీ వారు నా మాటను విన్పించుకొనివుండరు. నేను మరణించలేనని తలంచివుంటారు. సరే, నేనూ చేసిచూపిస్తాను' అనుకుంది.

రాణీగావుండే కాలంలో దేవీకి చాలా మంచి గుణాలనేకం అబ్బాయి. వాటిలో ఒక టేమిట 'టే, ఒకవస్తువేదైనా ఏవిధంగా ఉపయోగపడుతుందని భావించినాసరే తనవద్ద వుంచుకొనేది. వెంటనే దానిని ఉపయోగించే అవకాశం కూడా లభించింది. ఆమెవద్ద ఒక తెల్లజండావుంది, రాణి బయటకువచ్చి తెల్లజండాను పైకెత్తింది.

ఆజండాను చూడగానే యుద్ధం వెంటనే ఆగిపోయింది. ఎక్కడి వారక్కడే యుద్ధంచేయట మాని నిలబడ్డారు, ఉధృతంగావీచే తుఫానుఅకస్మాత్తుగా ఆగిపోయినట్లు. ఉవ్వెత్తుగా

లేచే సముద్రకెరటాలు అకస్మాత్తుగా ఆగిపోయాయి. ప్రశాంతమైన సరస్సువలె వున్నట్లుంది వాతావరణం.

వ్రజేశ్వరుడు తన చెంతనే నిలబడివుండటం రాణి గమనించింది. ఇటువంటియుద్ధసమయంలో రాణి బయటకు వెళ్ళటంచూసి వ్రజేశ్వరుడు ఆమె వెనుకనే బయటకు వచ్చాడు:

'మీరీ జండాను పట్టుకొని ఇక్కడే నిలబడివుండండి. నేను లోనికి వెళ్ళి నిశి, దివాలతో మాట్లాడాలి. రంగరాజ్ గనుక వస్తే నా ఆజ్ఞకు ద్వారంలో వేచివుండవలసిందని చెప్పండి' అని అంది రాణి వ్రజేశ్వరునితో.

రాణి వ్రజేశ్వరునికి జండానిచ్చి లోనికి వెళ్ళిపోయింది. వ్రజేశ్వరుడు జండానుపట్టుకొని వుండటంచూసి కల్లెర్ర చేస్తూ అతడు 'తెల్లజండాను చూపమని నీకెవరాదేశించారు?' అని అడిగాడు.

'రాణిగారు ఆజ్ఞాపించారు'

'రాణిగారి ఆదేశమా? నువ్వెవరు?'

'గుర్తించలేదా?

ఒక క్షణకాలం పరిశీలనగా చూసి రంగరాజ్ గుర్తించాడు. 'నువ్వు వ్రజేశ్వరబాబువా? ఇక్కడికి ఎందుకు వచ్చారు? తండ్రికొడుకులిద్దరూ ఒకే పనికోసం వచ్చారా? ఇతనిని బంధించండి' అన్నాడు రంగరాజ్.

హరవల్లభునివలె ఇతడుకూడా రాణిని పట్టించటానికే వచ్చాడనీ, ఏదో విధంగా నావలోకి చేరుకున్నాడనీ, ఆలోచించాడు రంగరాజు. రంగరాజు ఆదేశప్రకారం అతనిని బంధించటానికి ఇద్దరువ్యక్తులు ముందుకువచ్చారు. వ్రజేశ్వ

రుడు అందుకు అభ్యంతరం తెలుపలేదు. 'నన్ను బంధించ టానికి నాకేమీ అభ్యంతరం లేదు. తెల్లజండా చూపగానే యుద్ధం ఎందుకు ఆగిపోయిందో మాత్రం చెప్పండి' అని అడిగాడు.

'పాపం! పసిపాపవు కదూ? తెల్లజండా చూస్తే కుంపిని సైన్యం యుద్ధం చేయదనికూడా తెలియదా!' అని అడిగాడు రంగరాజు.

'నాకు అదేమీ తెలియదు. నాకు తెలిసినా తెలియక పోయినా ముందు నువ్వు మీదేవివద్దకు వెళ్ళి ఆమె ఆదేశాను సారం జండా చూపానో లేదో తెలుసుకో. నువ్వు ద్వారంలో వుంటే రాణీగారి ఆదేశం నీకు అందుతుందని చెప్పారు' అన్నాడు వ్రజేశ్వరుడు.

రంగరాజు గదిద్వారం చెంతకు చూశాడు, తలుపులు మూసివున్నాయి. 'అమ్మా, రాణీ!' అని పిలిచాడు.

'ఎవరు? రంగరాజా?'

'అవునండి! మన నావలోంచి తెల్లజండా చూపారు. అందుకనే యుద్ధం ఆగిపోయింది.'

'అది నా ఆదేశం ప్రకారమే జరిగింది. నువ్విప్పుడా తెల్లజండాను పట్టుకొని లెఫ్టినెంట్ వద్దకు వెళ్ళు. ఇప్పుడిక యుద్ధం చేయాల్సిన అవసరం లేదనీ, నేను లొంగి పోవడానికి సిద్ధమేననీ చెప్పు.'

'నేను జీవించివుండగా అది జరగదు.'

'ప్రాణాలర్పించి కూడా నన్ను కాపాడలేవు'

'అయినా, ప్రాణాలు అర్పిస్తాను.'

'నామాటవిను! మూర్ఖునిలా గోలచేయకు. సైనికుల తుపాకులముందు నీ లాఠీలు ఎందుకు పనికొస్తాయి?'

'ఏదైనా చేయగల్గుతాయి.'

'సరే మీ యిష్టంవచ్చినట్లే చేయండి- నేను జీవించి వుండగా ఒక్క రక్తబిందువైనా రాలటానికి వీల్లేదు. అది జరగటానికి ముందే నేను ప్రాణంత్యాగంచేస్తాను-బయటకు వెళ్ళి తుపాకుల కెదురుగా నిల్చుంటాను; మీ రెవ్వరూ రక్షించలేరు. ఇప్పుడు పట్టుబడితే తప్పించుకునే అవకాశం చిక్కుతుంది. కనుక నన్ను కాపాడటానికి మీ ప్రాణాలు' అర్పించవద్దు. నావద్దచాలా ధనంవుంది. కుంపినీ మనుషులు డబ్బుకు దాసులు- నేను తప్పించుకోటం చాలా తేలిక.'

లంచంఇచ్చి పారిపోవాలనేవిషయమే దేవిఆలోచించ లేదు. ఆ విధంగా చేయాలనే కోర్కెకూడా లేదామెకు. ఇదంతా రంగరాజ్‌ను ఓదార్చి పంపటానికి మాత్రమే. ఆమె బుర్రలో మెదులుతున్న ఆలోచనలను రంగరాజ్ గ్రహించ లేడు, కనుక అతనికి చెప్పటంకూడా వ్యర్థమనే భావించింది. ఆమె పైకి లొంగిపోవటానికేనిశ్చయించుకుంది, కానీ తనఎత్తు గడముందు కుంపినీదొరలు ఓడిపోతారని ఆమెకు తెలుసు. శత్రువులకు చెడుపు చేయకుండానే వారిని సావధానుల్ని చేయాలనుకొంది. కానీ భర్త, మామ, నిశి, దివాలనురక్షిం చటంకోసం ఇదంతా చేయుటకు సిద్ధపడింది ఆమె చేయదలచు కున్న కార్యక్రమాన్ని అద్దంలో చూచినట్లు స్పష్టంగా చూస్తూనేవుంది.

'మీరు లంచంఇచ్చి వారినివశపర్చుకోవాలనుకుంటు న్నారు, కానీ ధనం అంతా నావలోనేవుంది, మీరు పట్టు బడగానేనావనుకూడా వారు స్వాధీనపర్చుకుంటారు' అన్నాడు రంగరాజ్.

'నావనుమాత్రంస్వాధీనం చేసుకోవద్దని చెప్పువారితో. వాళ్ళు నన్నుమాత్రమే వశపర్చుకోవాలి. నావపై వారి కేమాత్రం అధికారంలేదు. నావలోవున్న సొత్తు, నావలో వున్న మనుష్యుల్ని వారేమీ చేయకూడదు.'

'వాళ్ళు అందుకు అంగీకరించక నావను దోచుకోడా నికి వస్తే?'

'నావను తాకటానికి కూడా సాహసించవద్దని చెప్పు. నావపైకి గనుక వస్తే నేను పట్టుబడను సరిగదా మళ్లీయుద్ధం ప్రారంభమవుతుందని హెచ్చరించు. మన షరతును అంగీక రిస్తే నేనే వారి నావలోకివస్తాను, వార్నెవరూ ఈనావలోకి రాకూడదు.'

ఈ పనుల్లో ఏదో గొప్పఎత్తుగడవుందని రంగరాజు గ్రహించాడు. ఆమె చెప్పినవిషయాలను ఆమోదించాడు. అప్పుడు రాణి 'భవానీఠాకుర్ ఇక్కడ వున్నారా?' అని అడిగింది.

'వారు నామాటను వినలేదు, ఇంకా యుద్ధంచేస్తూనే వున్నారు.'

'వెంటనే నువ్వువెళ్ళి వారిని కలుసుకో. మనవీరులను తీసుకొని తీరంవెంటే తిరిగివెళ్ళమని చెప్పు. నా రక్షణకు నావలోవున్న జనం చాలు. నన్ను రక్షించడానికి యుద్ధం

అవసరం లేదు, ఆ పరమేశ్వరుడే ప్రయత్నిస్తున్నాడని చెప్పు. అందుకు కూడ వారు అంగీకరించకపోతే ఆకాశంలోకి చూడమని చెప్పు. విషయమంతా బోధపడుతుంది వారికి.'

రంగరాజు తలపైకెత్తి ఆకాశంలోకి చూశాడు. వైశాఖమబ్బులు ఆకాశమంతటా వ్యాపించాయి. చుట్టూ అంధకారం ఆవరిస్తోంది.

'అమ్మా! నాదొక కోర్కె. హరవల్లభరాయ్ గూఢచారిగా వచ్చాడు. అతని కుమారుడు వ్రజేశ్వరరాయ్‌ను నే నిప్పుడు నావలో వుండగా చూశాను. అతను సదభిప్రాయంతో రాలేదనే నా ఉద్దేశ్యం. అతనిని బంధించాలనుకుంటున్నాను'

ఇది విని నిశి, దివాలు కిలకిలనవ్వేశారు.

'వద్దు బంధించవద్దు. వారిని అక్కడే కూర్చోని వుండనివ్వు, తర్వాత దివా ఆదేశాన్ననుసరించి దిగి వెళ్ళిపోతారు'

ఆమె ఆదేశానుసారం రంగరాజు వ్రజేశ్వర రాయ్‌ను నావ పైభాగాన కూర్చోనజేసి భవానీ ఠాకుర్ వద్దకు వెళ్ళి దేవీరాణి సందేశాన్ని చెప్పాడు. మేఘాలను చూచి ఠాకుర్ మరేమీ మాట్లాడకుండా తనదళంతో సహా వెనుదిరిగి వెళ్ళిపోసాగాడు.

నిశి, దివాలు బయటకువచ్చి నావికులకు రహస్యంగా ఏదో చెప్పారు.

## 6

భవానీ ఠాకుర్‌ను సాగనంపి రంగరాజు తెల్లజండా పట్టుకొని లెఫ్టినెంటుదొరగారి నావలోకి వెళ్లాడు. జండాను చూసి

ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. అతనిని చూడగానే దొర గారు 'మీరు తెల్లజండా చూపారు, లొంగి పోతారా?' అని అడిగాడు.

'మే మెందుకు లొంగిపోతాం? మీరు ఎవర్నయితే బంధించాలని వచ్చారో ఆమె మాత్రమే పట్టు బడుతుంది. ఆవిషయం తెలియ జేయటానికే వచ్చాను.'

'దేవీచౌధరాణి లొంగిపోతుందా?'

'అవును.'

'మరి మీరందరూ?'

'మే మెవరు?'

'దేవీ చౌధరాణి దళం.'

'మేము లొంగిపోము.'

'నేను మిమ్మల్నందరిన్నీ పట్టుకోవాలనే వచ్చాను'

'దళంలో ఎవరెవరున్నారో? ఈ వెయ్యిమంది జనం లో ఎవరు దళంలోనివారో; ఎవరుకారో మీకెలా తెలు స్తుంది?'

భవానీ ఠాకుర్ ఇంకా వెళ్ళిపోలేదు. వెళ్ళిపోయే ప్రయత్నంలో వున్నాడు.

'ఈ వెయ్యిమందీ దొంగలే. వీళ్ళందరూ దొంగలతో కలసిపోయి ప్రభుత్వంతో పోరాడుతున్నారు' అన్నాడుదొర.

'వాళ్ళేయుద్ధంచేయరు, వెళ్ళిపోతున్నారు - అదుగో చూడండి.'

దేవీచౌధరాణీ దళం పోతూవుండట దొరచూశాడు.

క్రోధంతో గర్జిస్తూ 'ఇదేమిపని! మీరు తెల్లజండా

చూసి పారిపోతున్నారా?' అని అన్నాడు.

'దొరగారూ! వాళ్ళు పారిపోతున్నారనటానికి మీరు పట్టుకొన్నదిమాత్రం ఎక్కడ? మీ చేతనయితే పట్టుకోండి. ఇదుగో ఉండాపా రేస్తున్నాను-' అని రంగరాజు తెల్లజండాను విసరివేశాడు. దొరగారిఆజ్ఞలభించనందువల్ల సైనికులుఎక్కడి వారక్కడే మెదలకుండా వుండి పోయారు.

వారిని వెంబడించటం వ్యర్థమనే భావించాడు దొర. రాత్రిసమయం, పైగా మబ్బులుపట్టి మరింత అంధకారంగా వుంది; అడవిలో మార్గమేకన్పించదు. సైనికులకు ఆ అడవి లోనిమార్గాలు తెలియవుకనుక ఆదళాన్ని వెంబడించలేరు. దొర ఆ వుద్దేశ్యాన్ని వదులుకున్నాడు.

'సరే, వాళ్ళను వెళ్ళనీ. జరిగేంతవరకే జరుగుతుంది. మీరందరూ లొంగిపోతారా?'

'ఒక్క దేవీరాణి తప్ప మరెవ్వరూ పట్టుబడరు.'

'ఫిస్! ఇకమీరేమిచేయగలరు? అయిదువందలమంది సైనికులతో మీరు యుద్ధంచేయలేరు. మీదళం అడవిలోకి వెళ్ళిపోయింది!'

నిజంగానే భవానీ ఠాకుర్ సైన్యం అడవిలో అదృశ్య మైపోవడం రంగరాజు గమనించాడు.

'నాకవేమీ తెలియవు. నాకు చెప్పిన విషయాలనుమీతో చెప్పాను. నావమాత్రం మీ అధీనం చేయబడదు, నావలో వున్న ధనం మీకులభించదు. మాలోఎవరూ మీకులొంగి పోరు, దేవీరాణీ మాత్రమే పట్టుబడుతుంది.'

'ఎందుకని?'

'అదినాకు తెలియదు.'

'నీకు తెలిసినా తెలియకపోయినా, ఆ నావమాత్రం ఇకనాదే, దానిని స్వాధీనపర్చుకుంటాను.'

'మీరు నావలోకి వెళ్ళకండి. దానినితాకటానికికూడా వీల్లేదు. లేనిచో ప్రమాదం వాటిల్లుతుంది.'

"ధత్! మా అయిదువందల మంది సైనికులకు మీరు నలుగురైదుగురు ప్రమాదం కల్గిస్తారా?'

వెంటనే లెఫ్టినెంట్ తెల్లజండాను విసరివేసి 'నావను పట్టుకోండి' అనిఆదేశించాడు. సైనికులు నావనుముట్టడించారు.

'నావపైకివెళ్ళి, అక్కడవున్న ఆయుధాలను స్వాధీనం చేసుకోండి' అని ఆజ్ఞాపించాడు దొర. ఆమాట దేవికికూడా విన్పించింది 'మీావద్దవున్న ఆయుధాలనునదిలో పారేయండి' అని ఆజ్ఞాపించింది రాణి బిగ్గరగా. దేవీరాణి ఆజ్ఞను వినగానే నావలోని వాళ్ళందరూ తమతమ ఆయుధాలను నదిలో పారేశారు. ఇది చూచి దొరకు చాలా అసంతృప్తి కల్గింది.

'నావలోకి వెళ్ళిచూద్దాంఏముందో?' అన్నాడుదొర.

'దొర! మీరు జబర్దస్తీగా నావలోకి వెళ్తున్నారు. తర్వాత నన్ను నిందించి ఫలితంలేదు' అన్నాడు రంగరాజు.

'నిన్ను నిందించటం ఎందుకు?' అనిదొర ఒక్కసైనికుణ్ణిమాత్రమే వెంటబెట్టుకొని నావలోకివెళ్ళాడు. అదిగొప్ప సాహసకార్యమేమీకాదు. నావలో ఎవరివద్దా ఆయుధాలు లేవు. దేవీరాణికి దివ్యాస్త్రివంటి అపారమైన మేధాసంపత్తి వుందని దొరకు తెలియదు. అందుకు మరో ఆయుధాలు అవసరంలేదు.

రంగరాజు కూడా దొర వెంట నావలోకి వెళ్ళాడు. గది ముందుకు వెళ్ళగానే తలుపులు తెరుచుకున్నాయి. లోనికి అడుగు పెట్టగానే అక్కడిదృశ్యాన్నిచూసి ఇద్దరికీఆశ్చర్యం కల్గింది.

మొట్టమొదట బ్రజేశ్వర రాయ్‌ను బాధించి తెచ్చిన రోజున ఏవిధంగా ఆగది అలంకరించబడివుందో అదేవిధంగా వుందిప్పుడు కూడా. గోడలపై అందమైన చిత్రాలున్నాయి. అందమైన తివాసీపరిచివుంది. వివిధసుగంధద్రవ్యాలున్నాయి. వెండి స్తంభాలపై సుగంధ తైలదీపాలు వెలుగుతున్నాయి. పైనుంచిబంగారు గొలుసుకొక బంగారుదీపంవ్రేలాడుతోంది. కానీ ఇవాళఅక్కడ ఒక్క బాలీసుకాదు, రెండుబాలీసులున్నాయి. సువర్ణ రత్నాభరణాలు అనేకం ధరించిన అందమైన యువతులిద్దరు కూర్చొనివున్నారు. విలువైన దుస్తులు ధరించివున్నారు. దొరవాళ్ళనుగుర్తించలేదు, వాళ్ళిద్దరూ నిశి దివాలని రంగరాజు గుర్తించాడు.

కూర్చునేందుకు దొరగారికి ఒక వెండిపీట వేశారు. అతడు దానిమీద కూర్చున్నాడు. దేవీరాణి ఎక్కడుందా-అని చుట్టూ చూడసాగాడు రంగరాజు. గదిలో ఒకమూల ఒక సామాన్యమైనదుస్తులుధరించి దేవీనిల్చొనివుంది. ఆమె వేషంలో ప్రత్యేకత ఏమీలేదు. ముతకచీర, విరబోసినజుట్టు, చేతికి ఒకగాజు.

'దేవీ చౌధరాణి ఎవరు? నేనెవరితో మాట్లాడాలి?' అని అడిగాడు దొర.

'నాతో మాట్లాడండి. నేనే దేవీరాణీని' అంది నిశి.

అందుకు దివానవ్వి 'ఇంగ్లీషువారని ఎగతాళి చేస్తున్నావా? ఇది ఎగతాళిచేసే సమయమా! దొరగారూ, మా చెల్లికి పరిహాసాలాడటమంటే మహాసరదా. ఇది పరిహాసాలకు సమయంకాదు. మీరు నాతో మాట్లాడండి, నేనే దేవీ చౌధరాణిని' అని అంది.

'చచ్చావ్! నన్నుగురించి నువ్వు ఉరికంబం ఎక్కడ మెందుకు?' అని నిశి దొరనుద్దేశించి 'దొరగారూ, ఈమె మాఅక్క. నాపైవుండే ప్రేమవల్లనన్నుకాపాట్టానికి మీతో అబద్ధంచెపుతోంది. కానీ, నాప్రాణాలుకాపాడుకోటానికి అక్క ప్రాణాలను అర్పించేంత మూర్ఖురాలను కాదు. ప్రాణాలు తుచ్ఛమైనవి. మాబెంగాలీస్త్రీలు తేలికగా ప్రాణత్యాగం చేయగలరు. నేనే దేవీరాణిని! ఎక్కడికి రావాలంటారు?' అంది నిశి.

'దొరగారూ, మీఏసుక్రీస్తుమీదఒట్టేసి చెపుతున్నాను, నిరపరాధిని బంధించకండి. నేనే దేవిని!' అంది దివా.

దొర వ్యాకులతతో రంగరాజు నుద్దేశించి 'ఏమిటీ తమాషా? వీరిద్దరిలో దేవి చౌధరాణీ ఎవరో నువ్వయినా చెప్పు' అని అడిగాడు.

రంగరాజుకు ఏమీ అర్థంకాలేదు. ఇందులో ఏదో ఎత్తువుందని మాత్రం అతడూహించాడు అందుకని బుద్ధియుపయోగించి నమస్కరిస్తూ నిశిని చూపుతూ—

'ఈమెయే దేవీ చౌధరాణీ' అని అన్నాడు.

ఇంతవరకు మౌనం వహించిన దేవీ నోరువిప్పిమాట్లాడింది. 'నేను మధ్యలో కలిగించుకొనిమాట్లాడవలసిందికాదు;

కానీ ఈ అబద్ధం ఆధారంతో పట్టుబడినప్పుడు అందరూ చంపబడతారనే ఉద్దేశ్యంతో నిజం చెప్తున్నాను. ఈమె దేవికాదు. రంగరాజ్ దేవిని తల్లిగా భావిస్తాడు. అందుకని ఆమెపైవుండే ప్రేమవల్ల దేవిని రక్షించటంకోసం సరో కర్ని రాణి అని చెప్తున్నాడు' అని అంది.

దొర విసుగుతో 'ఐతేమరిరాణిఎవరు?' అన్నాడు.

'నేనే దేవిని' అని అంది రాణి.

ఈ విషయంలో రాణికి, నిశి-దివాలకు, రంగరాజుకు మధ్య వాదవివాదాలు ప్రారంభమయ్యాయి. రంగరాజు నిశిని దేవి అంటున్నాడు. దేవి, నిశి, దివాలు 'నేను దేవినంటే నేను దేవిన'ని వాదించుకోసాగారు. దీనితో పెద్దరభస ప్రారంభమయింది.

దొరగారు ఏదోవిధంగా ఆ వివాదాన్ని పరిష్కరించాలని తలచి 'మీ ఇద్దరిలో ఎవరో ఒకరు రాణియై వుంటారు. ఈమెమాత్రం దాసీ, దేవికాదు. మీలో ఆ పాపాత్మురాలెవరో చెప్పండి. మీరుదాచటంవల్ల ప్రయోజనమేమీ లేదు. ప్రస్తుతానికి మీ ఇద్దర్నీ బంధించి తీసుకుపోతాను.ఆతర్వాత చౌధరాణి ఎవరైతే వారినిఉరితీస్తాము' అని అన్నాడు.

అప్పుడు నిశి, దివా లిరువురూ 'ఇంత వివాదం ఎందుకు? మీ వెంట ఒకగూఢచారి వచ్చాడుగదా? వారుఇక్కడవుంటే పిలిపించండి. చౌధరాణి ఎవరో చెప్పేస్తారు.' అన్నారు.

రాణియొక్క ముఖ్యోద్దేశ్యం హరవల్లభ బాబును నావలోకి పిలిపించటమే. అతనిని రక్షించనిదే రాణి తనరక్ష

ణను గురించి ప్రయత్నించడు. నావలోకి రాకుండా వారు సుర క్షితంగా వుంటారనే నమ్మకంలేదు.

ఇదికూడా త్రోసివేయాల్సిన ఉపాయంకాదని భావించాడు దొర. తనవెంట వచ్చిన సైనికునితో హరవల్లభరాయ్‌ను పిలిపించమని చెప్పాడు. 'ఎక్కడ, ఎక్కడ' అని అందరూ కేకలువేయసాగారు. ఆగూఢాచారిఎవరో, ఎక్కడున్నాడో ఎవరికీ తెలియదు.

## 5

హరవల్లభరాయ్ ఆసమయమందు యుద్ధక్షేత్రంలోనే ఉన్నాడు. అయితే విధిలేక వున్నాడేకాని ఇష్టంవుండికాదు. మొట్టమొదట ఆ సమీపానికికూడా రాలేదు. 'శృంగిణాన్ శస్త్రపాణినామ్' ఇత్యాది చాణక్యుని ఉపదేశాలను స్మరించుకొని సైనికులున్న నావల్లోకి వెళ్ళలేదు. ఒక చిన్నబోటులో వచ్చి దేవీరాణినావను లెఫ్టినెంట్‌కుచూపించి అక్కడినుంచి అరక్రోసుదూరం పారిపోయాడు. మబ్బులు దట్టంగా పట్టినందువల్ల తుఫాను గనుకవస్తే తనబోటుమునిగిపోతుందేమోనని భయపడ్డాడు. డబ్బుకు ఆశిస్తే ప్రాణాలేపోతాయి. దహన సంస్కారం చేయటానికి నాశవంకూడా దొరకదు. అనిఆలోచించి బోటులోంచి గట్టుకుచేరుకున్నాడు. కానీ అక్కడ చుట్టుపట్ల ఒక మనిషైనా కన్పించకపోయేసరికి వాడికి చాలా భయంవేసింది. తేళ్ళు, పాములు, పులులు, దొంగలు గుర్తుకొచ్చేసరికి తానిక్కడికి రావటంఅనవసరమేననిభావించాడు. హరివల్లభుడుకి దుఃఖం ముంచుకొచ్చింది.

ఆదేశానుయాన తుపాకి కాల్చిన ధ్వని వినవచ్చింది. సైనికుల కోలాహలం తగ్గిపోయింది. సైనికులు జయించి వుంటారనీ, ఆ దొంగలరాణిని బాధించివుంటారు, గనుకనే యుద్ధం ఆగిపోయివుంటుందని భావించాడు హారవల్లభుడు. ఇప్పుడిక యుద్ధం క్షేత్రంలోకి వెళ్ళాలనే అనుకున్నాడు. అయితే ఈ అంధకారంలో వెళ్ళే దెలా? ఆ బోటువానిని పిలిచి "అక్కడికి వెళ్ళేదెలా?" అని అడిగాడు హారవల్లభుడు.

"వెళ్ళటానికేముంది, బోటులోకిరండి, తీసుకువెళ్తాను. మళ్ళీ యుద్ధం ప్రారంభమైతే మనల్ని చంపరుగదా?" అని అడిగాడు నావికుడు.

"సైనికులును మనల్నేమీ చేయరు. ఇప్పుడిక యుద్ధం కూడా జరుగదు. దొంగలందరూ పట్టుబడ్డారు. మబ్బుల్ని చూస్తే తుఫాను ముంచుకొచ్చేటట్లుంది, బోటులో వెళ్ళే దెలా" అని అన్నారు హారవల్లభుడు.

"తుఫాను వచ్చినా బోటు మునగదు" అన్నాడు నావికుడు.

అతని మాటమీందు నమ్మకం లేకపోయినా మరో గత్యంతరం లేక హారవల్లభుడు బోటులోకి వెళ్ళాడు. బోటు నెమ్మదిగా నావవద్దకు చేరుకొంది. సైనికుల సంకేతభాష హారవల్లభునికి తెలుసు. అందుకని అతని నెవరూ ఏమీ అనలేదు.

అప్పుడే హారవల్లభునికోసం సైనికులు వెతుకుతున్నారు. హారవల్లభుడు నావలోకి వెళ్ళి అక్కడున్న బంట్రోతుతో "నేనే గూఢచారిని" అని చెప్పాడు.

"కెప్టెన్ దొరవారు మిమ్మల్ని పిలిచారు" అని చెప్పాడా బంట్రోతు.

"ఎక్కడున్నారు?"

"గదిలో వున్నారు, మీరుకూడా వెళ్ళండి"

హరవల్లభుని రాకసంగతి తెలిసి దేవి వెళ్ళడాని కుపక్రమించింది.

"దొరవారికి ఫలహారం ఏర్పాటుచేస్తాను" అని అటూ దేవి లోనికి వెళ్ళింది.

హరవల్లభుడు గదిలోకి అడుగు పెట్టగానే అక్కడి ఐశ్వర్య అలంకారాలను, నిశి, దివాల అందచందాలను చూసి చకితుడయ్యాడు. దొరగారికి సలాం చేయటం మర్చిపోయి నిశికి నమస్కరించారు. నిశి నవ్వి "నమస్కారం ఖాన్ గారూ!" అని అంది.

ఆమాట విని దివాకూడా "నమస్కారం ఖాన్ గారూ నాకు నమస్కరించలేదేం? నేను వీరికి రాణిని" అని అంది.

దొరగారు హరవల్లభబాబునుద్దేశించి "వీళ్ళిద్దరూ మేమే దేవీ చౌధరాణీమని మోసంచేస్తున్నారు. ఇంతకూ అసలు దేవీచౌధరాణీ ఎవరో తెలియక మీకు కబురంపాను. వీరిలో దేవీరాణి ఎవరు?" అని అడిగాడు.

హరవల్లభుడు చాలా ఇరకాటానపడిపోయాడు. గడచిన ఏడు ఏడు పదునాల్గు తరాల్లోనూ దేవీరాణిని ఎవరూ చూడలేదు. ఏమీచేయాలాఅని కాస్సేపు తీవ్రంగా ఆలోచించి నిశిని చూపించాడు. నిశి కిలకిల నవ్వింది. కంగారుపడుతూ "పొరపాటు" అంటూ ఈ పర్యాయం దివాను చూపించాడు.

దివాకూడా కిలకిల నవ్వేసింది. మరింత గాబరాతో హారవల్లభుడు మళ్లీ నిశిని చూపించాడు. దొరగారు క్రోధోన్మత్తులై హారవల్లభాబు నుద్దేశించి ఛీ జాతిహీనుడా! పందీ! గుర్తించలేవా?," అని అన్నాడు.

"దొరగారూ! ఆగ్రహించకండి. వారికి తెలియదు. వారి కుమారునికి తెలుసు. వారబ్బాయి ఇప్పుడీనావపైభాగాన వున్నాడు. ఇక్కడికి రప్పించండి, వారు గుర్తించవచ్చు" అని అంది దివా.

హారవల్లభుడు ఆకాశంనుంచి క్రిందికి పడ్డట్లు అదిరిపడి "మా అబ్బాయా?" అని అడిగాడు.

"అనే విన్నాం."

"వ్రజేశ్వరుడేనా?"

"అవును. అతడే."

"ఎక్కడున్నాడు."

"నావ పైభాగాన."

"వ్రజేశ్వరుడు ఇక్కడికెలా వచ్చాడు?"

"అదికూడా అతడే చెప్తాడు"

అతనిని పిలిపించమని ఆదేశించాడు దొర. దివా రంగరాజుకు సైగచేసింది. అతడు నావపైకి వెళ్ళి "దివాదేవి మిమ్మల్ని రమ్మంటున్నారు" అని చెప్పాడు వ్రజేశ్వరునితో.

వ్రజేశ్వరుడు దిగి గదిలోకివచ్చాడు. దివా ఆదేశించినప్పుడే క్రిందికి రావలసిందని దేవీరాణి ముందుగానే చెప్పి వుంది.

దొర వ్రజేశ్వర రాయ్‌ని చూసి "నువ్వు దేవీ చౌధరాణిని గుర్తించగలవా?" అని అడిగాడు.

"గుర్తించ గలను."

"ఇక్కడ వున్నవారిలో దేవీచౌధరాణి వుందా?"

"లేదు."

దొర క్రోధంతో కన్నుగానక "ఏమిటి? వీళ్లిద్దరిలో ఎవరూ దేవిచౌధరాణి కారా?" అన్నాడు.

"వాళ్లిద్దరూ ఆమె దాసీలు."

"ఓహో! అయితే నువ్వు దేవి నెరుగుదువా?"

"బాగుగా ఎరుగుదును."

"మంచిది, వీళ్లిద్దరూ కానిచో దేవినావలో నేఎక్కడో దాగివుంటుంది. ఆ దాసీవేషంలో వున్న స్త్రీయే దేవీరాణీ కావచ్చు, నేను న వనుసోదా చేస్తాను. నువ్వు నా వెంటవచ్చి దేవి ఎవరో చూపించు."

"మీరు సోదా చేయదల్చుకుంటే చేసుకోండి. చూపించాల్సిన అవసరం నాకేముంది?" అన్నాడు వ్రజేశ్వరుడు.

ఆ జవాబువిని దొరగారికి చాలా విస్మయంకల్గింది_ "ఏంరా కులహీనుడా! నువ్వు గూఢచారివి కావా?" అని గర్జించాడు.

"కాదు" అని వ్రజేశ్వరుడు గట్టిగా చాచి దొరగారి చెంప అదిరేట్లు చరిచాడు.

"అయ్యో! అదేమిటనిరా! ఇంకేముంది, కొంపదీశావు" అనివిక్ళ్ళాడు హరవల్లభుడు.

'తుపాను' అని అరిచారు బయటినుంచి జమీందారు.

ఉన్నకొద్దీ తుఫాను ఉధృతం కాసాగింది.

బ్రజేశ్వరుడు దొరగారిని కొట్టగానే గదిలోంచి రెండు సార్లు శంఖం పూరించారు.

నావను ఒక మేకుకు కట్టారు. అక్కడ ఇద్దరు మనుష్యులు కూర్చొనివున్నారు. శంఖనాదం వినగానే వాళ్ళిద్దరూ త్రాటిని వదలి నావలోకి చేరుకున్నారు ఒడ్డునవున్న సైనికులు వారిని చంపుటకు ముందుకువచ్చారు. కాని కనురెప్పపాటులో వారినిట[illegible]ర్ కోటం, నావరివ్వన గాలి వాలుగా మాసుకుపోవటం జరిగింది. దేవి యొక్క బుద్ధికుశలతముందు అయిదువందలమంది కుంపినీ సైనికులు క్షణంలో ఓడిపోయారు.

దొరగారు బ్రజేశ్వరుని దెబ్బకుప్రతీకారం చేయాలని పిడికిలి బిగించి పైకెత్తేలోగా ఇది జరిగింది. అంతకు ముందిచ్చినఆదేశాలననుసరించి శంఖనాదంవినగానే క్షణంలో అన్నీ చకచకా జరిగిపోయాయి. గాలి విసురుకు నావ ఒకప్రక్కకు వరగడంతో దొరగారు చట్టచుట్టుకొని నిశి, దివాలపాదాల ముందుకు దొర్లారు. బ్రజేశ్వరుడు, రంగరాజ్ దొరగారి మీద పడ్డారు. హరవల్లభుడు మొదట నిశిపైబడ్డాడు; ఆ తర్వాత రంగరాజు పాదాలవద్దకు దొర్లుకుపోయాడు. నావ మునిగిపోయిందనీ, ఇప్పుడిక ఆ కాళీకాదేవికూడా రక్షించ లేదని ఆలోచించాడు.

కానీ నావ మునిగిపోలేదు. నిలదొక్కుకొని గాలు వాలుగా విద్యుత్తులా సాగిపోయింది. క్రిందపడిపోయిన వా రందరూ మళ్లీ లేచి నిల్చున్నారు. నావచుట్టూ నీటిలో

కలిచివున్న కుంపినీసైనికులు నావక్రిందపడి మునిగిపోయారు. కొందరికి దెబ్బలు తగిలాయి. మరికొందరు ముందుగానే తప్పుకున్నారు. వారిబోటులుకూడానావనుఢీకొనిమునిగిపోయాయి. నది అక్కడ లోతుగా లేకపోవడంవల్ల ఎవరూ మరణించలేదు. కానీ పైకిలేచి చూస్తే నావ ఎవరికీ కన్పించలేదు. తుపానులో కలిసిపోయి నావ ఎటుగా వెళ్ళిందోకూడాఎవరూ చూడలేకపోయారు కుంపినీసైన్యం చిన్నాభిన్నమైపోయింది. దేవి వారందర్నీ ఓడించి ముందుకు సాగిపోయింది. దొరగారు, హారవల్లభుడు వారికి బందీలయ్యారు. క్షణకాలంలో విజయం లభించింది. అందుకనే దేవి ఆకాశంలోకి చూసి 'పరమేశ్వరుడే నన్నుకాపాడుటకు ఉద్యమించుచున్నాడు' అని అంది.

## 8

నావ నదీప్రవాహాన్ని చీల్చుకొంటూ బాణంవలె రివ్వున దూసుకుపోతోంది. అలలుఉవ్వెత్తుగాలేచి నావనుతాకటంవల్లభయంకరశబ్దంపుడుతోంది, తుపానుకూడా భయంకరంగావుంది. కానీఇటువంటిఆపదల్ని ఎదుర్కొనేందుకువీలుగా నిర్మించబడిందానావ. నావికులుకూడా బాగా ఆరితేరినవారు. నాలుగు తెరచాపలతో నావ చాలా తీవిగా సాగిపోతోంది. నావబరిగినప్పుడు పుచ్చకాయులవలె దొర్లిన వాళ్ళందరూ, నెమ్మదిగా లేచినిల్చున్నారు. హారవల్లభ బాబుయజ్ఞోపవీతాన్ని వ్రేలికి చుట్టుకొని కాళికాదేవిని స్మరించుకొంటున్నాడు.

మునిగిపోతామని అతనిభయం. దొరగారు పిడికిలి బిగించి ప్రజేశ్వరునిపైకి లంఘించారు. ప్రజేశ్వరుడు పైకిలేచిన దొర గారి చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

'అయ్యో! ఎంతపనిచేశావ్? ఇంగ్లీషువారితో దెబ్బ లాడుకున్నావా!' అని హారవల్లభుడు తన కొడుకును నిందించాడు.

'నేను వారితో దెబ్బలాడుతున్నానా లేక వారునాతో దెబ్బలాడుతున్నారా?' అన్నాడు ప్రజేశ్వరుడు.

'అయ్యా! వాడింకాచిన్నవాడు. బుద్ధిహీనుడు. అతని తప్పును క్షమించండి' అని హారవల్లభుడు చేతులు జోడించి దొరగారిని ప్రార్థించాడు.

'చాలా తుంటరి.నమస్కరించి క్షమాభిక్ష వేడుకుంటే మన్నిస్తాం' అన్నాడు దొర.

'ప్రజేశ్వరా! అలాగేచేయరా బాబూ! దొరగారికి నమస్కారంచేసిక్షమాభిక్ష వేడుకో!' అన్నాడు హారవల్లభుడు.

'మహాశయా! మాహిందువులు తండ్రిఆజ్ఞనుధిక్కరించరు.మీకునమస్కారం, మన్నించమని కోరుతున్నాను అని అన్నాడు ప్రజేశ్వరుడు.

దొరగారు ప్రజేశ్వరుని పితృభక్తిని చూసి చాలా సంతసించి అతనినిమన్నించాడు.అతడు ప్రజేశ్వరునిచేతినిపట్టుకొని గట్టిగా వూపాడు.గత పదునాలుగు తరాల్లోనూ -వారి వంశంలో'షేకేహాండ్' పేరునుకూడాఎవరూ వినివుండలేదు-మూఢునివలె చూస్తూనిల్చున్నాడు. మళ్ళీ మరోపర్యాయం కరస్పర్శ చేయవలసి వస్తుందనే భయంతో బయటకు వెళ్ళి

కూర్చున్నాడు. తుపానుమాత్రం ఉధృతంగావుంది, వర్షం అంత ఎక్కువగా లేదు.

రంగరాజుకూడా బయటకువచ్చి ద్వారాన్ని ఆనుకొని కూర్చున్నాడు–రెండుప్రక్కలా కాపలావుంది. అటువంటి సమయమందు జాగ్రత్తగా వుండటం చాలా అవసరం. నావ చాలా జోరుగా పోతోంది. హఠాత్తుగా ఏదైనా ఆపద సంభవించినా సంభవించవచ్చు.

దొరగారు మళ్లీ ఆవెండి పీటపైకూర్చొని 'ఈదొంగల చేతుల్నుంచి యిప్పుడేవిధంగా బయట పడాలి? వీళ్ళను బంధించటానికి వచ్చి నేనే బంధించ బడ్డాను .. స్త్రీలతో ఓడిపోయాను. ఇక ఇంగ్లీషువారికి ముఖం చూపేదెలా? తిరిగి వెళ్ళకుండా వుంటేనే మంచిది' అని ఆలోచించ సాగాడు.

కూర్చొనుటకు హరవల్లభునికి ఎక్కడా చోటు కన్పించలేదు. నిశి శాలీసు చెంత కూర్చున్నాడు వెళ్ళి.

"మీరు కాస్సేపు నిద్రిస్తారా?" అని అడిగింది నిశి.

"ఇప్పుడిక నిద్రమాత్రం వచ్చేటట్టుందా?"

"ఇప్పుడు రాకపోతే మరెప్పుడు వస్తుంది?"

"అంటే మీ వుద్దేశ్యం?"

"ఇంకా మీకు నిద్రపోయే అవకాశం ఎక్కడ దొరుకుతుంది?"

"ఏం?"

"మీరు దేవీచౌధరాణిని బంధించటానికి వచ్చారు గదా!"

"అది–అది మీకు తెలుసా?"

"ఒకవేళ పట్టుబడివుంటే ఏమిజరిగేదో తెలుసా?"

"ఏం, ఏమీజరుగదు_ఏం జరుగుతుంది?"

"మరేశిక్షా కాదు_ఉరిశిక్ష విధించేవారు."

"అదేమీ జరిగేదికాదు_అది___"

"దేవి నీకు అపకారమేమీ చేయలేదు. పైగా నీకు చాలా ఉపకారంచేసింది. నీ గౌరవమర్యాదలు మంటగలసి నీ ప్రాణాలుపోయే తరుణంలో యాభైవేల ధనసహాయంచేసి నిన్ను రక్షించింది. అందుకు నువ్వు చేసే ప్రత్యుపకారమిదా ఇవాళ ఆమెను ఉరికంబమెక్కించసిద్ధమయ్యావే? నీకు తగినశిక్ష ఏమిటో నువ్వేచెప్పు."

హారవల్లభుడు ఏమీమాట్లాడలేదు.

"ఇంకా మరో రాత్రిని నువ్వు చూడలేవు. అందుకనే యివాల్టికి సిద్ధపొమ్మని చెప్పాను. నావ ఎక్కడికి వెళుతుందో చెప్పగలవా?" అంది నిశి.

హారవల్లభునిలో ఇప్పుడిక మాట్లాడే శక్తికూడా లేదు.

"అక్కడొక శ్మశానంవుంది. మరణదండన విధించేవాళ్ళను మేము అక్కడికే తీసుకువెళ్ళి చంపుతాం. ఇప్పుడు నావ వెళ్ళేది అక్కడికే. అక్కడికి చేరగానే దొరగారిని ఉరితీయమని రాణిగారి ఆజ్ఞ! నీకేమి శిక్షవిధించారో తెలుసా?" అని అడిగింది నిశి.

హారవల్లభుడు ఏడ్వనారంభించాడు - "నన్ను రక్షించండి" అని చేతులు జోడించి ప్రార్థించాడు.

"నిన్ను రక్షించేవాళ్లు కూడ పాపాత్ములే. నిన్ను శిలువ వెయ్యమని రాణిగారి ఆజ్ఞ."

హారవల్లభుడు తలబాదుకుంటూ రోదించసాగాడు. తుపానుధ్వనిలో అతని ఏడుపు వజ్రేశ్వరునికి గానీ, దేవికిగానీ విన్పించలేదు. దొరగారు మాత్రం విన్నారు. "ఛీ, మూర్ఖుడా! ఎప్పుడైనా చావవల్సిందేగదా! ఏడ్వడమెందుకు?" అన్నాడు.

ఆమాటను పాటించకుండా ఆవృద్ధబ్రాహ్మణుడు శశికి నమస్కారం చేస్తూ 'నన్నెవరూ కాపాడలేరా?' అని అడిగాడు.

"నీవంటి నరాధముణ్ణి కాపాడటం అంటే పాపం చేసుకున్నట్లే. మా రాణి దయాస్వరూపిణి. కానీ నిన్ను గురించి దయాభిక్ష ఎవరు కోరుతారు.?"

"లక్షరూపాయలిస్తాను."

"ఆమాట అనడానికి నీకు సిగ్గులేదూ? యాభైవేల కోసం ఇంత విశ్వాసఘాతం తలపెట్టినప్పుడు లక్షరూపాయల కోసం ఏదైనా చేస్తావు."

"మీరు చెప్పినట్లే చేస్తాను."

"నీవంటి వానివల్ల ఏపనులూ జరుగవు."

"ఒక్కొక్కప్పుడు అల్పులు కూడా ఉపయోగపడతారు. నేనేమి చేయాలో చెప్పండి. హృదయపూర్వకంగా ఆ పనిని నెరవేరుస్తాను-నన్ను కాపాడండి."

శశి ఆలోచించి 'నీవల్ల నాకు ఒక్కపని జరగవచ్చు-కాని నీవంటివానివల్ల ఆ పని నెరవేరకపోవటమే మంచిది' అని అంది.

'నీకు నమస్కారం చేస్తాను-నీ చేతులు పట్టుకుంటాను' అంటూ భీతిచెందిన హారవల్లభుడు శశి చేతుల్ని పట్టుకో యత్నించాడు.

నిశి తన చేతుల్ని వెనక్కిలాక్కొని 'జాగ్రత్త! ఈ చేతుల్ని శ్రీకృష్ణభగవానుడు పట్టుకున్నాడు. సరే, అంత కాళ్ళా చేతులు పట్టుకోవల్సిన అవసరంలేదు. నువ్వింతగా ప్రాధేయపడుతున్నావు గనుక నిన్ను కాపాడయత్నిస్తాను. కానీ నేను చెప్పినట్లు నువ్వు చేస్తావని నాకు నమ్మకంలేదు. నువ్వు జూదగొండివి, విశ్వాసఘాతకుడివి. పాపాత్ముడవు - గూఢచారిగా వ్యవహరిస్తున్నావు-నిన్ను విశ్వసించేదెలా?" అంది.

"ఏ ప్రమాణం చేయమన్నా చేస్తాను."

"నీ ప్రమాణాలా, ఛీ! దేనిమీద ప్రమాణం చేస్తావ్?"

"గంగానది, రాగి, తులసిమొక్క-నీయిష్టంవచ్చిన వాటి సాక్షిగా ప్రమాణం చేస్తాను."

"వ్రజేశ్వరుని శిరము స్పర్శించి ప్రమాణం చేయగలవా?"

"మీ యిష్టంవచ్చినట్లు చేసుకోండి. నే నివేమీ చేయను" అని గర్జించాడు అకస్మాత్తుగా.

కాని ఆ ఆవేశం క్షణికమైనదే. మళ్ళీ అతను చేతులు నలపసాగాడు. "మరింకే ప్రమాణం చేయమన్నా చేస్తాను. నన్ను కాపాడండి."

"సరే, ప్రమాణం చేయవద్దు-నువ్వు మా స్వాధీనంలోనేవున్నావు గదా! చూడు, నేను కులీనులపిల్లనే. మా ఇళ్ళలో వరుడు లభించటంకష్టం. నాకుమాత్రం ఒకవరుడు లభించాడు. మా చెల్లెలి వివాహం ఇంకా కాలేదు."

"వయస్సెంత?"

"ఎంతోనా! ఇరవై నాలుగు, ఇరవై అయివుంటుంది."

"అవును. ఉన్నతకుటుంబాల్లో ఇటువంటివి చాలా జరుగుతాయి."

"అవును. జరుగుతున్నాయి - ఇప్పటికైనా ఆమె వివాహం జరక్కపోతే కులభ్రష్టుల మవుతాం. నువ్వే మా ప్రతిష్ఠను నిలబెట్టు. మీరు మా చెల్లెల్ని వివాహమాడినట్లయితే మా కుటుంబగౌరవం నిలుస్తుంది నేను ఈ విషయమే రాణీగారితో చెప్పి నిన్ను రక్షిస్తాను."

హారవల్లభునికి నెత్తిమీది బరువు దించినట్లయింది. మరొక వివాహంచేసుకోడం, కులీనుల్లో కష్టమైనపనికాదు_ ఎంతపెద్ద పిల్లనైనాసరే వివాహమాడవచ్చు. నిశి ఆశించిన జవాబే లభించింది.

"ఇదేమంత గొప్పవిషయం? పెద్దమనుషులగౌరవాన్ని పెద్దమనుషులే నిలబెట్టాలి. కానీ ఒక విషయం. నేనుముసలివాడినైపోయాను. వివాహమాడే వయస్సు మించిపోయిందిప్పుడు. మా అబ్బాయి వివాహమాడితే పనిజరుగదా?"

"అతడు యిష్టపడతాడా యిందుకు?"

"నేనుచెప్తే అంగీకరిస్తాడు."

"అయితే రేపు ఉదయమే అతనితో చెప్పండి. నేను పల్లకీనిచ్చి మిమ్మల్ని ఇంటికి పంపేస్తాను ముందు మీరు ఇంటికివెళ్ళి కావల్సిన ఏర్పాట్లు చూసుకోండి. మేము ఇక్కడే వివాహంచేసి వధూవరులిద్దర్నీ పంపుతాం."

హారవల్లభుని చేతికి అందుబాటులో స్వర్గంలభించింది. శిలువ చేయబడటమెక్కడ? అంతలోనే కోడల్ని తెచ్చు

కోవడమెక్కడ! ఈ విషయంలో ఇప్పుడికి ఆలస్యం జరగటం అతనికి ఇష్టంలేదు.

"ముందు నువ్వు వెళ్ళి రాణీగారితో మాట్లాడు" అని అన్నాడు నిశితో.

"ఇదిగో, వెళ్తున్నాను" అని నిశి లోనికివెళ్ళి పోయింది ఆమె వెళ్ళగానే 'ఆమె నీతో మాట్లాడిందేమిటి?' అని అడిగాడు దొర.

"అంత ముఖ్యవిషయమేమీ కాదు"

"ఏడుస్తున్నావెందుకు?"

"నే నెందుకు ఏడ్చాను?"

"బెంగాలీలు ఇలాగే అబద్ధాలకోర్లు."

నిశి లోనికిరాగానే దేవి 'మా మామగారితో ఏమి మాట్లాడావ్?' అని అడిగింది.

'నీకుఅత్తగారి నవగల్లుతానో లేదో చూస్తున్నాను.'

"నిశీ! నువ్వు నీ మనస్సును, ప్రాణాన్ని, యావ్వనాన్ని, జీవితసర్వాన్ని శ్రీకృష్ణునికి అర్పించావు. కాని జూదం-దొంగతనాలను మాత్రం అర్పించలేదు. వాటిని నీకోసం అట్టేపెట్టుకున్నావు" అని అంది రాణి

"దైవానికి మంచివస్తువుల్నే అర్పించాలి. చెడ్డవస్తువుల్ని అర్పిస్తారా ఎక్కడైనా?" అంది నిశి.

"నువ్వు నరకంలో కెళ్ళి పురుగులుపడి చస్తావ్!"

# 9

తుపాను ఆగిపోయింది, నావకూడా ఆగింది. రాణి కిటికీలోంచి తొంగిచూసింది-ఉదయం కావచ్చింది. 'నిశీ! నేడు సుప్రభాతం!' అని అంది రాణి.

"అవును, సుప్రభాతమే!" అంది నిశి.

"నువ్విక అంతరించావు, నేనిప్పుడుఉదయిస్తున్నాను" అని అంది దివా.

"నేను అంతరించినవాడే నాకు సుప్రభాతంఅగుగాక. ఇవాళ రాణికి సుప్రభాతం, ఇవ్వాల్టితో దేవి చౌధరాణి అంతరిస్తోంది" అంది నిశి.

"అదేమిటే రాక్షసీ! ఏమిటామాటలు?"

"నిజమే చెపుతున్నాను. రాణి మరణించింది. ప్రఫుల్ల అత్తవారింటికి బయలుదేరింది."

"అందుకు ఇంకా చాలా ఆలస్యంవుంది-ముందు నేను చెప్పినపని చెయ్యి-లంగరువేయమని చెప్పు."

నిశి నావికులతో ఆమాటచెప్పగానే వారు నావను తీరానికిచేర్చి లంగరేశారు.

"ఎక్కడికి వచ్చామో రంగరాజును అడిగితెలుసుకో. ఇక్కడికి రంగపూర్ ఎంతదూరమో, భూతనాథ్ ఎంత దూరమోకూడా అడుగు" అని అంది రాణి.

"ఈ ఒక్కరాత్రి మనం నాల్గురోజులు చేసినంత ప్రయాణం చేయగలిగాం. రంగపూర్ ఇక్కడికి చాలా దూరంవుంది-భూమార్గాన వెళ్తే భూతనాథ్‌కు ఒకరోజు ప్రయాణం" అని చెప్పాడు రంగరాజు.

"పల్లకి, బోయీలు దొరుకుతారా ఇక్కడ?"

"నేను ప్రయత్నంచేస్తే అన్నీ సాధ్యపడతాయి."

"స్నానాది నిత్యకర్మలకు మామగారిని క్రిందికి పంపండి" అని చెప్పింది రాణి నిశితో.

"అంత తొందరెందుకు?"

"పాపం, రాత్రంతా మామగారి అబ్బాయి బయటనే కూర్చునివుండిపోయాడు. మర్చిపోయాను ఆవిషయం. సముద్రాన్ని దాటిలంకలోకి ప్రవేశించలేకపోతున్నాడు" అంది నిశి.

తర్వాత నిశి హరవల్లభునికి వినబడేటట్లుగా రంగరాజు నుద్దేశించి 'దొరగారిని ఉరితీయాల్సిందే. వృద్ధ బ్రాహ్మణునికి విధించిన శిక్షను రద్దుపర్చాం, శిలువవేయాల్సిన పనిలేదిక. కాపలాతో స్నానాది నిత్యకర్మలు ముగించుకొనుటకు పంపు" అని చెప్పింది.

హరవల్లభుడు 'నేనేమైనా చేయాలా?' అనిఅడిగాడు.

నిశి కనుసైగతో 'రాణి నా కోర్కెనుమన్నించింది. నువ్వు స్నానాదులు ముగించుకొని రా' అని చెప్పింది.

"కాపలా అంటే స్నానంచేయించుటకు ఒక నౌకర్ని వెంటపంపు" అని నిశి రంగరాజు చెవిలో చెప్పింది. రంగరాజు అలాగే ఏర్పాటుచేశాడు.

"దొరగారిని వదిలివేయండి. అతనిని రంగాపూర్‌కు వెళ్ళమనిచెప్పండి. రంగపూర్ చాలాదూరంవుంది, వంద మొహరీలు ఇచ్చిపంపండి" అని చెప్పింది రాణి నిశితో.

నిశి వందమొహరీలను తెచ్చి రంగరాజు చేతికిచ్చి విషయాన్ని చెప్పింది.

రంగరాజు ఇద్దరు మనుష్యుల్ని వెంటబెట్టుకొని దొర వద్దకువచ్చి 'లే!' అన్నాడు.

"ఎక్కడికి వెళ్లాలి?"

"నువ్వు మా ఖైదీవి-నువ్వు అవేమీ అడగకూడదు" దొరగారు వారివెంట క్రిందికి వెళ్ళారు. వారు దిగిన రేవులోనే హారవల్లభుడు స్నానంచేస్తున్నాడు. వారినిచూసి అతడు 'దొరను ఎక్కడికి తీసుకుపోతున్నారు?' అని అడిగాడు.

"ఈ అరణ్యంలోనికి" అని జవాబిచ్చాడు రంగరాజు.

"ఎందుకు?"

"అరణ్యంలోకి తీసుకెళ్ళి ఇతనిని ఉరితీస్తాం."

హారవల్లభుడు భయంతో కంపించాడు. సంధ్యావందనాన్నే మర్చిపోయాడు. ఆ నాటికి సంధ్యావందనం అసంపూర్తిగానే ముగిసింది.

అడవిలోనికి తీసుకువెళ్లి రంగరాజు దొరతో 'మేమెవర్నీ ఉరితీయం. నువ్విక సరాసరి ఇంటికి వెళ్లిపో. మరెప్పుడూ మమ్మల్ని వెంబడించకు. నిన్ను వదిలేశాం వెళ్లు' అని చెప్పాడు.

ఆ మాటవినగానే దొరకు మొదట విస్మయంకల్గింది. కాని తర్వాత 'ఆంగ్లేయుల్ని ఉరితీయగల సాహసం ఈ బెంగాలీలకు లేదు' అనుకున్నాడు!

"రంగపూర్ ఇక్కడికి చాలాదూరం వుంది. ఎలా వెళ్తారు?" అని అడిగాడు రంగరాజ్.

"ఏదో విధంగా వెళ్తాను-వీలునుబట్టి!"

"ఏదైనా నావచూసుకోండి! లేదా గ్రామంలోకి వెళ్ళి గుర్రాన్ని కొనుక్కోండి- లేదా పల్లకీని ఏర్పాటు చేసుకోండి. మీకు దారిబత్తెమునకు దేవీరాణి మీకు వందమొహరీలు ఇచ్చింది."

రంగరాజ్ మొహరీలను లెక్కించి ఇచ్చాడు. దొర గారు అయిదు మొహరీలను మాత్రమే తీసుకొని "ఇవిచాలు నాకు. ఇదైనా అప్పుగా తీసుకుంటున్నాను" అన్నాడు.

"సరే, మీకు అడిగినప్పుడుచెల్లించండి. మీసైనికు లెవరైనా గాయపడితే వారికి పంపండి, లేదా మీ సైనికు లెవరైనా చనిపోతే వారి వారసులకుపంపండి."

"ఎందుకు?"

"అటువంటివారికి దేవీరాణి చాలాసహాయంచేస్తుంది."

దొరగారికి విశ్వాసం కలుగలేదు మంచి, చెడు ఏమీ మాట్లాడకుండానే జయలుదేరి వెళ్ళిపోయాడు.

రంగరాజ్ పల్లకికోసం వెళ్ళాడు.

# 10

అక్కడ మరెవ్వరూ లేకపోవడంచూసి వ్రజేశ్వరుడు దేవి చెంతకువచ్చి కూర్చున్నాడు. "మీరు నాకు దర్శనం ఇవ్వడం మంచిదే అయింది. మీ ఆజ్ఞలేకుండా నేటికార్య క్రమం జరుగదు. ప్రాణాలుకాపాడుకోమని ఆదేశించారు మీరు- కాపాడుకున్నాను- ఇప్పుడిక దేవీ చౌధరాణి లేదు,

మరణించింది! ప్రఫుల్ల వృందాలా, దేవీవెంట వెళ్ళ మంటూరా!" అని అంది.

వ్రజేశ్వరుడు ప్రేమతో ఆమెమోము ముద్దాడి "నువ్వు తిరిగి ఇంటికిరా! నాగృహం ప్రకాశమానమైతేరిస్తుంది- నువ్వు రానిచో నేనూ వెళ్ళను" అన్నాడు,

"నేను ఇంటికి రావాలంటే మామగా రేమంటూరు?"

"ఆ బాధ్యతంతా నాది. నువ్వేదైనా ఏర్పాటు చేసి ముందువారిని ఇంటికిపంపు, తర్వాత మనం వెళ్దాం."

"రంగరాజ్ పల్లకీకోసం వెళ్ళాడు."

త్వరలోనే పల్లకీవచ్చింది. హరవల్లభుడుకూడా త్వర త్వరగా సంధ్యావందనం వగైరా ముగించుకొని నావలోకి వచ్చాడు. పాలు, వెన్న, ఆమ్ర నారికేళఫలాలను తెచ్చింది నిశి. ఆమె హరవల్లభ బాబును కూర్చొన జేసి "మీరిప్పుడు మాబంధువులు, ఫలహారం చేయుటతప్పదు" అని వత్తిడి చేసింది.

"వ్రజేశ్వరుడు ఎక్కడున్నాడు? నిన్నరాత్రి గది లోంచి బయటకు వెళ్ళినతర్వాత మళ్ళీ కన్పించలేదు" అని అడిగాడు హరవల్లభుడు.

"వారు మా బావగారు అవబోతున్నారు గనుక వారిని గురించి మరేమీ విచారించవద్దు - వారిక్కడే వున్నారు. ముందు మీరు ఫలహారం చేయండి, నేను వారికి కబురంపుతాను- ఆమాట వారితో చెప్పండి."

హరవల్లభుడు ఫలహారం చేయసాగాడు. నిశి వ్రజేశ్వ రుణ్ణి తీసుకొచ్చింది. లోనిగదిలోంచి వ్రజేశ్వరుడు అక్కడికి రావటం చూసి అతనికి చాలా ఆశ్చర్యం కల్గింది.

"ఈ దొంగల రాణులు మా అబ్బాయి అంటే పడి చస్తున్నారు, అదీ ఒకవిధంగా మంచిదే అయింది" అని అనుకున్నాడతను.

"నువ్విక్కడికి ఎలా వచ్చావో నాకు ఇంతవరకు తెలియనే తెలియదు. సరే ఆ విషయాలన్నీ తర్వాత మాట్లాడుకుందాం. విషయమేమంటే నేను ఒకవాగ్దానం చేశాను. దాని నెలాగైనా నిలబెట్టాలి. ఈమె కులీనురాలు, ఈమె తండ్రికూడా మన హోదాకు తగినవాడే! ఈమెకు ఒక చెల్లెలుందట, ఎక్కడా వరుడు లభించక పాపం వంశమర్యాద కాస్తాపోతోందట. కులీనుల మర్యాదను నిలబెట్టటం కులీనుల కర్తవ్యం-అది అల్లుళ్లవల్ల జరిగేపని కాదాయె! నాకూ మీఅమ్మకూ కూడా నువ్వు మరొక వివాహం చేసుకొని సుఖంగా సంసారం చేసుకోటం ఇష్టమే. ముఖ్యంగా పెద్దకోడలు చనిపోయినప్పటినుంచీ యిద్దరికీ వున్న విచారమే అది. మాటయిచ్చిన తర్వాత అది నెరవేర్చటమనేది మన కర్తవ్యమేగదా! కనుక ఈమె చెల్లెల్ని వివాహమాడటం నాకు సమ్మతమే" అన్నాడు హరవల్లభుడు తనకుమారునితో.

"చిత్తం! అలాగే!" అన్నాడు వ్రజేశ్వరుడు.

నిశికి చాలానవ్వొచ్చింది, కానీ ఆమె నవ్వలేదు.

"నేను వెళ్ళటానికి పల్లకీవస్తే నేను ముందుగా వెళ్ళి అక్కడ చేయాల్సిన ఏర్పాట్లన్నీ చూస్తాను. నువ్వు శాస్త్రయుక్తంగా వివాహం చేసుకొని రావల్సింది" అని చెప్పాడు హరవల్లభుడు.

"చిత్తం."

"నేను నీకు వేరుగా చెప్పాల్సిందేముంది. నువ్వుచిన్న వాడవుకాదు. జాతి,కుల, శీలాలను స్వయంగాచూసివివాహం చేసుకో. మాబాధ్యత ఎంతవరకో అదికూడానీకు తెలిసినదే."

"చిత్తం."

హారవల్లభుడు ఫలహారంపుచ్చుకొని బయల్దేరాడు; నిశి, వ్రజేశ్వరులిద్దరూ ఆయనపాదాలకు నమస్కరించి పాద ధూళిని శిరమునదాల్చారు. హారవల్లభుడు పల్లకీలో కూర్చొని "బ్రతికిబయటపడ్డాను" అనుకొని దీర్ఘనిశ్వాసం విడిచాడు. "అబ్బాయిని దొంగలచేతుల్లో వదిలిపోతున్నాను-అయినా భయమేమీలేదు. వాడిమార్గంఏమిటో వాడికి తెలుసు. అందమనేది అన్నిచోట్లా జయిస్తుంది" అనుకున్నాడు.

హారవల్లభుడు వెళ్ళిన తర్వాత వ్రజేశ్వరుడు "ఏమి టిదంతా? మీచెల్లెలెవరు?" అని అడిగాడు నిశిని.

"తెలియదా? ఆమెపేరు ప్రఫుల్లముఖి"

"ఓహో, అదా! ఇంతకూ వారిని ఎలా ఒప్పించ గలిగావు?"

"స్త్రీలకు అనేకఉపాయాలు తెలుసు. చెల్లెలికి అత్తగా రవటం నిషిద్ధం, లేకపోతే మరొకసంబంధాన్ని కూడారాజీ చేసే దానిని."

దివా క్రోధంతో "ఛీ! నీకు చావైనా రాదేమే! నీకు సిగ్గుకూడా లేదు. పురుషులతో ఇలువంటి మాటలుమాట్లాడ వచ్చునా?"

"పురుషులెవరు? వ్రజేశ్వరుడా? నిన్న చూశలేదా పురుషులెవరో, స్త్రీలెవరో?"

"ఇవాళ కూడా చూస్తావు. నువ్వు స్త్రీవిగనూ, అందు కని మందబుద్ధిగా వ్యవహరించావు, ఇదేమీ అంత మంచిది కాదు." అన్నాడు వ్రజేశ్వరుడు.

"మంచిది కాదేమిటి?" అని అడిగింది నిశి.

"తండ్రిని మోసగించవచ్చునా? తండ్రి కళ్ళల్లో మన్ను కొట్టి అబద్ధాలు చెప్పి భార్యతో సంసారం చేయనుంటావా? తండ్రి మోసగించినప్పుడు ప్రపంచంలో ఇక మోసం చేయ లేని దేమన్నా?"

నిశి నిశ్చేష్టురాలై వ్రజేశ్వరుడు నిజమైన పురుషుడే ననీ, సాముచేయ గలిగినంతమాత్రాన పురుషుడు కాదనీ ఆమె తనలోతాను అంగీకరించింది.

"ఇప్పుడేం చేద్దామంటావు?" అని అడిగింది.

"ఏం చేయుట మేముంది! ప్రఫుల్లను తీసుకొని ఇంటికి వెళ్తాను. నాన్నగారికి విషయాలన్నీ చెప్పివేస్తాను. ఇటువంటి మోసాలు సాగవు."

"మీనాన్నగారు దేవీచౌధరాణిని ఇంట్లో అడుగుపెట్ట నిస్తారా?"

దేవీరాణి అందుకొని "దేవీ ఎవరు? దేవిరాణి చని పోయింది. ఇప్పుడిక ఆపేరుకూడా స్మరించవద్దు, ప్రఫుల్లను గురించి మాట్లాడు" అని అంది నిశితో.

"ప్రఫుల్లనుమాత్రం వారిఇంటిలో అడుగుపెట్టనిస్తారా?"

"ఆ భారమంతా నాదని చెప్పానుగదా!" అన్నాడు బ్రజేశ్వరుడు.

ప్రఫుల్లకు సంతోషమయింది. బ్రజేశ్వరుడు సమర్థత లేకుండా బాధ్యత వహించే మనిషికాదని ప్రఫుల్లకు తెలుసు.

# 11

అప్పుడిక భూతనాథ్‌కు ప్రయాణసన్నాహాలు ప్రారంభించారు. రంగరాజును అక్కడే వదలివెళ్ళాలనుకున్నారు; అంతకుముందే బ్రజేశ్వరుని నౌకల్లో రంగరాజుయొక్క లాఠీని రుచిమాశారు, చూస్తే అతనినిగుర్తించవచ్చు. రంగరాజును పిలిచి విషయమంతా తెలియపర్చారు. కొన్నివిషయాలు నిశి చెప్పింది, మరికొన్నివిషయాలు ప్రఫుల్ల చెప్పింది. రగంరాజు దుఃఖిస్తూ "అమ్మా! మమ్మల్ని వదలి వెళ్ళిపోతారా! ఇలా జరుగుతుందని మేమెన్నడూ ఆలోచించ లేదమ్మా!" అన్నాడు. అందరూ కలసి రంగరాజును ఓదార్చసాగారు. దేవీగఢంలో వున్న ఆమె ఇల్లు వాకిలి, దైవసేవ, దైవసంపద వీటన్నిటినీ రంగరాజుకు ఇచ్చివేసింది.

"అక్కడికే వెళ్ళివుండు. రోజూ పూజ జరుగుతూ వుంటుంది; ఆనైవేద్యంతోనే కాలక్షేపం చేస్తూవుండు. ఇకమరెప్పుడూ దెబ్బలాటలకు వెళ్ళకు. నిజానికి మీరు దేనినైతే పరోపకారంగా భావిస్తున్నారో అది పరపీడనే! దెబ్బలాటల వల్ల పరోపకారం జరగదు. దుష్టుల్ని ప్రభుత్వం శిక్షించకపోతే ఆ పరమేశ్వరుడే శిక్షిస్తాడు. ఈసృష్టిలో నీకూ

నాకూ ఏమి అధికారం వుంది? దుష్టశిక్షణ, శిష్టరక్షణ భారాన్ని ఆ పరమేశ్వరునికే వదలివేయాలి. ఈ విషయాన్ని నేను చెప్పినట్లుగా భవానీ ఠాకుర్ గారితో కూడా చెప్పు, వారికి నా శతసహస్ర నమస్కారాలు చెప్పు" అని అంది దేవి రంగరాజుతో.

రంగరాజు ఎంతో దుఃఖిస్తూ వారివద్ద శలవు తీసుకున్నాడు. నిశి, దివాలు భూతనాథ్ రేవువరకు ప్రఫుల్ల వెంట వెళ్లారు. ఆ నావలోనే వాళ్ళిద్దరూ తిరిగి దేవీగఢానికి వెళ్ళి అక్క[illegible]హరినామ స్మరణతో తమజీవితాలు గడుపుకోవాలి. నావలో [illegible] శిగిరికి కావల్సిన సామాగ్రి యావత్తువుంది. అవి ఎంత విలువైనవో మీరుగమనించేవుంటారు. ఆ సామాగ్రి నంతా నిశి, దివాలకు ఇచ్చివేసి "వీటినమ్మి వచ్చినడబ్బును మీయిష్టప్రకారం ఖర్చుచేసుకోండి. ఏదైనామిగిలితే దరిద్రులకు దానంచేయండి. ఇందులో నాదిఏమీలేదు-కనుక నే నేమీవుంచుకోను" అని దేవి తనవిలువైన రత్నాభరణాలను, దుస్తుల్ని సైతం నిశి, దివాలకు ఇచ్చివేసింది.

"ఆభరణాలేమీ లేకుండా అత్తవారింటికి వెళ్తావా" అని అడిగింది నిశి.

"స్త్రీలకు భర్తలకుమించిన ఆభరణం ఏముంటుంది? వీరు వుండగా మరో ఆభరణాలెందుకు నిశీ!"

"నువ్వీవాళ మొదటిసారిగా అత్తవారింటికి వెళ్తున్నావు. నేను నీకు కొంతకట్నంఇచ్చి దీవించిపంపుతాను. ఇదినాఅంతి మకోర్కె-కాదనటానికి వీల్లేదు - నా కోర్కెను మన్నించు" అని అంది నిశి.

నిశి రాజదర్బారులో వున్న రోజుల్లో మహారాణి ఆమెకు అనేక ఆభరణాలిచ్చింది. ఇప్పుడు ఆ ఆభరణాలనే నిశి ప్రఫుల్లకు అలంకరించసాగింది. దేవీ తనకు నూత్నాభరణాలు ఇచ్చివుండటం వల్ల ఇంతవరకు ఆమె వాటిని దాచి వుంచింది. అన్నీ ముగిశాయి. ముగ్గురూ ఏడుస్తూ కూర్చున్నారిహా నిశి ఆభరణాల నలంకరించేప్పుడే ప్రారంభించింది. ఆరున్నొక్క-రాగం. దివాకూడా గొంతుకలిపింది. ప్రఫుల్లకు చాలా ఆనందంగావుంది. అందుకని ఆమె అంతగా [illegible]లేదు. ముగ్గురూ ఒకరొకరు గాఢంగా ప్రేమించు[illegible]నేవారు. ప్రఫుల్ల సంతోషంగావుందని గ్రహించి నిశికూడా సంతోషించింది, ఏడుపు మానేసింది. అందరి బదులు దివాఠాకురాణి ఏడ్చేసింది.

నావ భూతనాథ్ రేవుకు చేరింది. ప్రఫుల్ల,నిశి దివాల పాద ధూళిని శిరమునదాల్చి వారివద్ద శలవుతీసుకొంది. వారిద్దరూ ఏడుస్తూ దేవీగఢానికి తిరిగివెళ్లారు. అక్కడకు చేరిన తర్వాత నావికులకు వారిజీతాలుఇచ్చిపంపివేసింది. ఆనావను ఉంచటంకూడా ప్రమాదమే. దానిని కుంపినీసైనికులు గుర్తించే ప్రమాదంవుంది. నిశి ఆ నావను రెండు సంవత్సరాలవరకు పొయ్యిలోకి ఉపయోగించింది. ఇకమనం నిశివద్ద శలవు తీసుకోవచ్చును.

# 12

భ్రాతనాథ్ రేవులో నావ ఆగిందో లేదో అప్పుడే వ్రజేశ్వరుడు మరో వివాహం చేసుకొచ్చాడని, వధువు చాలా పెద్దదనీ వూరంతా పాకింది. చిన్నపిల్లలు, పండు ముత్తయిదువులు, గ్రుడ్డి, కుంటి, కుష్టు ఎక్కడిపనులక్కడేవదలి చూడటానికి బయలుదేరివచ్చారు. పొయిమీదున్న అన్నాన్ని అలా వదిలి వచ్చేదికొందరు, చేసేచేసే చేపల్ని అక్కడ పారేసి వచ్చేదికొందరు, మరికొందరు స్నానంచేస్తూ ఆ తడి బట్టల[illegible]నే వచ్చారు. తినే అన్నాన్నివదలి అర్ధాకలితో లేచి వచ్చిన[illegible] కొందరు. పొరిగింటికి పుల్లమ్మతో జరిగే కురుక్షేత్రసంగ్రామాన్ని విరమించి ఇరుపక్షాలూ సఖ్యతపడివచ్చేది మరికొందరు. ఈవార్త చెవినిపడగానే దండించే కొడుకును చంకనెత్తుకొని పరుగున వచ్చే ఇల్లాండ్రుకొందరు. భర్తకు అన్నం వడ్డించి మధ్యలో ఆదరబాదర వచ్చేవారు కొందరు. 'అమ్మా నాకు కళ్ళుకన్పించవే, స్నానానికి కర్ర పట్టుకొని తీసుకెళ్ళు' అని మనుమరాలిని పోరుపెట్టే వృద్ధురాలు ఈ వార్త తెలియగానే నెమ్మది నెమ్మదిగా రేవుకు చేరుకుంది. ఈ విధంగా గ్రామంలోని స్త్రీలందరూ చీరలుజారిపోతున్నా గమనించక, జుట్టుముడివూడిపోయినా ఎక్కడ ఆలస్యమవుతుందో అనే ఆదుర్దాతో రేవుకు చేరుకున్నారు. పెద్దలఎదుట సిగ్గునుకూడా పాటించలేదెవరూ. ఆ కాసేపూ లజ్జాదేవి అక్కడినుంచి పారిపోయింది.

వధూ వరులిద్దరూ ఒడ్డుకు చేరి నిల్చున్నారు. వ్రజేశ్వరునితల్లి దిష్టితీసింది. వధువును చూడటానికిఇంతసుంచి స్త్రీలు

వచ్చారు, అయితే పెండ్లి కుమార్తె నిండా వేసుకున్న ముసుగును తొలగించలేదు. ఎవ్వరూ ఆమెముఖాన్ని చూడలేక పోయారు. అత్తగారు హారతి ఇచ్చేప్పుడు ముసుగుతీసి కొద్దిగా ఆమెముఖాన్ని చూసి త్రుళ్ళిపడింది. 'కోడలు అందమైనదే' అనిఅంది. ఆమె కళ్ళనిండా నీళ్ళు నిండాయి.

'అమ్మలారా! చాలాదూర ప్రయాణంచేసివచ్చారు. బాగా అలసి పోయారు. ముందు ఇంటికి తీసుకువేళ్తే విశ్రమిస్తారు. ఇహ కోడలు రోజూ ఇక్కడే వుంటుందిగదా! మీరురోజూ చూడనేచూస్తారు' అనిసాగనంపారు అత్తగారు.

అందుకు అందరూ అసంతృప్తిచెంది అలోకమాటా అంటూ వెనక్కి తిరిగారు. అత్తగారి దోషానికి కోడల్ని నిందించారు. ఏఒక్కరూ ఆమె ముఖాన్ని చూడలేదు.

'అచ్చు కోతిముఖం' అని అందరు తమ ద్వేషాన్ని వ్యక్తంచేశారు. గొప్పవారిళ్ళ ఇటువంటివి ఎన్నోజరుగుతాయి- అనితమతమ అనుభవాలను చెప్పసాగారు. గోవింద ముఖర్జీ యెాంభెయేండ్ల పెండ్లికూతుర్ని తెచ్చుకున్నాడనీ హరచటర్జీమహాశయుడు డెబ్బదియేండ్ల కన్యనువివాహమ్యాడనీ అలంకారాలను, అతిశయోక్తులను జోడించి కథవలె చెప్పసాగారు. క్రమంగా అంతా సర్దుకొంది.

తల్లి వ్రజేశ్వర్‌ణ్ణి చాటుగా పిలిచి 'ఈకోడలు ఎక్కడ దొరికింది బాబూ!' అని అడిగింది.

'ఇది వివాహం కాదమ్మా!'

'పోయిన ఈరత్నం ఎక్కడలభించింది?' అని జొటజొట కన్నీరు కార్చింది.

'ఆ పరమేశ్వరుడే కటాక్షించాడు, నాన్నగారితో నువ్వేమీ చెప్పవద్దు. నేనే వారితో విషయాలన్నీ చెప్తాను.'

'నువ్వు చెప్పాల్సిన అవసరమేమిటి నాయనా! నేనే చెప్తాను. ముందు మూడునిద్రలు కానీ, నువ్వేమీ విచారించకు. అంతవరకు ఎవరితోనూ ఏమీ చెప్పకు.'

వ్రజేశ్వరుడు తల్లిమాటను అంగీకరించాడు. ఈ భారాన్ని తల్లి వహించినందువల్ల అతడు బ్రతికిపోయాడు.

మూడు నిద్రలు అయిపోయాయి నిర్విఘ్నంగా. పెద్ద ఆడం[illegible]గ లేదు, కొద్దిమందిబంధువుల్ని మాత్రంపిలిచి పని జరిపా[illegible]ు హరవల్లభుడు. అన్నీ జరిగిన తర్వాత భార్య హరవల్లభునితో 'ఇది ఇప్పుడు క్రొత్తగా జరిగిన వివాహం కాదు_ పెద్దకోడలే' అనిచెప్పింది.

నిద్రించిన సింహాన్ని బాణంతో కొట్టినట్లుగా త్రుళ్లిపడి 'ఏమిటీ? ఆ పెద్దకోడలేనా? ఎవరన్నారు?' అన్నాడు.

'నేను గుర్తించాను. అబ్బాయికూడా చెప్పాడు.'

'పది సంవత్సరాల క్రితం చనిపోయిందిగా?'

'చనిపోయిన వాళ్ళెక్కడైనా తిరిగి వస్తారా?'

'మరి ఇంతకాలం ఎక్కడుంది? ఎవరి దగ్గరవుంది?'

'అవేమీ నేను అబ్బాయిని అడగలేదు _ అడగను. అబ్బాయి అవన్నీ తెలిసే తీసుకు వచ్చివుంటాడు.'

'నేను అడుగుతాను.'

'నామీదఒట్టే, నువ్వేమీ అడగవద్దు. నువ్వొకసారి చేసిన పనికి వాడిప్రాణాలమీదకి వచ్చింది. ఒక్కగానొక్క కొడుకు. నువ్వేమైనా మాట్లాడావంటే నన్ను చంపుకు

తిన్నట్టే. మీరుఅడిగారంటే నేను ఉరేసుకు ప్రాణత్యాగం చేస్తాను.'

'అలా అయితే జనానికిమాత్రం ఇది క్రొత్త పెండ్లే నని చెప్పండి,' అన్నాడు హారవల్లభుడు.

'అలాగే చేద్దాం.'

ఆమె ఈవార్తను కుమారునితో చెప్పి 'నేను మీనాన్న గారితో చెప్పాను. వారేమీ మాట్లాడరు. ఇప్పుడిక ఆవిష యాన్ని పొడిగించవద్దు' అనిఅంది.

వ్రజేశ్వరుడు ప్రఫుల్లకు తెలియజేశాడు.

చుక్కాని పట్టుకొనే సమర్థుడైన నావికుడున్నప్పుడు నావకుమరే ప్రమాదమూ వుండదు. ఆవిధంగానే వ్రజేశ్వరుని తల్లి వంటి ఇల్లాలువున్న గృహంలో అందరూ సుఖ సంతోషాలతో జీవిస్తారు.

# 13

ప్రఫుల్ల సాగర్‌ను చూడాలనుకుంది. వ్రజేశ్వరుని ద్వారా విషయాన్ని గ్రహించిన గృహిణి సాగర్‌కుకబురం పింది. ముగ్గురుకోడళ్లూ ఇక్కడవుండగా చూడలని ఆమెకు కూడా కోర్కెగా వుంది.

పిలవటానికి వెళ్ళిన మనిషివల్ల వ్రజేశ్వరుడు మరొక వివాహం చేసుకున్నాడనీ, కోడలు పెద్దదనీ తెలిసింది సాగర్‌కు.

ఆమెకు క్రోధమూ, ద్వేషమూకూడా కలిగాయి.

'మళ్ళా వివాహమా? మేము స్త్రీలము కాదా! అయ్యో! పరమేశ్వరా! ఏదరిద్రుని ఇంటిలోనైనా జన్మిస్తే ఎంత బాగుండును! నేను దగ్గరవుంటే వారు మరో వివాహం చేసుకునేవారు కాదేమో!' అని ఎంతో దుఃఖించింది.

ఈవిధమైన క్రోధము, అసూయ దుఃఖము తోనే సాగర్ అత్తవారింటికి వచ్చింది. రాగానే ముందు నయనతారవద్దకు వెళ్ళింది. ఇంతకుపూర్వం వీళ్ళిద్దరికీ ఒకరంటే మరొకరికి గిట్టేదికాదు. కానీ ఇవాళ ఇరువురూ ఒకటయ్యారు— ఇద్దరికీ ఎదురయిన సమస్య ఒకటే. ఆ యోచనతోనే సాగర్ నయన కలుసుకుంది.

కుండలో మూతబెట్టివున్న నాగుబాము ఏవిధంగా బుసలు కొడ్తూవుంటుందో ఆస్థితిలో వుంది నయనతార. ప్రఫుల్ల వచ్చినతర్వాత ఇంతవరకు ఒక్కనాడయినా వ్రజేశ్వరుడు నయనతారను కలుసుకోలేదు. దూషణలకు భయపడి తప్పించు తిరిగేవాడు. ప్రఫుల్ల ఒకనాడు కలుసుకొని కూడా తిట్లను భరించలేక వచ్చేసింది. భర్త, సవతి తనకు దూరంగా వుంటున్నారు. ఇరుగుపొరుగు స్త్రీలుకూడా నయనతారతో మాట్లాడేవారే కాదు. నయనతారకు పిల్లలెక్కువ, అదొక ఆపద. వాళ్ళను చావబాదేది.

ఆమెను చూడగానే నయనతార 'రా తల్లీ! రా! రా! నువ్వెందుకు తక్కువ కావాలి? ఇంకెవరైనా వున్నారా?' అని అంది.

'మళ్ళీ వివాహం చేసుకున్నారని విన్నాము.'

'వివాహం చేసుకున్నాడో ఏంపాడో?'

'బ్రాహ్మణులేనా?'

'బ్రాహ్మణులో, శూద్రులో, మహమ్మదీయులో నేనుమాత్రం చూసివచ్చానా?'

'అలా మాట్లాడటం తప్పుగదూ! ఎవరి జాతిని వాళ్లు కించపర్చుకుంటారా?'

'ఇంత పెద్దపిల్లను వివాహమాడిన వారికి నీతీ జాతి ఏముంటాయి?'

'ఎంత వయస్సు వుంటుంది. మనకంటే పెద్దదేనా?'

'మీ అమ్మగారి వయస్సు వుంటుంది.'

'జుట్టు పండి పోయిందా?'

'జుట్టు పండకపోతే ఆ వృద్ధవనిత రాత్రింబవళ్ళు ముసుగువేసుకొని ఎందుకుంటుంది?'

'దంతాలన్నీ బాగావున్నాయా?'

'జుట్టు నెరిస్తే పళ్లురాలకుండావుంటాయా?'

'అంటే వారికంటే పెద్దదేనన్నమాట!'

'నువ్వనే దేమిటి?'

'ఎక్కడయినా ఇటువంటిది జరుగుతుందా?'

'గొప్పవాళ్ళలో అన్నీ జరుగుతాయి.'

'అందంగా వుంటుందా?'

'సాక్షాత్తు దేవకన్య.'

'నువ్వు వారినేమీ అడగలేదా?'

'అసలు కన్పిస్తేగా అడగటానికి! పాత చీపురులా తన్నేశారు.'

'నేనూ ఒకసారి అపుత్తడి బొమ్మను చూసివస్తాను.'

"వెళ్ళు వెళ్లు, దర్శించి జన్మపావనం చేసుకో."

కొత్త సవతిని వెదుకుతూ సాగర్ చెరువు కట్టవద్దకు వెళ్ళింది. ప్రఫుల్ల రేవులో కూర్చుని పాత్రలు కడుగుతోంది. సాగర్ అక్కడికి వెళ్ళి 'నువ్వేనా క్రొత్తకోడలివి?' అంది.

"ఎవరు, సాగర్! వచ్చావా?" అని ప్రఫుల్ల అటుతిరిగింది. సాగర్ ఆమెను చూసి విస్మయంతో-

"దేవీరాణి?" అని అంది.

"మాట్లాడకు! ఉష్! రాణి చనిపోయింది."

"...ల్ల!"

"ప్రఫుల్ల కూడా చనిపోయింది."

"మరి నువ్వు?"

"క్రొత్త కోడల్ని."

"అవన్నీ ఎలా జరిగాయో వివరంగా చెప్పు."

"అవన్నీ ఇక్కడకాదు. గదిలోకి వెళ్దాం! అక్కడ చెప్తాను."

ఇద్దరూ గదిలో కూర్చుని తలుపులు వేసుకొని మాట్లాడుకోసాగారు. ప్రఫుల్ల జరిగినవన్నీ సాగర్‌తో చెప్పింది. "గృహకృత్యాలెలా వున్నాయి?" అని అడిగింది సాగర్- "రజితసింహాసనంపై కూర్చొని రత్నకిరీటం ధరించి మహారాణిగావున్న తర్వాత అంట్లు తోమటం, ఇల్లుఊడ్చడం నచ్చుతాయా? యోగశాస్త్రాధ్యయనం చేసినవారికి వృద్ధబ్రాహ్మణి కథలు నచ్చుతాయా? రెండువేల మందిని శాసించిన నువ్వు ఇతరుల ఆదేశాలను శిరసావహిస్తూవుండ గలవా?" అనికూడా అడిగింది సాగర్.

"వుండగలను గనుకే వచ్చాను. స్త్రీలయొక్క కర్తవ్యం ఇదేగా. రాజ్యపరిపాలనాధికారం వారికి లేదు. సంసార ధర్మమే అన్నింటికంటే కఠినమైనది! ఇంతకంటే కఠినమైన యోగం మరొకటిలేదు. అనేకమంది స్వార్థులు, నిరక్షరాస్యుల మధ్య మనం రోజూ మెసలుతూ వుంటాం. ఎవరికీ పీసమెత్తు బాధకలుగకుండా వ్యవహరించు కోవాలి. దీనిని మించిన కఠోరమైన సన్యాసం ఏముంది! దీనినిమించిన పుణ్యకార్యమేముంటుంది! నే నీ సన్యాసాన్ని స్వీకరిస్తాను" అని చెప్పింది ప్రఫుల్ల.

"అయితే నేనుకూడా కొద్దిరోజులు నీ[illegible] నీకు శిష్యత్వం చేస్తా."

ఇక్కడ ప్రఫుల్ల, సాగర్ గదిలో కూర్చొని మాట్లాడుకొనే సమయాన వృద్ధ బ్రాహ్మణి వద్దకూర్చొని బ్రజేశ్వరుడు భోజనం చేస్తున్నాడు.

"ఇప్పుడు వంటకాలెలా వుంటున్నాయి?" అని అడిగింది వృద్ధ బ్రాహ్మణి.

బ్రజేశ్వరునికి పది సంవత్సరాల నాటి మాట గుర్తొచ్చింది. "చాలా బాగుంది" అన్నాడు.

"ఇప్పుడు అప్పాలెలా వుంటున్నాయి?"

"అద్భుతంగా వుంటున్నాయి."

"పది సంవత్స రాలైపోయింది, నువ్వు నన్ను గంగా స్నానం చేయించనేలేదు."

"అయ్యో! మర్చిపోయానే!"

"ఇప్పుడు నన్ను గంగాస్నానం చేయించొద్దు. నువ్విప్పుడు

జాతి హీనుడవై పోయావు."

"అవ్వా! ఉష్! అదేమీ మాట్లాడకు"

"సరే అయితే! నేనిక ఏమీ అనను. వాళ్ళెవరూ రాట్నం విరగ్గొట్టకుండా మాత్రం చూడు."

అనేక మాసాల అనుభవం ద్వారా, ప్రఫుల్ల అన్నంతా చేసినట్లు సాగర్ గమనించింది. ఇంట్లో అందరూ సుఖంగా వున్నారు. ప్రఫుల్లను చూసుకొని అత్తగారు చాలా సంతసించింది. భారాన్నంతా ప్రఫుల్లపై వదలి సాగర్ యొక్క కొడుకును ఆడిస్తూ అత్తగారు కాలంగడిపేది. క్రమంగా మామగారికి కూడా ప్రఫుల్ల గుణగణాలు తెలిశాయి. ప్రఫుల్లకు అయిష్టమైన పనిని వారెప్పుడూ చేసేవారుకాదు. అత్తమామలు ప్రతివిషయంలోనూ ఆమె సలహాలు పాటించేవారు. ఆమెయందు వారికి అంతవిశ్వాసం కుదిరింది. వృద్ధబ్రాహ్మణి వంటభారాన్ని కూడా ప్రఫుల్లకు వప్పగించింది. ముగ్గురు కోడళ్ళూ చూస్తూవుండేవారు ఆ పనిని. ప్రఫుల్ల ఎప్పుడైనా తీరిక లేక వంటపని చూడనప్పుడు ఆరోజు వంటకాలు ఎవరికీ రుచించేవి కావు. ప్రఫుల్ల వడ్డించకపోతే ఎవరికీ కడుపునిండా భోజనం చేసినట్లుండేదికాదు. చివరికి నయనతారకూడా ఆమె చెప్పుచేతల్లోకి వచ్చింది. ఇప్పుడామె ప్రఫుల్లను నిందించదు; ప్రఫుల్ల సలహాలేకుండా ఏపనీ చేయదు. నయనతార సంతానాన్ని ఆమెకంటే ప్రఫుల్ల బాగా సంరక్షణచేసేది. ప్రఫుల్ల వచ్చిన తర్వాత పిల్లలపోషణలో ఆమెచాలా నిశ్చింతగా

వుంటోంది. సాగర్ పూర్వంవలె ఎక్కువకాలం పుట్టింట్లో వుండలేకపోయింది- వెంటనే తిరిగివచ్చింది. ప్రఫుల్లవద్దవున్న పూను ఆమెకు చాలా హాయిగావుండేది.

అందరికీ ఈవిషయాలు చాలా ఆశ్చర్యంగా కన్పించేవి, కానీ ప్రఫుల్లకు ఏమీ ఆశ్చర్యంగా లేదు. ప్రఫుల్ల నిష్కామ ధర్మాన్నభ్యసించింది. ప్రఫుల్ల గృహస్థాశ్రమం లోనే నిజమైన సన్యాసిని కాగల్గింది. ఆమె ఏదో ఒకపనిని చేయటంతప్ప మరోకోర్కె ఏదీ వుండేదికాదు. కోర్కె అంటే తన సుఖాన్ని వాంఛించటమనే అర్థం- పని చే[illegible] అంటే ఇతరుల సుఖానికి యత్నంచేయటం. ఆమె ని[illegible]మి, కర్మ పరాయణురాలు. అందుకనే ఆమె నిజమైన సన్యాసిని కాగ ల్గింది. ఆమెస్పర్శ తగిలిన దెల్లా బంగారమవుతోంది. భవానీ ఠాకుర్ సానబెట్టిన దివ్యాస్త్రం ఆమె. అందు కనే ప్రాపంచిక దుఃఖాలను, కష్టాలను సమూలంగా నరికి వేయగల్గింది. ప్రఫుల్ల ఇంతపదునైన దివ్యాస్త్రమని హరవల్ల భుని ఇంట్లో ఎవరికీ తెలియదు. అద్వితీయుడైన ప్రతిభావం తుడు, మహామహోపాధ్యాయుడైన భవానీఠాకుర్ శిష్య రాలామె, గొప్పపండితురాలు. ఆమెకు అక్షరజ్ఞానం వుందని కూడా వారికెవరికీ తెలియదు. గృహకృత్యాల్లో విద్యనుప్రద ర్శించాల్సిన అవసరం వుండదు. విద్యావంతులే గృహాన్ని చక్కగా దిద్దుకోగలరు. కానీ విద్యనుప్రదర్శించే ప్రదేశంకా దని ఇటువంటిచోట్లవిద్యప్రదర్శించేవాళ్ళు కేవలం మూర్ఖులే!

ఇంట్లో ఆమె పోట్లాడేది ఒక్క వ్రజేశ్వరునితోనే. 'నే నొక్కదానినే భార్యను కాను; మీరునాకెలా భర్తో,



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B200 |
| పుస్తకం పేరు | దేవీనివాసం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 215 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 33,34 |
| తయారు చేసినది | APSar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |